# దిగంతాలకు

[ నవల ]

రచన:

నందూరి విఠల్

యం. శేషాచలం అండ్ కంపెనీ

మద్రాసు : మచిలీపట్టణం : సికిందరాబాదు

DIGANTALAKU : An original new novel by Nanduri Vitthal. Published by M. Seshachalam & Co., Madras, Machilipatnam, Secunderabad. Price : Paper back Rs. 2-50 & Hard bound Rs. 3-50.

Second Edition : November, 1965.



Cover Design : Gangadhar.

ద్వితీయ ముద్రణ :
నవంబరు, 1965



ప్రచురణ :
యం. శేషాచలం అండ్ కో
మద్రాసు : మచిలీపట్టణము : సికిందరాబాదు

ముద్రణ:
వెల్డన్ ప్రెస్,
146, టి. హెచ్. రోడ్డు, మద్రాసు-21

వెల : సాదా రూ. 2-50; మేలు రూ. 3-50.



Regd. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారి
'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక,
చందాదారులకు ప్రత్యేక ప్రచురణ.

ప్రాప్తిస్థానం :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు :: సికిందరాబాదు.

# దిగంతాలకు

# 1

అనంతమైన దీ జీవనయాత్ర. అతి గంభీరమైన ఈ మహా ప్రవంతిలో ఎన్ని విషాదతరంగాలు, ఎన్ని సంతోష సాగరాలు అంతర్వాహినులై మహాయానం సాగిస్తున్నవో? ఎన్ని నిమ్నోన్నతాలనధిగమించి, ఏగమ్యాన్ని కాంక్షించి, ఏ దిగంతాలకు సాగిపోతున్నదో ఈ చైతన్యతరంగిణి? ఏ అతీతశక్తి ఈప్రవాహాన్ని నడిపిస్తున్నదో? ఏ అజ్ఞాత వ్యక్తి ఈమహానాటకానికి సూత్రధారుడో? ఎవరు తెలుసుకోగలరు? ఎవరు శోధించగలరు? ఎవరు పరిష్కరించగలరు?

రెలు ప్రయాణీకుల్లాగా ఈ జీవితయాత్రలోగూడా ఎందరో వ్యక్తులు తారసిల్లుతుంటారు. కొందరు దగ్గర కొస్తారు; కొందరు దూరంగా పోతారు. కొన్ని పరిచయాలు కొంతకాలందాకా విడిచిపెట్టకుండా వెంబడిస్తాయి; కొన్ని

జీవితాంతంవరకూ నీడిస్తూ నిలుస్తాయి. మరికొన్ని పరిచయాలు బ్రతికినంతకాలం నిప్పులు కురిపిస్తూ అగ్నిగుండాల్లోకి తరుముకుపోతాయి. పరిచయం పండి స్నేహమై, ఆత్మీయత అనురాగం పెరిగి, అనుబంధం రెండుప్రాణుల్ని ఏకం చేస్తుంది. ఆ బంధాలుగనక సడలిపోతే తాడు తెగిన గాలిపటంలాగ, ఒక గమ్యం అంటూ లేకుండా, బ్రతుకు తేలిపోతుంది. ఒకబంధం విడిపోతే మరొకబంధం కదలనీయదు. లతలా పెనవేసుకుపోతుంది. ఒకోస్నేహం ఆవిరైపోతుంది; మరో స్నేహం విరియబూస్తుంది. ఒక ఆశ నశిస్తుంది; మరొక ఆశ చిగురిస్తుంది. ఎంత వద్దనుకున్నా జీవితం నడిచే తీరు ఇలాగే వుంటుంది. ఇట్లా వచ్చేవీ, పోయేవీ అన్నీ ముద్దచేస్తే మనిషిజీవిత మైంది.

ఆరోజు సాయంత్రం వేణుగోపాల్ ఎగ్జిబిషన్‌కు వెడుతూ బాలాంబగారి ఇంటిదగ్గర ఆగాడు. బయలుదేరేటప్పుడు వాళ్ళింటిదగ్గర ఆగాలని అనుకోలేదు. కాని-వాళ్ళింటి మీదుగా పోతున్నప్పుడు అతని కాళ్ళు తెలియకుండానే అతన్ని నిలబెట్టాయి. ఒక నిమిషం తటపటాయించి, చివరకు గేటుతీసుకొని లోపలకు వెళ్ళి మండువాతలుపు తట్టాడు. బాలాంబ తలుపు తెరిచింది. ఎర్రగా, పల్చగా వున్న బాలాంబను చూస్తే ఆమె జయలక్ష్మితల్లి అని ఎవరూ అనుకోరు. చూడటానికి తల్లీకూతుళ్ళు అక్కచెల్లెళ్ళలాగ వుంటారు. బాలాంబలో వున్న చైతన్యం జయలక్ష్మిలో

లేదు. బాలాంబ నడవడినిగురించి చాలా కథలు ప్రచారంలో వున్నాయ్. అయితే అందులో నిజానిజాలు ఆమె అంతరాత్మకూ, ఆ పరమాత్మకూ తప్ప మూడోవ్యక్తికి తెలియడానికి అవకాశం లేదు. కాని-అందరికీ తెలిసింది ఒక్కటే-ఆమె వివాహం చేసుకోకుండానే జయలక్ష్మిని కని, సాకుతూవస్తూందనే సత్యం! ఈసత్యపు నీడలో ఎన్ని అసత్యాలైనా పుట్టడానికీ, పెరిగి మహావృక్షాలు కావడానికీ అవకాశం వుంది మరి! కాని-బాలాంబముఖంలో ఎప్పుడూ భర్త లేడనే లోటు ఎవ్వరికీ కనిపించలేదు. ఆకుపచ్చ నైలాన్ చీరలో ఆకులచాటున పరిపూర్ణంగా వికసించి, ఎప్పటికీ వాడని ఎర్ర గులాబీలాగ తొంగిచూస్తున్నది.

'రా నాయనా ఎగ్జిబిషన్ కు బయల్దేరావా ?' బాలాంబ నోటినిండా పిలుస్తుంది. వేణుని వాళ్ళమ్మ ఒక్కతే అంత ఆప్యాయంగా పిలిచేది.

'కానండీ! జయలక్ష్మి ఇంట్లో వుందా?'

'గదిలో జడ అల్లుకుంటూంది. ఏమన్నా పనుందా?'

'లేదండీ! ఊరికినే.'

'కూర్చో నాయనా! పిలుస్తాను.' అంటూ జయలక్ష్మిని కేకపెట్టింది బాలాంబ. 'వస్తున్నా నమ్మా! రెండు నిమిషాలు.' అంటూ గదిలోనుంచే సమాధానం చెప్పింది జయలక్ష్మి.

సోఫాలో కూర్చున్నాడు వేణు. ఆ ఇంటికి తనురావడం ఇది మూడోసారి. బాలాంబ వుండగా రావడం యిదే. ఏమిటో ఇరుగ్గా వున్నట్టు ఫీలయ్యాడు. మాట్లాడటానికి

ఏమీ తోచలేదు. గది నాలుగుపక్కలా కలయజూశాడు. కొత్తగా సున్నం వేసిన గోడమీద రాధామాధవుల బొమ్మ అందంగా వుంది. నల్లచావకర్రతో మెరుస్తున్న మేజా- దానిమీద బుక్ షెల్ఫ్, పక్కన రేడియో, వాజ్‌లో వాడని గులాబీలూ అధునాతనత్వాన్ని చాటుతున్నాయ్ ! పంకా తిరుగుతున్న సవ్వడితప్ప మిగిలినదంతా వికృతమైన నిశ్శబ్దం !

'జయలక్ష్మి నీగురించి చెబుతూవుంటుంది. నువ్వు చాలా చురుకైనవాడివనీ, ఎప్పుడూ నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ వుంటావనీ అంటూవుంటుంది.' బాలాంబమాటలు ఆ నిశ్శబ్దాన్ని భంగంచేశాయి. దానికేం జవాబు చెప్పాలో తెలియక వేణు మందహాసం చేశాడు. ఇటువంటి పొగడ్తలు మనిషిని చాలా ఇరుకులో పెడతాయి. చిరునవ్వు తప్పితే అటువంటిసమయంలో జవాబు ఏమివ్వాలో అర్థంగాదు.

'మీ అమ్మగారికి వంట్లో బాగుండలేదని విన్నాను. ఇప్పుడు కులాసాగా వున్నారా' అంది ఆవిడ ప్రసంగం మారుస్తూ.

'మాఅమ్మ ఆరోగ్యమే బాగుండలేదండీ. కోరింత దగ్గు పట్టుకుని పీడిస్తున్నది. అందులో ఇది శీతాకాలం కూడాను' అన్నాడు వేణు.

'మీ మామయ్య డాక్టర్ గదుటయ్యా?'

'నర్సింమూర్తి మామయ్యేనా ! ఆయన ఒక్క డాక్టరేమిటి లెండి! ఆయనకు తెలియని విద్య ప్రపంచంలో వుంటుందనుకోను. ఆయన మాకు మేనమామ అవడం

నిజంగా మా అదృష్టం.' వేణుకళ్ళు గర్వంతో మెరిశాయి.

'అన్నట్టు మా మామయ్య మీకు తెలుసా?'

'ఆయన తెలియకపోవడమేమి నాయనా! తరచూ మాయింటికి వస్తూవుంటారుగా!' అంటూ నవ్వింది బాలాంబ.

మామయ్య బాలాంబకు ఎట్లా తెలుసో అడిగే ధైర్యం వేణుకు లేదు. జయలక్ష్మిగూడా మామయ్య తెలుసని చెప్పలేదు. బాలాంబకూ, మామయ్యకూ వున్న పరిచయం ఎటువంటిది ? బాలాంబ కథానాయికగా చెప్పుకుంటున్న అనేక కథల్లో నర్సింమూర్తి మామయ్యగూడా ఒక కథకు నాయకుడా? ఏమో మరి! సృష్టిలో ఎవరిశక్తియుక్తులకూ లొంగకుండా తన మనస్సాక్షినే నమ్ముకున్న అతీతవ్యక్తుల్లో మామయ్య ఒకడు! అతను ఎక్కడ మునుగుతాడో, ఎక్కడ తేలతాడో ఎవ్వాళ్ళకీ అర్థంగాదు. ఆయన నలభై అయిదు సంవత్సరాల జీవితంలో కొన్ని శతాబ్దాల అనుభవం గూడుకట్టుకున్నట్టు కనిపిస్తుంది. స్త్రీ సౌందర్యాన్ని జయించినట్టు కనిపించే మామయ్య బాలాంబ ముందు పరాజితుడు కాలేదుగదా! మామయ్యఓడిపోవడం అసాధ్యంగా కన్పించలేదు వేణుకు. ఆయన పెళ్ళి చేసుకోలేదు. ఏవిషయాన్ని గురించీ సూటిగా చెప్పడు. డబ్బంటే ఆయనకు లక్ష్యం లేదు. ఆలోచనాప్రవాహంలో కొట్టుకుపోతున్న వేణును-బాలాంబ-జయలక్ష్మిని పిలుస్తున్న కేకతో ఈలోకంలోకి వచ్చేలాగ చేసింది.

బోర్డరులేని తెల్ల వాయలుచీర, పసుపుపచ్చచుక్కల నల్లటి జాకెట్టు తొడుక్కొని, జడచివర రిబ్బనుకుచ్చు పెట్టు

కుంటూ వచ్చింది జయలక్ష్మి. పదిహేడుసంవత్సరాలకే ఆమెయౌవనం పరిపూర్ణంగా వికసించి, పాలసముద్రంలాగ, కోర్కెల కెరటాలతో పొంగుతూంది. సృష్టిలోని సుఖ శాంతులూ, ఆనందం, మాధుర్యం, కన్నీరూ, సుందర స్వప్నాలూ అన్నీ ఒకటొకటే కోర్కెలై, అలలుగా విజృం భించి ఆమెలోనే ఐక్యమైపోతున్నాయి. ఏదో మహా కార్యాన్ని సాధించడానికి స్త్రీరూపంలో భగవంతుడు నిర్మిం చుకున్న మారణాయుధాలలో జయలక్ష్మి ఒకతె! స్త్రీశక్తి స్వరూపిణి అంటారు. ఆటంబాంబుకూడా శక్తిస్వరూపిణే మరి! మనిషి తనచేత తయారైన ఆటంబాంబుకు లొంగినట్టు భగవంతుడుకూడా స్త్రీకి దాస్యమే చేస్తాడు. నర్సింమూర్తి భగవంతుడికంటేకూడా అధికమేమో! ఈరహస్యం బాలాంబకే తెలియాలి.

పంకాగాలికి జయలక్ష్మి ముంగురులు లేచితడి ఆరని తిలకాన్ని అద్దుకున్నాయి. తలలోని మొగలిరేకుల సువాస నలు యవ్వనమాధుర్యంలా, కనిపించకుండా వాతావరణాన్ని మత్తెక్కించి కలుషితం చేస్తున్నాయి. తలస్నానానికీ, స్త్రీ సౌందర్యానికీ ఏదో జన్మాంతరసంబంధంలాంటిది వుందని పిస్తుంది. అలంకారాలతో, ఆభరణాలతో వెర్రిగా అలంక రించుకునే ఆడవాళ్లు జయలక్ష్మిదగ్గర కొన్నాళ్లు చదువు కుంటే బాగుండును.

'నువ్వు వస్తావని అనుకుంటూనే వున్నాను వేణూ!' అంటూ ఠీవిగా కూర్చుంది జయలక్ష్మి. పూర్వం మహా రాణీల పోలికలు జయలక్ష్మిలో వున్నాయనిపిస్తుంది. ఆమె

తీవిగా నడుస్తుంది. హుందాగా మాట్లాడుతుంది. మళ్ళీ అంత హుందాగానే నవ్వుతుంది. ఆమె ఏడుపు ఎట్లా వుంటుందో చూడాలనిపించింది వేణుకు. సామ్రాజ్యాన్ని కోల్పోయిన మహారాణీలా తీవిగా కన్నీరు కారుస్తుందా? ఏమైనా జయలక్ష్మి కన్నీరు చూడాలి. ఎంత చిత్రమైన కోరిక.

తన అందం ఎంత తీవ్రమైందో జయలక్ష్మికి తెలుసు. సృష్టికర్తకు స్త్రీ ఆయుధమైతే, స్త్రీకి అందం, యౌవనం రెండూ రెండాయుధాలు. ఈ రెండిటినీ కలిపి ప్రయోగిస్తే ఎంతటి మానవుడైనా లొంగి, ఆస్త్రీ పాదాలదగ్గర దాస్యం చేస్తాడు; కవిత్వం రాస్తాడు; హత్యలు చేస్తాడు; రాజ్యాలు జయిస్తాడు. మానవాళిని జయించిన మహాబలసంపన్నులు- అలెగ్జాండర్, చెంఘిజ్ ఖాన్, నెపోలియన్, హిట్లర్, అర్థం కాని నర్సింమూర్తి - ఎవ్వరూ దీనికి అతీతులు కారు.

చాకలికి బట్టలు వెయ్యడానికి మండువాలోకి వెళ్ళింది బాలాంబ.

'ఎక్కడికీ బయల్దేరినట్టున్నావ్?' సంభాషణ సాగించింది జయలక్ష్మి.

'నీతో కలిసి ఎగ్జిబిషన్ కు వెడదా మనుకుంటున్నా!'

'నేను వస్తానని నీ కెలా తెలుసు?'

'రాకపోతావా అనుకున్నా!'

'అలాగా! సరేగాని - నాగురించి నువ్వేమనుకుంటున్నావ్ వేణూ!'-ముందుకు వంగి వేణూకేసి కుతూహలంగా చూసింది.

'ఏముంది అనుకోవడానికి?' ఆశ్చర్యంగా చూశాడు.

'నీ మనసులో ఏముందో గ్రహించే శక్తి నాకుంది వేణూ! నేను చెప్పనా?' అతని కళ్ళల్లోకి చూసింది.

'చెప్పు!'

'ఈ జయలక్ష్మి ఎటువంటిది? దీని స్నేహం నమ్మ వచ్చా? నాలాంటివాళ్లు దీనికి ఎంతమంది వున్నారు-ఇట్లాగే ఆలోచిస్తున్నావ్ గదూ! అవునా?' నవ్వింది జయ.

'ఛ! అదేం గాదు జయా!'

'నాకు తెలుసు వేణూ! నన్ను గురించి లోకం ఏమను కుంటోందో! అదిగాక మాఇంటికి వచ్చే ప్రతివ్యక్తికీ కలిగే సందేహాలు ఇవే. అందరితోపాటు నువ్వూ నాగురించి అను కోవడంలో ఆశ్చర్యం లేదుగా!'

ఎంత సూటిగా మాట్లాడుతుంది జయలక్ష్మి!

ఏదో చెపుదామనుకున్న వేణునోటికి బాలాంబ రావడంతో తాళం పడ్డది.

'ఎగ్జిబిషన్‌కు వెడుతున్నామమ్మా!' అంది జయలక్ష్మి.

'ఇవాళ వెళ్ళకపోతే ఏం? రేపు మనిద్దరం వెడ దాం.' అంది బాలాంబ.

జయలక్ష్మి తల్లిమాట వినిపించుకోలేదు.

'ఫర్వాలేదులే! రా వేణూ!' అంటూ లేచింది.

'వస్తానండీ!' అని బాలాంబకు చెప్పి బయటకు వచ్చాడు. అతని మనస్సు తత్తరపాటు చెందుతూంది. చంద్రమండలానికి మొదటిసారి ప్రయాణంచేసే యాత్రికుడి మనసులాగ వుంది. జయలక్ష్మితో కలిసి తా నెన్నడూ అలాగ వెళ్ళలేదు. జయలక్ష్మికి ఇంట్లో అంత స్వాతంత్ర్యం

వుందనిగూడా తా ననుకోలేదు. వీధిచివర కూడలిలో ఆటో రిక్షా లున్నాయి. జయలక్ష్మి పక్కన కూర్చుని తను ఆటో రిక్షాలో ప్రయాణం చెయ్యడం ఒక కొత్త అనుభవం. ఆమెతో మాట్లాడటం సాహసం అనిపిస్తోంది. ఇందాకా జయ లక్ష్మి అన్న మాటలమీద తన అభిప్రాయం చెప్పా లను కున్నాడు. కాని - ఎందుకనో, ఎవరో నోరు నొక్కేసిన ట్లయింది. 'జయలక్ష్మీ! నీమీద నాకెటువంటి దురభిప్రాయం లేదు. న న్నపార్థం చేసుకోకు!' అనుకున్నాడు మనసులో. జయలక్ష్మి మౌనంగా కూర్చుని ఆకాశంలో తేలిపోయే మేఘాలను చూస్తోంది. అవి వర్షించే దెపుడో ఎవరికి తెలుసు? ఇద్దరి మనసులూ బరువుగా వున్నాయి.

# 2

ఆటోరిక్షా రీగల్ టాకీసుముందు ఆగింది.

'మనం ఎగ్జిబిషన్ కు వెడదా మనుకున్నాంగదూ!' అన్నాడు వేణు ఆశ్చర్యంగా.

'సినిమా చూడటానికి అభ్యంతరమా?' ఎదురు ప్రశ్నించింది జయలక్ష్మి.

'అబ్బే! అదేం లేదు' అన్నాడు వేణు.

టిక్కెట్లు తీసుకుని బాక్సులో కూర్చున్నారు. ఆట మొదలుపెట్టారు. "The End of Love" అనే ఇంగ్లీషుసినిమా. సినిమాపేరులో అర్థం కన్పించలేదు. ప్రేమకు అంతం

ఏమిటో మరి! 'ప్రేమకు అంతం పెళ్ళి' అంటాడు సత్యమూర్తి. కథ నడుస్తూంది.

ఇద్దరు ప్రేమికుల కథ అది. వాళ్ళు పూర్తిగా అపరిచితులు. అపరిచితుల్ని ఆత్మీయులుగా చేసే శక్తి యౌవనంలో వుందని సినిమా సారాంశం. వాళ్ళిద్దరూ ఒక రైల్వే ప్లాట్‌ఫారంమీద కలుసుకుంటారు. అర్ధనగ్నంగా ఆమె అందాన్ని క్లోజప్ తీశాక - పందెపుగుర్రాన్ని చూపెట్టాడు కెమెరామాన్. ఈ రెండింటికీ అన్వయందొరక్క - ఆమె అందాన్ని పందెపుగుర్రంతో పోల్చాడు దర్శకుడు అనుకున్నాడు వేణు.

జయలక్ష్మి సినిమా చూస్తున్నట్టు లేదు. నుదుటిని వేళ్ళతో రుద్దుకుంటూంది.

'తలనొప్పిగా వుందా జయలక్ష్మీ!' అన్నాడు వేణు.

లేదని తల తిప్పింది.

ఒకరైలు అటునుంచి వస్తోంది; మరొక రైలు ఇటునుంచి పోతూంది. అవతలిరైల్లో ఆ పందెపుగుర్రంలాంటి అమ్మాయి వుంది; ఇవతలిరైల్లో ఈ అబ్బాయి వున్నాడు. రెండు రైళ్లూ ఢీకొని పెట్టెలు విరిగిపోతాయి. ఆమె కెవ్వున కేకపెట్టి పెట్టెలోంచి పడిపోతుంది; ఇతను శరవేగంతో వెళ్ళి, ఆమెను లేవదీసి ముద్దుపెట్టుకుంటాడు. ఆమె అతన్ని లాగి లెంపకాయ కొడుతుంది. ప్రళయప్రభంజనంతో ఉవ్వెత్తున లేచిన భీకరసముద్రపు కెరటాలలాగ ఆమెగుండెలు ఎగిరిపడ్డాయి. అతను విపరీతంగా జాలిపడి ఆమెను దగ్గరకు

తీసుకుంటాడు. కౌగిలివెచ్చదనంలోకన్నెపిల్లకోపం వెన్నలా కరిగిపోతుంది.

సినిమాకథ అయోమయంగా వుంది. జయలక్ష్మి శరీరం అలవోకగా వేణుకు తగులుతూంది.

వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవా లనుకుంటారు. హీరో తాలూకు ఒక పెద్దమనిషివచ్చి 'ఈపెళ్ళి చేసుకోవ'ద్దంటాడు. ఇక్కడ హాలీవుడ్ వాళ్లు ఏ తెలుగుసినిమాలో ఘట్టాన్ని కాపీ కొట్టా రనిపించింది. ఆమె ఇంతకుముందు ఇద్దర్ని ప్రేమించి విషం పెట్టి చంపిందట! నిరూపించమంటాడు హీరో! అందుకు తగిన ఆధారాలు లేవంటాడు ఆ పెద్ద మనిషి. మొత్తంమీద పెళ్లి ఆగిపోతుంది.

జయలక్ష్మి సినిమా చూడటం లేదు. వేణుమీదకు కొంచెం వాలి నిద్దరపోతూంది.

'నిద్రపోతున్నావా జయలక్ష్మీ!' అన్నాడు వేణు.

లేదని తలూపింది జయలక్ష్మి.

ఆ హీరో ఇంకొక అమ్మాయిని పెళ్లిచేసుకొని హానీ మూన్ వెడుతూంటే, దోవలో పెళ్లి చెడగొట్టిన పెద్దమనిషి వచ్చి తాను చాలా పాపం చేశాననీ, ఆమెగురించి తాను చెప్పినదంతా అసత్యమనీ, ఆమె చాలా ఉత్తమురాలనీ, దురదృష్టవశాత్తూ అపవాదులకు లోనైందనీ, ఆ హీరోను క్షమించమనీ కోరతాడు. దాంతో కథ అయిపోతుంది.

అతనికి అర్థమైన కథ ఇది. (అసలు కథ ఇది ఔనో కాదో మరి) లైట్లు వెలిగాయి. జయలక్ష్మికళ్లనుంచి వెచ్చటి నీటిబిందువులు మరి వేణుచేతిమీద పడ్డాయి. అతను

ఉలిక్కిపడ్డాడు. జయలక్ష్మిమీద విపరీతమైన జాలి కలిగింది.

'జయా! ఎవరైనా సినిమా చూసి చంటిపిల్లలాగ ఏడుస్తారా?'

—అతనికంఠంలో ఆత్మీయత తొణికిసలాడింది.

'నేను సినిమా చూడలేదు వేణూ!'

'మరి ఎందుకు ఏడుస్తున్నావ్!' ఆశ్చర్యపోయాడు.

'ఎందుకో ఏడవా లనిపించింది.'

ఇద్దరూ బయటకు వచ్చి టాక్సీ ఎక్కారు. జయ ఎంతో ఆత్మీయురాలైనట్టు వేణుకు కనపడింది. మనుష్యులను కట్టివేసే శక్తి కన్నీటిలోగూడా వుంది.

ఇంటికి వస్తూవుండగా అడిగింది జయలక్ష్మి—

'వేణూ! ప్రతిప్రాణికీ ఏదో ఒక క్షణంలో ఒక గడ్డిపోచైనా దగ్గరగా వుండా లనిపిస్తుంది. చివరకు ఆదే పామై కరుస్తే ఏం చెయ్యాలి చెప్పు?'

వేణుమనసు వికలమైంది.

'ఎందు కలా బాధపడతావ్ జయా! ఇందాకా సినిమాలోగూడా కంట తడిపెట్టావ్? ఏమిటి నీ ఆవేదన?'

'...........'

'చెప్పు జయా! నేను నీకు ప్రాణస్నేహితుడ నని నమ్ము. నాతో చెప్పు నీబాధ. నేను వీలైనంత సహాయం చెయ్యడానికి ప్రయత్నిస్తాను. నన్ను నమ్ము జయా!' ఆవేశంతో అన్నాడు వేణు. ఆమె చెక్కిళ్లను చేతితో అదుముతూంటే, నిర్మలమైన ప్రేమానురాగాలు పెరిగి, అతని కన్నులనుండి ఆమెనుదుటిపై బడ్డాయి.

'నీకు తెలియదు వేణూ! నాకు జీవితంలో ఏదీ సాధ్యం గాదు. అన్నీ నాకు అందకుండా పోతున్నాయి' అంది జయలక్ష్మి, బరువుగా.

'నీ బాధేమిటో నాకు చెప్పు జయా! నాదగ్గర దాచ బోకు.'

'చెప్తాను. తప్పకుండా చెప్తాను వేణూ! నీకైనా చెప్పకపోతే నాగుండె పగిలిపోతుంది. కాని...ఇప్పుడు గాదు. ఎప్పుడు చెప్పాలో నాకు తెలుసు.'

బరువుగా నిట్టూర్చాడు వేణు.

జయలక్ష్మిని ఇంటిదగ్గర దిగబెట్టి ఇల్లు చేరుకున్నాడు వేణు. రాత్రి పదికావస్తోంది.

# 3

ఆరాత్రి జయలక్ష్మితో సినిమాకు వెళ్ళిరావడంతో అందటానికి వీల్లేని అపురూప సౌందర్యమేదో తనకి అందినట్లనిపించింది వేణుకు. మర్నాడు మళ్లా జయలక్ష్మి ఇంటికి వెళ్లాలనుకున్నాడు. కాని, వెళ్ళలేకపోయాడు. రాత్రిభోజనంచేసి వరండాలో ఈజీచైర్‌లో కూర్చునివుండగా, బయటనుంచి సత్యమూర్తి కేక విన్పించింది.

సత్యమూర్తికీ, వేణుగోపాల్‌కూ చిన్నప్పటినుంచి స్నేహం. సత్యమూర్తి కోఆపరేటివ్ బ్యాంకిలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు.

'సినిమాకు వెడదాం వేణూ!' అన్నాడు.

'ఇవాళ సినిమా చూడాలని లేదురా!'

'ఏమిటోయ్ విశేషం?' అన్నాడు సత్యమూర్తి వేళా కోళంగా.

'నీతో కొన్ని ముఖ్యవిషయాలు చెప్పాలి మూర్తీ! ఇవ్వాళ ఆ ప్రోగ్రాం కాన్సిల్ చేదాం. అట్లా వెడదాం పద.' అన్నాడు వేణు.

ఇద్దరూ హుసేన్ సాగర్ దాకా నడిచారు. రోడ్డు పక్కన సిమెంటు బెంచీలమీద కూర్చున్నారు. వేణు చెప్పడం మొదలుపెట్టాడు. సూర్యుడు అస్తమించాడు. హుసేన్ సాగర్‌లో నీళ్లు నిశ్చలంగా వున్నాయి.

'ఏదో ప్రేమకథ చెపుతున్నానని తీసిపారెయ్యకు సత్యమూర్తీ! నా ఇరవైనాలుగేళ్ళ జీవితంలో ఎన్నడూ కలగనంత సంచలనం ఇవ్వాళ నాలో కలుగుతూంది. ఒక అమ్మాయిని చూశాను. పరిచయమైంది. అది స్నేహంగా - గాఢస్నేహంగా పరిణమించింది. ఆ అమ్మాయినిగురించి, ఆ కుటుంబాన్ని గురించి చాలా అపవాదులు వున్నాయ్. కాని-నాకు అవి నమ్మాలనిపించడం లేదు. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే-నా జీవితం సుఖంగా గడుస్తుం దనిపించింది. ఆ కోరిక బలీయమై నాలో వేళ్లు పాతుకుపోయింది. అది తీరడానికి అవసరమైతే ఏత్యాగమైనా చేస్తాను. ఇదీ కథ సత్యమూర్తీ!' వేణు భారంగా శ్వాస వదిలాడు.

'ఇంతకీ ఆ అమ్మాయి ఎవరు?' సిగరెట్టు ముట్టించాడు సత్యమూర్తి.

'సెక్రటేరియట్ చౌరస్తా దక్షిణపుసందులో ఒక సింహాల మేడుంది చూశావ్! ఆ ఇంట్లో వుంటుం దా అమ్మాయి.'

'కొంపదీసి బాలాంబకూతురు జయలక్ష్మి కాదు గదా!' ఎగిరిపడ్డాడు సత్యమూర్తి.

'నీకు వాళ్లు తెలుసా?' ఆశ్చర్యంగా అడిగాడు వేణు.

'వాళ్ళగురించి నాకు చాలా తెలుసు వేణూ! బాలాంబ అగ్నిహోత్రంలాంటి కులీన బ్రాహ్మణకుటుం బంలో పుట్టింది. ఆవిడతండ్రి అవధానిగారు గన్నవరం జమీందారుదగ్గర తాణేదారుగా పనిచేశాడు. బాలాంబకు యుక్తవయసు రాగానే నిక్షేపంలాంటి సంబంధంచూసి ముహూర్తం పెట్టారు. రేపు తెల్లవారుఝామున పెళ్ళి అనగా-బాలాంబ అదృశ్యమైంది. అదేరోజు ఆఊళ్ళో మున్సబు నాయుడుగూడా మాయమయ్యాడు. అందరూ బాలాంబ నాయుడుగారితో లేచిపోయిందని అనుకున్నారు. కాని, వారం తిరక్కుండానే నాయుడు తిరిగి వచ్చాడు. బాలాంబమటుకు ఈనాటికీ గన్నవరంలో అడుగుపెట్టలేదు. కాని-బాలాంబను ఎవరు తీసుకుపోయారో, నిక్షేపంలాంటి సంబంధం వదులుకుని ఎందుకు అట్లా తెగించి జీవితాన్ని నాశనం చేసుకుందో, ఎవరి పోషణలో ఇన్నాళ్లూ జీవించి ఇన్నిలక్షల ఆస్తి గడించిందో అది ఎవరికీ తెలియదు. కాని అందరికీ తెలిసిన విషయం ఒక్కటే...'

సత్యమూర్తి ఆగాడు.

'ఏమిటది?'

'ఆ కుటుంబం మంచిది కాదనే విషయం!'

'అది చాలా ఘోరం మూర్తీ! ఒక కుటుంబంగురించి ఏమీ తెలియకుండానే వాళ్ల మంచిచెడ్డలగురించి తీర్పు చెప్పడం చాలా అన్యాయం. అది హత్య చెయ్యడంకంటే కూడా మహాపాపం!' అన్నాడు వేణు.

'నువ్వా జయలక్ష్మి ప్రేమలోగనక పడకపోతే అందరితోపాటు నువ్వూ వాళ్ల గురించి అట్లాగే అనేవాడివి.'

'నువ్వు చాలా పొరపాటుగా ఊహిస్తున్నావ్ మూర్తీ! ప్రేమించినా-విసర్జించినా నాకు జయలక్ష్మి గురించి చాలా ఉన్నతమైన అభిప్రాయం వుంది.' అన్నాడు వేణు. అతని మాట భారంగా వుంది.

'సరే! ఆ విషయం అట్లా వుంచు. మొదట అసలు ఆమెతో నీకు ఎట్లా పరిచయం జరిగింది?'

'క్రితంసారి యూత్ ఫెస్టివల్.'

'ఆమె నీ క్లాసన్నా కాదు. కనీసం కాలేజీ అన్నా కాదు. ఒకవేళ పరిచయమైనా ఇంత ముదరటం విశేషం గాదూ!' అన్నాడు మూర్తి అదోకరకంగా.

వేణు అది గమనించినట్లు లేడు.

'విశేషమో కాదో నాకు తెలియదు మూర్తీ! ఉమెన్స్ కాలేజీనుంచి యూత్ ఫెస్టివల్‌కు వచ్చిన ఆరుగురు ఆడపిల్లల్లో ఆమె కూడా వుంది. వాళ్ళందరికంటే ఆ అమ్మాయి నాట్యం బాగుంది. అందరి దృష్టీ ఆ అమ్మాయి మీదే పడింది. అప్పుడే ఆమె నన్ను ఆకర్షించింది. నాట్యం చేస్తున్నంతసేపూ ముగ్ధుడనై అట్లాగే చూస్తుండిపోయాను.

ఆ తర్వాత వెళ్ళి ఆమెకు కంగ్రాచ్యులేషన్స్ చెప్పాను.'

'ఆ తర్వాత మళ్ళీ మీరు రెప్పుడు కలుసుకున్నారు ?'

'ఒకరోజు బస్ స్టాండ్ దగ్గర కనిపించింది.'

'వెంటనే పలకరించావ్, కదూ !'

సత్యమూర్తి లాయరులాగ అడగటం మొదలు పెట్టాడు.

'ఔను ! పలకరించాను. రోజూ ఆ అమ్మాయి ఉదయం తొమ్మిది గంటలకు అక్కడ కనిపించేది. నేనూ ఆమెతోపాటు బస్సెక్కి వెళ్ళి, ఆమెను ఉమెన్సు కాలేజీదగ్గర దిగబెట్టి, నేను యూనివర్సిటీకి వెళ్ళిపోయే వాడిని.'

'నువ్వు వెంటబడుతున్నట్టు ఆమె గ్రహించిందా ?'

'ఆఁ !— రెండోరోజే గ్రహించింది.'

'ఆ తర్వాత ?'

'మొదటిరోజుల్లో కొంచెం ముక్తసరిగా మాట్లాడు కునేవాళ్ళం. ఆ తర్వాత ఆమెకు కావల్సిన నవలలూ-అవీ తెచ్చి ఇస్తుండే వాడిని.'

'ఇట్లా ఎన్నాళ్లు గడిచింది ?'

'మూడు నెలలు ! ఆ తర్వాత కథ మారింది !'

'ఎందుకని ?'

'ఒకనాడు అడ్రసు ఇచ్చి 'మా ఇంటికి రండి' అంది. ఏదో మాట్లాడాలని చెప్పింది.'

సత్యమూర్తి ఆశ్చర్యంగా చూశాడు. ఆ చూపులో కొంచెం అసూయగూడా వుంది.

'వాళ్ళింటికి వెళ్లావా ?'

'వెళ్ళకుండా వుంటానని ఎట్లా అనుకున్నావ్ ? వెళ్ళాను.'

'వెంటపడటం మంచిది కాదని తిట్టిందా ?'

'లేదు.'

'కోపం అభినయించిందా ?'

'లేదు.'

'నిన్ను ప్రేమించా నందా ?'

'లేదు.'

ఈ 'లేదు'తో వళ్లు మండుకొచ్చింది సత్యమూర్తికి.

'మరేమంది !' కాస్త విసురుగా అడిగాడు.

'మధ్యాహ్నం మూడు గంటలకు రమ్మంది. వెళ్లాను. వాళ్లమ్మ సికింద్రాబాదు వెళ్లిందట. చిత్రమేమిటంటే, నేనెంత తత్తరపాటుతో వెళ్లానో, ఆమె అంత సాఫీగా కూర్చునుంది. రమ్మని ఆహ్వానించి కాఫీ ఇచ్చింది. కాసేపు సాహిత్యం గురించీ, ఇంగ్లీషు సినిమాల గురించీ మాట్లాడుకున్నాం. జయలక్ష్మి మెత్తగా నవ్వుతూ అంది: 'మీ వోణుకు తగ్గినట్టుంది. మిమ్మల్ని ఒక విషయం అడగాలని రమ్మన్నాను.'

'ఆమె నిర్మొహమాటం నాకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. 'ఏమిటది ?' అన్నాను తమాయించుకుని.

-'ఖంగారు పడకండి. అనవసరంగా డబ్బుతగలేస్తూ, కాలేజీ పోగొట్టుకుని నా వెంట తిరగటంలో మీ మోటివ్ ఏమిటి ?' అంది.

'ఇట్లాసూటిగా, నగ్నంగా జయలక్ష్మి అడుగుతుందని

నేను కలలో గూడా అనుకోలేదు. పాఠం రాని కుర్రాడు టీచర్ ముందు నుంచున్నట్టు నుంచున్నాను. నోట మాట రాలేదు.

'జయలక్ష్మి మళ్ళీ అంది:

–'మూడు నెలలనుంచీ చూస్తున్నాను. రోజూ ఒక పూటకు పూట నా కోసం వేస్టు చేస్తున్నారు. ఇట్లా తిరిగితే మీరు పరీక్ష లేం వ్రాస్తారు?'

'ఇప్పటికి నా మనస్సు కుదుటపడింది. మామూలు పరిస్థితి కొచ్చాను. ఆమెమీద నాకున్న అభిప్రాయం చెప్పాను. ఆమె చనువును ఆసరాగా తీసుకుని నా పరిస్థితంతా విపులీకరించాను.

–'ఏమిటోనండీ! రోజూ మిమ్మల్ని చూడాలనిపిస్తుంది. ఒకోరోజు ఇంక వెళ్ళగూడ దనుకుంటాను. కాని – నాకు తెలియకుండానే, నా కాళ్ళు లాక్కువస్తున్నాయి. నిజం చెప్తున్నాను. మిమ్మల్ని చూడకపోతే నా కేం తోచదు. మీకు కష్టం కలిగించినందుకు క్షమించండి' అన్నాను.

–'మీరు భలేవారేనండి! మీ అంత వెర్రివాళ్లు నా కెక్కడా కనిపించలేదు. నన్ను చూసినంత మాత్రాన మీ కొచ్చే లాభం ఏమిటి చెప్పండి? ఎవరన్నా చూసినా బాగుండదు. ఫలానావాళ్ళ అబ్బాయి ఆడపిల్లలవెంట ఇట్లా తిరుగుతున్నాడంటే, ఆనక బాధపడేది మీరే.'

–'అటువంటిబాధ నాకంటె మీకే ఎక్కువనుకోండి.'

–'నా సంగతి వదిలేయండి. చూడండి. వేణుగోపాల్ గారూ! నేను మీ మేలు కోరి చెపుతున్నాను. మీ రింక

అట్లా వెంటపడటం మంచిది కాదు' అంది.

-'మరి నేను మిమ్మల్ని చూడాల్సివస్తే?' నా ప్రశ్న నాకే నవ్వు తెప్పించింది.

-'అంతగా మీ కెప్పుడైనా చూడాలనిపిస్తే - మా యింటికి రండి. అదైనా తరచుగా రావడం మంచిది గాదు. ఐదారు నెలల కొకసారి రండి. అట్లా అయితే నాకు అభ్యంతరం లేదు' అంది.

-'జయలక్ష్మి! నామీద కోపం వచ్చిందా?'

-'కోపం రాలేదు. కాని - మీ క్షేమం కోరి కాస్త గట్టిగా చెప్పాను. ఏమీ అనుకోకండి. మీరు వయస్సులో నాకంటే పెద్దవారైనా - ఇంతవరకూ ఇటువంటి విషయాలు ఆలోచించే అవకాశంగాని, అవసరంగాని రాలేదు. చాలా టైమైంది. ఇంక వెళ్ళిరండి' అంది.

'నేను వచ్చేశాను.'

-'ఆ తర్వాత జయలక్ష్మియింటికి ఎప్పుడెళ్లావ్?' అన్నాడు సత్యమూర్తి.

'ఆ మర్నాడే వెళ్ళాలనిపించింది. కాని - వెళ్ళలేక పోయాను. ఏరోజు కారోజు వెళ్ళాలనుకోవడం, మర్నాటికి వాయిదా వెయ్యడం జరిగింది. నాలుగు నెలలు పోయాక ఓసారి వెళ్ళాను. ఆరోజు అదృష్టవశాత్తూ వాళ్ళమ్మ ఇంట్లో లేదు. చాలాసేపు కూర్చున్నాం. ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. ఎక్కడో దివ్యసీమల్లో విహరిస్తున్నట్టు గంటలు క్షణాల్లా గడిచిపోయాయి. ఈసారి జయలక్ష్మి చాలా చనువుగా మాట్లాడింది. ఇదివరకు కంటే ఈసారి ఆమె ఎంతో

ఆత్మీయురాలైనట్టు ఫీలయ్యాను. ఆక్షణంలోనే అనిపించింది- "జయలక్ష్మి తోడుగా వుంటే నా బ్రతుకంతా వెన్నెలే.' అని. కాని - ఆమెకు నాభావం తెలియనివ్వలేదు. మామూలుగా సెలవు తీసుకుని, వచ్చేశాను. మళ్ళీ మొన్నరాత్రి వాళ్ళింటికి వెళ్ళాను. ఈసారి వాళ్ళమ్మ వుంది. ఆవిడకూడా చాలా చనువుగా మాట్లాడింది. ఇద్దరం కలిసి సినిమాకు వెళ్ళాం. అప్పుడొక సంఘటన జరిగింది.' చెప్పడం ఆపి, దూరంగా వస్తున్న లారీకేసి చూశాడు వేణు. రోడ్డువారగా రెండు కుక్కలు పోట్లాడుకుంటున్నాయి. సత్యమూర్తి బెడ్డలు విసిరి వాటిని దూరంగా తరిమాడు.

'అయితే సినిమాలో మీ ప్రేమ మహోన్నత శిఖరాల నందుకొనివుండాలి. అవునా?' సత్యమూర్తి సిగిరెట్టు వెలిగించి 'గుప్పు'ని పొగ వదిలాడు.

'లేదు మూర్తి! అదేమీ జరగలేదు. అసలు జయ సినిమా చూడలేదు. ఆమె హృదయంలో ఏవో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. ఏదో బాధ రంపపుకోతలా ఆమెను చిత్రహింస పెడుతూంది. కాస్త రిలీఫ్‌కోసం సినిమాకు బయలుదేరింది. విషయ మేమిటని ఎంతగానో అడిగాను. ఆమె చెప్పలేకపోయింది. కాని - ఒక్కటిమాత్రం తెలుసుకున్నాను. ఆమె నన్ను ప్రేమిస్తోంది.'

'అట్లా అని నీతో చెప్పిందా?' ఆత్రంగా అడిగాడు మూర్తి.

'నోటితో చెప్పలేదు. ఆమె కళ్ళనుంచి రాలిన నీటి చుక్కలు నా కామాట చెప్పాయి.'

'ఇంత అమాయకుడి వేం వేణూ! ఆడవాళ్ళకు ఏడుపు పిలిస్తే పలుకుతుంది. కన్నీటికే లొంగిపోతారా! అవును లే. నువ్వింకా ఢక్కా-మొక్కీలు తిన్నవాడివి గాదు. కల్లబొల్లి ఏడుపులకు లొంగిపోవడం సహజమే.'

'అట్లా అనకు మూర్తీ! కన్నీటిలో మాలిన్యం వుంటుందనుకోను. ఎందుకో జయను చూస్తే మనసు వికలమౌతుంది. ఆమెకు అండగా నిలబడాలని మనసు ఆరాటపడుతోంది. ఎన్ని అవాంతరాలు వచ్చినా నేను జయను పెళ్ళి చేసుకుంటాను మూర్తీ!' అన్నాడు ఆవేశంగా వేణు.

'వద్దు బ్రదర్! తొందరపడకు. అదీగాక అంత త్వరగా లొంగిపోయే ఆడపిల్లమీద నీ కింకా గౌరవం వుండటం నాకు ఆశ్చర్యంగా వుంది.'

'డొంకతిరుగుడు మాని సూటిగా నీ సలహా చెప్పు మూర్తీ! నాకు నీకన్నా ముఖ్యస్నేహితులు ఎవరున్నారు చెప్పు?'

'ఇందులో డొంకతిరుగుడు ఏం లేదు బ్రదర్. ఆడది తనంతట తాను వలచిరావడంతో లోకువై పోతుంది. మొగవాడు ఒక స్త్రీకోసం ఆరాటపడి-మనసుపడి - ప్రమాదాలు ఎదుర్కొని ఆమెను పొందినప్పుడే అనిర్వచనీయమైన ఆనందం అతనికి దక్కుతుంది అలాగాక పిలవగానే లొంగిపోయే స్త్రీమీద గల గౌరవం తక్షణమే మంచులాగ కరిగిపోతుంది. నాకు జరిగిన ఒక అనుభవం చెప్తాను విను. ఇంతవరకూ ఎవరికీ చెప్పలేదు.' సిగరెట్టుదమ్ము గట్టిగా పీల్చాడు సత్యమూర్తి. 'ఎవడో తాగాడులాగుంది. తూలుతూ, 'నేనే

రాజును రా!' అంటూ రోడ్డుకు అడ్డదిడ్డంగా వెళుతున్నాడు. వాణ్ణి దూసుకుంటూ ఒక చిన్న కారు 'రయ్యిన' వెళ్ళింది.

# 4

'ఈ సంఘటన నేను బి. ఎ. చదువుతున్న రోజులలో జరిగింది. వేసంకాలం శెలవలలో మా మామగారి ఊరు వెళ్ళాను. ఆ ఊళ్ళో వెంగళ్రాయనింగారని ఒక వెలమదొర గారు ఒక అమ్మాయిని వుంచుకున్నారు. ఆమెకోసం ఊరికి దూరంగావున్న మామిడితోటలో మంచి బంగళా కట్టించారు. ఆ తోటకూ, బంగళాకూ నలుగురు వస్తాదుల్నీ, సింహాలలాంటి రెండు వేటకుక్కలనూ కాపలా పెట్టారు. ఆ అమ్మాయిపేరు సరోజ. ఆవిడ అప్సరస అని అందరూ చెప్పుకుంటారు. ఆమె మంచినీళ్లు తాగుతుంటే, ఆనీళ్లు గొంతులోనుంచి కనిపిస్తాయట! ఆమెశరీరం అంటుకుంటే మాసిపోతుందేమో అనిపించేలాగ వుంటుందట! ఆమెబుగ్గలు చిదిమితే పాలుకారేలా వుంటాయట. ఆ అప్సరస-ఆ సౌందర్యరాశి ఆ పరగణాలోనే లేదని చెప్పుకునేవారు. వెంగళ్రాయనింగారు అందుకు పూర్తిగా విభిన్నంగా వుంటారు. నల్లగా ఏనుగుచర్మంలాంటి వొళ్లు-ఎర్రగా నిప్పుల్లాగవుండే కళ్ళు-నిమ్మకాయల్ని నిలబెట్టేటటువంటి కోరమీసాలు-పొట్టిగా, లావుగా, భయంకరంగా వుంటారు. కామన్ సెన్సుబట్టి ఆలోచిస్తే, ఆ సరోజ ఈ దొరగార్ని వలచిందని

తోచదు. ఆ దొరగారే ఈ సరోజను బలవంతంమీద బంధించారేమో ననిపించింది. ఆమెను చూస్తే బాగుండు ననిపించింది. ఆతోటకేసి చూడటమే ప్రాణహాని అనుకున్న కొద్దీ ఆమెకోసం ప్రాణాలు తెగించైనా ఆ ఖైదునుంచి ఆమెను రక్షించా లనిపించింది. ఇంచుమించు పిచ్చివాడినై పోయాను. ఆ బంగళాలో పనిచేసే నౌకర్లను ఆరాతీశాను. ఆ బ్రహ్మాండమైన బంగళాలో ఆవిడ ఒక్కతే ఎట్లా వుంటుందో నాకు అర్థంకాలేదు. రాత్రింబగళ్లూ - నెలలూ సంవత్సరాలూ అలా ఏకాంతంగా జీవించగలగటం నాకు ఆశ్చర్యమనిపించింది. నౌకర్లు చెప్పినది నేను విన్నదానికి సరిపోయింది. ఆమెవయస్సు నలభైలోపేట. ఆమెకు పద హారేళ్ళ కూతు రుందిట. ఆమె బస్తీలో చదువుతూందిట. దొరగారికి వీళ్ళిద్దరిలో ఎవరిమీద అభిమానమో అంతు చిక్కలేదుట. ఇలాగే ఆ ఊళ్ళో వున్నన్నిరోజులూ ఆమె కోసం తపించిపోయాను. రోజూ ఆమెనుగురించి చిత్రమైన కలలు వస్తూండేవి. వెంగళ్రావు అనేరాక్షసుడు ఆమెను బంధించినట్టూ, నేనొక రాజకుమారుడిహోదాలో కత్తుల్లాంటి ఆయుధాలు దూసుకుంటూ అంతఃపురం ప్రవేశించి, ఆ వెంగ ళ్రాయని ఇనుపహస్తాల్లో గులాబిపువ్వులాగ నలిగిపోతున్న సరోజను రక్షించినట్టూ, ఆ నెలజవ్వని నా నులివెచ్చని కౌగి లిలో వాలి సోలిపోయినట్టూ, నేను సరోజా-సరోజా అని కల వరించి మా బావమరిదిని ఉక్కిరిబిక్కిరి చెయ్యడం, వాడు 'దెయ్యం'మని కేక లేస్తూ లేవడం, మా మామయ్య ఆరా తియ్యడం-యిత్యాది కర్మకాండ ఎంతో జరిగింది. ఇంతకూ

నేను చెప్పొచ్చేదేమిటంటే, ఆమెను చూడకుండానే ప్రేమించి ఆరాధించడం మొదలుపెట్టాను. ఆవిధంగా ఆ ఊళ్లో రెండు నెలలు వున్నాను. చివరకు వచ్చేస్తుంటే, ఆమె దర్శనం కలిగింది. రోజూమాదిరి ఆరోజూ తోటచుట్టూ షికారు తిరుగుతూంటే, దివాణంనౌకరు సైగచేసి చూపెట్టాడు. గున్నమావిచెట్టుక్రింద ఆమె అటూ ఇటూ పచార్లు చేస్తున్నది. చాలా దగ్గరనుంచి స్పష్టంగా చూశాను. అందరూ చెప్పుకునేదానికంటే ఆమెఅందం ఇంకా ఎక్కువే ననిపించింది.విద్యుల్లతలాగ వున్నది.ఆమెసౌందర్యాన్నాస్వాదిస్తూ, వెంగళ్రావుచేతిలో, కౌగిట్లో నలిగిపోతున్న నాకు దక్కని ఆ అందాన్ని చూసి జాలిపడుతుండగా 'వెంగళ్రాయనింగారు వస్తున్నా'రంటూ - నౌకరు పరుగెత్తుకొచ్చి, మామూలు ఉళ్లొక్కని నన్ను బయటకు తోశాడు. ఆమెను చూసినప్పటినుంచీ నాబాధ ఇంకా ఎక్కువైంది. ఆమె కోసం ఎంతటి త్యాగమైనా చేయాలనిపించింది. జీవితాంతం ఆమెకు దాస్యం చేయడానికి ఆ ఇంట్లో నౌకరుగా వుండిపోవాలనిపించింది. కాని అనుకున్నవేమీ జరక్కుండానే హైద్రాబాదు వచ్చేశాను. చాలాసార్లు ఆమె గుర్తుకు వచ్చింది. ఈకథ ఇంతకాలం నీకు ఎందుకు చెప్పలేదని నువ్వు అడగవచ్చు. ఆమెవయస్సు నలభై. నాకు అప్పటికి ఇరవై దాటలేదు. ఆమెను ప్రేమిస్తున్నానని ఎవరితో నన్నా చెప్తే, నాకు పిచ్చనుకుంటారు. కామాంధకారంఅంటారు. తాటాకులు కట్టి ఎగతాళి చేస్తారు. అందుకే నీతోకూడా చెప్పలేదు. హైద్రాబాదు వచ్చినా ఆమెను మరిచిపోలేక

పోయాను. ఆమె నాకళ్ళముందు అనుక్షణం కన్పించేది. భోజనం సయించేది గాదు. నిద్రవచ్చేది కాదు. అప్పటి నా పరిస్థితి దొంగకు తేలుకుట్టినట్లయింది. మనసులో దాచుకోలేను. ఎవరితోనూ చెప్పుకోలేను. జీవితంలో ఏదో పోగొట్టుకున్నట్టు పిచ్చిగా తిరుగుతున్నాను. ఆ సమయంలో ఒక స్నేహితుడు కనిపించాడు. జీవితంలో సాధ్యమైన సుఖాన్నంతా త్రాగాలని కాంక్షతో నాలుగులక్షల రూపాయల ఆస్తిని అయిదేళ్లల్లో తగలబెట్టాడు. సుఖపడటానికి మార్గం చెప్పమని అతనిని అడిగాను. డబ్బుంటే స్వర్గాన్ని చూపిస్తానన్నాడు. ఒకరాత్రి వందరూపాయలు తెచ్చియిచ్చాను. వేషం మార్చాను. అందంగా డ్రెస్ చేసుకున్నాను. ఆటో రిక్షా ఒక మేడముందు ఆగింది. నా మిత్రుడు లోపలికి తీసుకెళ్ళాడు. ఇల్లూ సామానూ అంతా జమీందారుల ఛాయాలో వుంది. ఆమె వయ్యారంగా మందహాసంచేస్తూ వచ్చింది. ఆమెను చూడగానే నాకు తల పగిలినట్లయింది. వెన్నుమీద గునపంతో పొడిచినట్టు, భూమి క్రుంగినట్టు, ప్రళయం వచ్చినట్టు తల తిరిగిపోయింది. ఆమె ఎవరోగాదు! వెంగళ్రాయనింగారు స్వంతంచేసుకున్న సౌందర్యదేవత సరోజ !!'

'నిజంగానా ?' ఆశ్చర్యపోయాడు వేణు.

'నీతో ఇప్పుడు అసత్యం చెప్పవలసిన అవసరం ఏమొచ్చింది బ్రదర్ !'

'ఆమె వారగార్ని ఎందుకు వదిలిపెట్టింది ? హైద్రాబాద్ ఎప్పుడు వచ్చింది ? అసలు ఇంత నీచంగా ఎలా దిగ

జారిపోయింది?-ఆక్షణంలో నాకూ సరిగ్గా ఇట్లాంటి ఆలోచనలే వచ్చాయి. ఇన్నాళ్లూ నేను ఈ క్షుద్రస్త్రీకోసం ఎందుకు బాధపడ్డానా అని సిగ్గుపడ్డాను.' మరొక సిగరెట్టు వెలిగించాడు సత్యమూర్తి.

'అయితే ఆరాత్రి ఆమెతో...'

'ఛ! లేదు. అసహ్యం వేసింది. కొన్నాళ్ళు దేవతగా మనం ఆరాధించిన వ్యక్తి వీధిలో పారేసిన విస్తరికంటే ఏవిధంగానూ ఎక్కువ గాదని తెలిసినప్పుడు సహజంగా ఎంతో బాధనిపిస్తుంది. సరోజవిషయంలోనూ అంతే జరిగింది. ఆమెకోసం నిరీక్షించి నిరీక్షించి విరహం అనుభవించాను. ఆమెకోసం ఏత్యాగమైనా చెయ్యాలనుకున్నాను. ఆపరిస్థితిలో ఆమెను పొందటంలో వున్న ఆనందం వేరు. అతి తేలిగ్గా వందరూపాయలు పారేసి, ఆమెశరీరం కొనుక్కోవడంలో వచ్చిన జుగుప్స వేరు. ఏమైనా ఆరోజు వచ్చేశాను. ఇంతకూ నీకు చెప్పొచ్చేదేమిటంటే, ఒక వస్తువు అందనంతకాలమూ అది అతిలోకమైందనీ, అపూర్వమైందనీ దాన్ని పొందటమే తరించడానికి అర్థమనీ అనుకుంటాం. కాని, ఆ తర్వాత ఉద్రేకాలూ ఉద్వేగాలూ తగ్గి, మైకం కరిగిపోయాక, ఉన్న యథార్థం తెలుసుకుని బాధపడతాం.' అంటూ ముగించాడు సత్యమూర్తి.

'నీ పరిస్థితి వేరు మూర్తీ! నువ్వు ప్రేమించినస్త్రీ ఒక క్షుద్రస్త్రీ అని తెలియడంవల్ల నువ్వు బాధపడాల్సివచ్చింది. కాని - నావిషయం వేరు. జయలక్ష్మిమీద నాకు తరగని

గౌరవం వుంది మూర్తీ! అది ఎప్పటికీ పోదు.' వేణు దృఢంగా అన్నాడు.

'మరొక సంగతి చెప్తా వింటావా వేణూ! ఏదో అసత్యం కల్పించి చెపుతున్నానని నువ్వనుకున్నా అనుకో వచ్చు' వేణుకేసి చూసి ఆగాడు మూర్తి.

'నీమాటమీద నాకు విశ్వాసం వుంది. చెప్పు!'

'ఆ వెంగళ్రాయనింగారి ఆధిపత్యంలోనుంచి తెగ తెంపులు చేసుకుని హైద్రాబాద్ చేరి, నాకు దర్శనమిచ్చిన సరోజ ఎవరో తెలుసా?'

'ఎవరు?'

'బాలాంబ!'

'అంటే?'

'నీ జయలక్ష్మితల్లి బాలాంబ! ఆ సరోజా, ఈ బాలాంబా ఒక్కటే. ఆ దొరగారు బాలాంబకు పెట్టిన ముద్దుపేరు సరోజ!'

మూర్తి చెప్పిన మాటలు నిజాలో అబద్ధాలో తెలుసు కోలేని అయోమయస్థితిలో పడిపోయాడు వేణు. అతని ఆశలూ, కాంక్షలూ పేక మేడల్లాగ కూలిపోయాయి. గుండెల్లో ఏదో బరువుగా వున్నట్టు అనిపించింది. అతని మెదడు పాదరసంకన్నా ఎక్కువ వేగంగా పనిచేసింది. నుదుటిని వేళ్ళతో రుద్దసాగాడు. కొన్నిక్షణాలు మనసుతో తీవ్రఘర్షణ పడ్డాక, కోల్పోయిన శక్తులను పుంజుకున్నాడు. ఒక్కసారిగా అతనికి వేయిఏనుగుల బలం వచ్చింది. అతని కోర్కె వేళ్లుపాతుకుని మహావృక్షం అయింది.

'బాలాంబ మంచిదికాదనే అనుకుందాం మూర్తీ! అంతమాత్రాన జయలక్ష్మి చేసిన నేరం ఏమిటి?'

'బాలాంబ కడుపున పుట్టడమే జయలక్ష్మి చేసిన పెద్ద నేరం వేణూ! వేశ్యకూతురు పతివ్రతైనా వ్యభిచారిణిగానే లోకం పరిగణిస్తుంది.' మూర్తి నవ్వాడు.

'అది చాలా తప్పుఅభిప్రాయం మూర్తీ!'

'అదీగాక ఆ కలుషితవాతావరణంలో బుద్ధి తెలిసి వయసొచ్చిన పిల్ల జీవించడమంటే, ఆమెమనస్సు నిశ్చయంగా మలినమైపోవడానికి అవకాశం వుంది.'

'ఆమె చెయ్యని తప్పుకు ఆమె శిక్షింపబడటం నాకు న్యాయమనిపించడం లేదు మూర్తీ! నువ్వెంత చెప్పినా నాకు జయలక్ష్మిమీద వున్న గౌరవంగాని, సానుభూతిగాని రవ్వంతా తగ్గలేదు. అది సరే. బాలాంబావాళ్ళు చాలా భాగ్యవంతులు. ఆమె ఈపనిచేయాల్సిన అవసరం ఏమొచ్చిందంటావ్ ?'

'మనిషికి అనేకవాంఛలుంటాయ్ వేణూ! ఆకలి వుంటుంది. కోర్కె ఉంటుంది. వీటన్నింటికీ డబ్బు ఒక్కటే సమాధానం చెప్పగలదనుకుంటున్నావా ? డబ్బువిలువ నాకు పూర్తిగా తెలుసు. డబ్బు మనిషిని మృగంలాగ, మృగాన్ని మనిషినిగా మార్చగలదు. దాని కా శక్తి వుంది. అంత మాత్రాన మనిషికి కావల్సిందల్లా డబ్బు ఇవ్వలేదు. అది ఇవ్వలేని సుఖాన్ని ఈరూపంలో బాలాంబ కొనుక్కుంటూంది. అదీగాక, ఒకచెడ్డపని నాలుగుసార్లు చేశాక అల వాటై, వ్యసనంగా మారుతుంది. ఆ వ్యసనం విషవలయం

లాంటిది. దాంట్లో చిక్కుకున్నవాళ్లు బయటపడలేరు.'

'నా నిశ్చయం మారడానికి నువ్వు చెబుతున్న కథలుగాని, కారణాలుగాని బలంగా కనిపించడం లేదు మూర్తీ! నా మొఖంసూటిగా నేను పోదలుచుకున్నాను.'

'బ్రదర్! నీ కింకోసత్యం చెబుతున్నా విను. నీకంటే ఈవిషయంలో అనుభవం వుంది కనుక, నీక్షేమం కోరే స్నేహితుణ్ణి గనుక నీకు సలహా చెప్పే అధికారం నాకు వుంది. సాహసంచేసి జయలక్ష్మిని చేసుకున్నా, నువ్వు సుఖంగా జీవించలేవు. బంధువులూ, స్నేహితులూ, కని పెంచిన వాళ్లూ అందరూ నిన్ను కాకులు పొడిచినట్టు పొడుస్తారు. నువ్వు సంఘంలో ఒకవ్యక్తివి. దాన్ని ఎదిరించినడి స్తే నిన్ను తన ఇనపపాదాలతో నల్లిని రాసినట్టు నలిపేస్తుంది. అన్నింటినీ సహించి జీవించగలిగే శక్తి నీకులేదు. ఎందుకొచ్చిన గొడవ! హాయిగా పెద్దవాళ్ళు తెచ్చిన ఇంతిని చేసుకో!' తన అభిప్రాయం చెప్పాడు మూర్తి.

'అట్లా నువ్వు ఎందు కనుకుంటావు మూర్తీ! జయలక్ష్మినిచేసుకునే ధైర్యం నాకుంది. ఆమె నాప్రక్కనుంటే ప్రపంచం నన్ను చిత్రహింసలు పెట్టినా నేను భయపడను. అందరిలాగానే మేమూ ే చేసుకుంటాం. పవిత్రంగా, ఆదర్శంగా బ్రతుకుతాం అందరికంటే పదిరెట్లు అన్యోన్యంగా బ్రతికి, అందరికీ అసూయ పుట్టించాలనే కోరిక కలుగుతోంది. నువ్వు నాక్షేమం కోరి చెబుతున్నావ్; ఆ సంగతి నాకు తెలుసు. కాని, నీమాటలు నాకు భయంకరంగా వున్నాయి. వినలేకపోతున్నాను. ఇంక చెప్పకు

మూర్తీ. అటువంటి సలహా నాకు అక్కర్లేదు.' అంతటితో ఆపుచేస్తున్నట్టు సిమెంటుబెంచీమీదనుంచి లేచాడు వేణు.

'అటువంటివాడివి నాకు చెప్పడం, నాసలహా అడగటం అనవసరం వేణూ!' తనుకూడా లేచి కాస్త విసురుగా అన్నాడు మూర్తి.

'కోపం తెచ్చుకోకు మూర్తీ! నా పరిస్థితి-అర్థంచేసుకుంటానికి ప్రయత్నించు. నువ్వు నా ఊహాకు ఊతంగా వుంటావనీ, ఆలోచనలకు అండగా నిలబడతావనీ ఆశించాను. కాని నీ ఆలోచనలూ, అనుభవాలూ మరోకరకంగా వున్నాయి. వస్తా-క్షమించు.'

# 5

జయలక్ష్మి వేణుతో ఇంగ్లీషు సినిమాచూసి, కాళ్ళ చెప్పులు విప్పడానికి కూడా ఓపిక లేక తన గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది.

బాలాంబ వచ్చి లైటువేసింది.

'ఇంత ఆలస్యం అయింది, ఎక్కడికి వెళ్లారుజయా?'

'సినిమాకు'-జయలక్ష్మికి మాట్లాడ బుద్ధికా లేదు.

'ఎగ్జిబిషన్‌కు వెడతామని సినిమాకు ఎందుకు వెళ్ళారు?'

కొంచెం అధికారంగా అడిగింది బాలాంబ.

'ఏం, తప్పా?'

'పోనీ, వెళ్ళేముందు నాతో ఒక మాట చెబితే ఏం పోయింది ?'

'చెప్పడం అనవసర మనిపించింది !'

'నీ క్షేమం కోరుతున్న తల్లితో ఇట్లాగేనా నువ్వు మాట్లాడేది? నువ్వు బాగుపడితే సంతోషించేవాళ్ళూ, చెడిపోతే విచారించేవాళ్లూ లోకంలో నాకంటే ఎవరున్నారు ?' అంది బాలాంబ.

'ఎందుకు అనవసరంగా రభస చేస్తావమ్మా ? రోజూ ఏదో ఒక రాద్ధాంతం చెయ్యకుండా నీకు గడవ దనుకుంటా. ఇందులో బాగుపడటం, చెడిపోవటం ఏముంది ? ఎగ్జిబిషన్‌కు వెళ్లడం మానేసి సినిమాకు వెళ్లాం. అంతమాత్రాన కొంప మునిగింది ఏముంది?' అంది జయలక్ష్మి విసురుగా.

'సాయంత్రం పూట ఎగ్జిబిషన్‌కు వెళ్లడానికీ, అర్ధరాత్రిదాకా అడ్డమైన వాళ్లతో సినిమా చూడటానికీ తేడా లేదూ ?'

'నా కేం కనిపించ లేదు.'

'నీకు కనిపించడం సంగతలా వుంచు. నువ్వు నా మాటకు అసలు విలువ నివ్వదలుచుకోలే దన్న మాట !'

'ఆ సంగతి నీకు ఇదివరకు లక్షసార్లు చెప్పాను.'

'ఎలా పుట్టావే నా కడుపున ! శత్రువై సాధిస్తున్నావ్ !'

'నేనూ అదే అనుకుంటున్నా నమ్మా ! నీ కడుపున ఎలా పుట్టానా అని. నిన్ను నేనే సాధిస్తున్నానో, నన్ను నువ్వే సాధిస్తున్నావో పరమేశ్వరుడికి తెలియాలి. నీ కడు

పున పుట్టకుండా వుంటే నా కీ నరకం తప్పేది.'

'ఎందుకు జయా! అంత లేసి మాట లంటావ్ ? నేను నీకు చేసిన అపకారం ఏమిటి? నువ్వు తప్ప నా కీ ప్రపంచంలో ఎవరున్నా రమ్మా! నా సర్వస్వం నీదే కదా తల్లీ! నువ్వు మంచిపిల్ల వని పేరు తెచ్చుకుని, ఒక ఇంటిదానివై తే సంతోషించేదాన్నే గాని. ని న్నెందుకు బాధ పెడతాను చెప్పు?' బాలాంబ గొంతు గద్గదమయింది.

'ఇందులో ని న్ననాల్సిన పనేమీ లేదమ్మా! భగవంతుడు నా మొఖాన ఇట్లా రాసిపెట్టాడు. నాకు మంచి రెట్లా వస్తుంది! నేను మనోవాక్కాయ కర్మలా నిప్పులా వున్నా నన్ను నమ్మే దెవరు? నా గురించి చల్లని మాట చెప్పే దెవరు? నన్ను చూసి అందరూ ఎన్ని మాటలు అంటున్నారో, నా వెనకాతల ఎంతమంది వికృతంగా నవ్వుతున్నారో నీకేం తెలుసు? నేను చేసిన పాపం ఏమిటి? దీనికి బాధ్యు లెవరు? వెళ్లు. ఇక్కడనుంచి వెళ్లు అమ్మా! నాకు నీ మొఖం చూపించకు. నిన్ను చూస్తే నా వొళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్టు వుంది. నాతియ్యని కలలూ, నా కోరికలూ అన్నీ భగ్నమైపోయాయి. నాజీవితమే పనికి రాకుండా పోయింది. ఇంక నేను బతి కేం లాభం? ఇంకా నుంచున్నా వెందుకు? వెళ్ళు' అంటూ పిచ్చిదానిలాగ అరుస్తూ, దిండులో మొఖం దాచుకొని ఏడవటం మొదలు పెట్టింది జయలక్ష్మి. నిశ్చేష్టురాలై ఒక క్షణం నిలబడి, మెల్లగా ఆ గదిలోంచి వెళ్ళిపోయింది బాలాంబ.

జననీ, జన్మభూమీ స్వర్గంకంటే ఆత్మీయులనీ, ఆనం

దాన్ని చ్చేవనీ, పూజనీయాలనీ అంటారు. గోహత్య మహా పాపం! ఎవరికి? కసాయివాడిని అడిగి చూడాలి. ఏడవ శతాబ్దంలో హూణులనే క్రూరజాతి మన దేశంమీద దండయాత్ర చేసి, రాజ్యాలు ధ్వంసంచేసి ప్రభుత్వాలు స్థాపించింది. ఆ హూణప్రభువులు కొండలమీదనుంచి ఏనుగులను క్రిందకు తోయించి, అవి గావుకేకలు పెట్టి చస్తూవుంటే, సంతోషంతో హర్ష ధ్వానాలు చేసేవారు.

పాము ఆకలి బాధనుంచి బయటపడి ప్రాణాలు నిలబెట్టుకుంటానికి తను పెట్టిన గుడ్లనే తింటుంది. యుద్ధాలు చేయించి, తమ బిడ్డల్ని భారీసంఖ్యలో నాశనం చేసుకుంటున్నాయి దేశాలు. అనాగరికులైన తొలి మానవులు శైశవం దాటి యౌవనంలో అడుగుబెడుతున్న కన్నబిడ్డల్ని అసూయతో చంపి తినేవారుట! జీవితం వక్రించకుండా వుండాలిగాని - పట్టాలు తప్పిన రైలు బండిలాగ వక్రిస్తే ఏమవుతుందో ఎవరు చెప్పగలరు?

ఆ ఇంట్లో తల్లీబిడ్డల మధ్య ఇటువంటి ఉద్రేక పూరితమైన రోష భాషణలు తరచు దొర్లుతూవుండేవి. దెబ్బ తిన్న బెబ్బులిలా, తోక త్రొక్కిన తాచుపాములాగ విజృంభించి, నిర్దాక్షిణ్యంగా తల్లిని దూషించడం జయలక్ష్మికి పరిపాటై పోయింది. బయటివాళ్ళ దగ్గర తల్లి అంటే కొంత గౌరవాభిమానాలు చూపించినా, ఏకాంతంగా వున్నప్పుడు తల్లిని కీటకంకంటే హీనంగా దులుపుతుంది. చల్లని వెన్నెలలా, అమృతంలాగ వుండవలసిన ఆ తల్లీబిడ్డల నిర్మల ప్రేమానుబంధం ఏ శాపవశానో కలుషితమై పోయింది.

దిండులో మొఖం కప్పుకుని కుమిలిపోసాగింది జయ లక్ష్మి.

'దేవతామూర్తిగా ఆరాధించడానికి తల్లి ప్రత్యక్ష దైవం అంటారు; నా కా భాగ్యం లేకుండానే చేశావు గదా భగవాన్! నేనేపాపం చేశానయ్యా?' అంటూ విలపించింది.

ఎందుకో తల్లిమీద విపరీతంగా ఆగ్రహావేశాలు వస్తున్నాయి. బ్లడ్ ప్రెషర్ వుంటే అట్లా జరుగుతుందంటారు. తనకి అట్లాంటి రోగం లేదుగదా! యౌవనంలో వున్న వాళ్ళకు బ్లడ్ ప్రెషర్ రాదంటారు మరి! తల్లి దూరంగా వున్నప్పుడు ఒకోసారి ఆవిడమీద విపరీతంగా జాలి కలుగుతుంది. అంతులేని వాత్సల్యం పొంగి పొర్లుతుంది. ఆమెను అనవసరంగా తా నన్నమాటలు తలుచుకుంటే, మనసు క్షోభిస్తుంది. కళ్లు చెమ్మగిలుతాయి. ఆ కళ్ల ముందు దేవతా మూర్తిలా పవిత్రమాతృస్వరూపిణి కనిపిస్తుంది. ఆక్షణంలో అమ్మపాదాల నంటి, 'తీరని అపచారం చేశానమ్మా! నాకు నీ ఇష్టమొచ్చిన శిక్ష విధించు!' అని మనసారా ఏడ్చి ఆమె కాళ్ళముందు తల బద్దలు కొట్టుకుని చావా లనిపిస్తుంది. ఆ ఆవేశంతో తల్లిదగ్గరకు వెడుతుంది. ఆమె మొఖంలోకి చూసేసరికి ఒక్కసారి ఏవో నీడలు కనిపిస్తాయి. ఆమెలో ఎంచరాని తప్పు కనిపించి, పెనుభూతంలాగ విజృంభించి, తన కళ్ళముందు భయంకరంగా నిలబడుతుంది. అంతే, ఆక్షణం లో తన కళ్లల్లో అమ్మమీద జాలితో నిండిన కన్నీరు ఇంకి పోతుంది. ఆ స్థానే ద్వేషం పీఠం వేసుకు్కూర్చుంటుంది. తల్లి మీద అంతులేని కోపం, ఈర్ష్య, జుగుప్స తెరలు తెరలుగా

తన హృదయాన్ని దుర్బలంచేసి వణికింపజేస్తాయి. మాట మీద మాట పెరుగుతుంది. వాగ్యుద్ధం జరుగుతుంది. ఓపిక వున్నంతసేపూ, ఉద్రేకం చల్లారేదాకా ఇద్దరూ ఒకళ్ళని ఒకళ్లు తిట్టుకుంటారు. అలసిపోయి ఎవరి గదిలోకి వాళ్లు వెళ్ళిపోతారు. ఇది ఆ ఇంట్లో నిత్యకృత్యమై పోయింది.

గడియారం పన్నెండు గంటలు కొట్టింది. ఊరంతా మాటు మణిగింది. సమస్త ప్రపంచం నిద్రాదేవి వొడిలో విశ్రాంతి తీసుకుంటూంది. జయలక్ష్మి అలాగే మంచంమీద నిద్రపోయింది. పదిహేడు వసంతాల నధిగమించిన యౌవన విలాసం ఆమెహృదయంలో నిండి పొంగుతూంది.

యౌవనం! సౌందర్యం!!

సృష్టికి ప్రాణమైన యౌవనం ఘనీభవించి, సౌంద ర్యాన్ని కప్పుకుంటే జయలక్ష్మి శరీరమైంది. ఇంతకాలం మండుతున్న యౌవనాన్ని కోర్కెలతో పీటముడి పెట్టి గుప్తంగా దాచుకుంది ఆ జవ్వని. రోజు రోజుకూ శరీరం తనమీద పగ తీర్చుకుంటూ హింసిస్తున్నది. ఆ పైశాచిక ఆనందంతో, అది క్షణక్షణానికీ మత్తెక్కి, కఠినమై, క్రూర నాగులాగ బుసలు కొడుతూంది. ఆ విషజ్వాలకు తా నింక ఎంతోకాలం తట్టుకోలేదు. ఏనాటికైనా తన జీవితం ద్రవించి, వాగై, పొంగి పొరలి సాగరసంగమం చెందవల సిందే! గడ్డకట్టి ఎత్తుమీద నిలిచిన మంచు కరగిన మరు క్షణం పాతాళానికి పతనమై, పల్లం అంతం కనుక్కునేదాకా ఆగదు. ఈ పరివర్తనాన్ని బ్రహ్మకూడా మార్చలేడు. మారిస్తే అతని సృష్టి విజృంభించి, ఆత్మహత్య చేసుకుం

టుంది. ఉప్పెనలో తరంగాల్లాగ ఎగిరిపడుతున్న ఆమె హృదయం జీవితానికి ఆ క్షణంకంటే మించిన విలువ వుందను కోవడం ఆత్మవంచన అని హెచ్చరిస్తోంది. ఆకాశం పగిలేలా ఏడవా లనిపిస్తుంది. భూమి బ్రద్దలయేలా నవ్వా లనిపిస్తుంది. ఆద్యంతాలు లేని సృష్టి రహస్యాన్ని దాచుకున్న ఆకలి అడవి మంటలాగ ఆమెను దహించి వేస్తూంది. అలాగే ఉద్రేకాల ఉరవడిలో ఉక్కిరి బిక్కిరియై, అచేతనయై, నిద్రాదేవిని కౌగిలించుకుంది జయలక్ష్మి. కన్నీటితో పునీతమైన దివ్య కుసుమం జయలక్ష్మి!

# 6

సత్యమూర్తి చెప్పిన సంగతులన్నీ స్మృతిపథంలో నృత్యం చేస్తుండగా, అర్ధరాత్రి వేళ ఇంటికి చేరుకున్నాడు వేణు. కళ్లు మూసుకుని పక్కమీద అలాగే పడుకున్నాడు. భళ్లున తెల్లవారింది. ఇల్లంతా ఏదో సంరంభంతో రైల్వే ప్లాట్ ఫారంలాగ వున్నది. వేణు మేనమామ, పరాంకుశం, అను కోకుండా సకుటుంబ సపరివారంగా ఢిల్లీ ఎక్స్ప్రెస్ లో వచ్చి దిగాడు.

పరాంకుశం కృష్ణాజిల్లా జొన్నపాడు గ్రామంలో కరి ణీకం చేస్తున్నాడు. యాభై సంవత్సరాలు నిండినా ఈనాటికీ ఆయన కోర్టునే రణరంగంగా భావించి, ఎనలేని సమరో త్సాహంతో స్వైరవిహారం చేస్తుంటాడు. లిటిగేషన్ లేని

జీవితం వ్యర్థమనీ, క్షుద్రమనీ, రసహీనమనీ ఆయన అమూల్యాభిప్రాయం. అయితే ఆయనకు సివిల్ కేసులంటే ఎంత ప్రాణమో, క్రిమినల్ కేసులంటే అంత వెగటు. ఎటువంటి శత్రువుతోనైనా వాగ్యుద్ధానికి దిగడు. ఎవరితోనూ పరుషంగా మాట్లాడడు. ఆయనకు ఇరవై ఏళ్లు వచ్చిన దగ్గర నుంచి కోర్టులూ, వ్యాజ్యాలూ లేని రోజు లేదంటే అతిశయోక్తి గాదు. ఆయనకు తెలిసిన లా పాయింట్లు హైకోర్టు ప్లీడర్లకు కూడా తెలియవు. కేసు పోతుందనుకున్న క్లిష్ట సమయాలలో, తాను ప్లీడరుకు సలహా చెప్పి ప్రమాదం తప్పించి ప్రత్యర్థులను ఓడించిన సన్నివేశాలు ఆయన మూడు దశాబ్దాల కోర్టు జీవితంలో కోకొల్లలు! రెండు రెళ్లు నాలుగు కాదనీ, ఆరనీ వాదించి, అందుకు తగినంత మంది పెద్దమనుష్యులను సాక్షులుగా ప్రమాణాలు చేయించి, గతంలో రెండు రెళ్లు ఆరుగా ఋజువైన సందర్భాలు ఉల్లేఖించి, జడ్జీల మతిపోగొట్టి కేసు గెలుచుకు రావడంలో జొన్నపాడు కరణం గారికి సాటిరాగల మొనగాడు ఆ పరగణాలోనే లేడని పెద్ద పెద్ద కలెక్టర్లే అంగీకరించారు. అందుకే ఆయనను వ్యాజ్యాల కరణం గారని అంటారు.

పరాంకుశంగారిలో చెప్పుకోదగ్గ మంచి గుణం సహనం. చౌదరిగారి నలుగురల్లుళ్లూ ఒకసారి పొలంగట్టు తగాదాలో ఆయనింటి మీదకు దాడి చేసి తిట్టి కొట్టినంత పనిచేసి అవమానించారు. ఆ ఘట్టంలో కూడా పరాంకుశం గారు తానేదో నాటకం చూస్తున్నట్టు కాసేపూ, తామరాకు మీద నీటిబొట్టులా కాసేపూ, అభం శుభం తెలియని పసి

పిల్లలు అల్లరి చేస్తుంటే మందలించే ధోరణిలో కాసేపూ, ఇట్లా ఆద్యంతం మందహాసంతోనే చౌదరిగారి అల్లుళ్ళను సాగనంపాడు. ఆ తర్వాత ఇరవై నాలుగు గంటలలో 144వ సెక్షను తెప్పించి వరసగా ఒక క్రిమినల్ కేసూ, రెండు సివిల్ కేసులూ వాళ్ల మీద పెట్టించాడు. అంతేగాదు. చౌదరిగారి షడ్డకుడికి పెట్టుబడి పెట్టి మరో మనోవర్తి దావా వాళ్ల మీద వేయించి, వాళ్ల పొలాలకు బీ ఫారాలు పెట్టి మూడేళ్లు కథ నడిపి వాళ్ల అంతు కనుక్కునేదాకా వదిలి పెట్టలేదు.

అంత ఘటికుడూ, కార్యవాదీ పరాంకుశంగారు. జీవితాన్ని గురించీ, ప్రపంచాన్ని గురించీ ఆయనకు కొన్ని నిశ్చితాభిప్రాయాలు వున్నాయి.

అందులో మొదటిది :—పాతికేళ్ల లోపు వాళ్లంతా నిలకడలేని వాళ్లు; పాతిక దాటిన వాళ్లంతా దొంగలు. ఈ రెండు వర్గాలవారినీ నమ్మి వ్యవహరించడానికి వీల్లేదు.

రెండవది :–మంచితనం వల్ల ఎవర్నీ జయించలేము. జీవితంలో ఏదన్నా పొందాలంటే, అధికారమన్నా చెయ్యాలి; దాస్యమన్నా చెయ్యాలి.

మూడు :–పెళ్లి అంటే రెండు కుటుంబాల మధ్య జరగాల్సిందిగాని ఇద్దరు కుర్రకుంకల మధ్య జరిగే వ్యవహారం గాదు. అందుకు ప్రధానమైన వాళ్లు ఆ కుటుంబాలలోని పెద్ద వాళ్లుగాని వధువూ, వరుడూ ఎంతమాత్రం కాదు.

నాలుగు :—వ్యవహారం దగ్గర కొడుకు–కూతురు, అయినవాళ్లు - కానివాళ్లు అనే తారతమ్యాలు వుండకూడదు.

ఐదు :—ప్రేమకు సంబంధించిన కవిత్వాలూ, సినిమాలూ, పాటలూ, పార్కులూ, మనుష్యులూ, కాలేజీలూ కుర్రతరాన్ని పాడు చేస్తున్నాయి. కనుక వాటన్నింటినీ రద్దు చేయాలి.

ఆరు :-మగవాడు ఏడవగూడదు. ఆడది ఏడిస్తే అది నిజమని నమ్మగూడదు.

ఏడు :-కోర్టుఅనుభవం లేని నరజన్మ వృథా!

ఇవే ఆయన నమ్మి ఇతరులను నమ్మించాలనుకొనే సిద్ధాంతాలు. అందుచేత పరాంకుశంగారు తన ఆరుగురుకూతుళ్లలో రెండవదైన రాధను మేనల్లుడే పుట్టినందుకు వేణుకు ఇవ్వాలని నిశ్చయించుకున్నాడు. వేణు తల్లిదండ్రులకు గూడా ఈ సంబంధం విషయంలో అభ్యంతరం లేదు.

# 7

వేణు నిద్ర లేచేసరికి మాటలు సన్నగా వినిపిస్తున్నాయ్.

'కోర్టుపని-వచ్చాం-పనిలోపని - పిల్లదాన్ని తీసుకొచ్చాం-మాఘమి-మాఘమాసంలో ఆ మూడుముళ్లూ పడ్డాయనిపించేద్దాం. కుర్రాణ్ని గూడా అడగొద్దు-ఆఁ! వాడి మొఖం-వెర్రి నాగన్న-ఏం చేస్తాడు? గూబ మెలిపెట్టి సూత్రం కట్టిస్తాం-ఆఁ-రాధను కలెక్టరుగారి కుర్రాడు - తిరిగాడు - పొమ్మన్నా - గడప తొక్కొద్దన్నా-ఎంతైనా మేనరికం-అలాగే-వారంరోజులు వుండి వెడతాం-కలెక్టరూ - జమాబంద్ —'

వేణు మెల్లిగా లేచి మొఖం కడుక్కుంటానికి దొడ్లోకి వెళ్ళాడు. బాదంచెట్టు కింద వున్న రాధ వేణును చూసి నిప్పు తొక్కినట్టు కేకపెట్టి లోపలకు పరిగెత్తింది. పెద్ద కేకలూ-గొడవ! ఏమైందో వేణుకు అర్థం కాలేదు. దొడ్డి గుమ్మంలోకి తొంగిచూసిన ముసలమ్మ ముసిముసిగానవ్వింది. వేణు చెల్లెల్ని 'ఏం జరిగిం'దని అడిగాడు. వసంత నవ్వు కుంటూ, సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది. మరదలు సరస్వతి గూడా క్రీగంటితో చూస్తూ, కొంటెగా నవ్వుతూ వెళ్ళింది. వేణుకు అసలు విషయం అర్థం కాలేదు. అత్తయ్య కామాక్షమ్మ దొడ్లోకి వచ్చింది. 'అత్తయ్యా! రాధకు ఏమైంది?' అని అడిగాడు వేణు.

'అబ్బే! దానికి నిన్నుచూస్తే చచ్చేసిగ్గు నాయనా!' అంటూ అల్లంత సిగ్గుపడుతూ ఆవిడ సమాధానం చెప్పింది.

వేణు నిర్ఘాంతపోయాడు. ఇటువంటి సంఘటనలే ఆరోజు అయిదారు జరిగాయి. రాధకు ఇంతసిగ్గు ఎక్కడ నుంచి వచ్చిందో వేణుకు అంతుచిక్కలేదు. క్రితం వేసవిలో జొన్నపాడు వెళ్ళాడు. అప్పటి కింకా రాధ సిగ్గుపడటం ఎర గదు. పరికిణీలు కట్టేది. ఓణీలు వెయ్యడం లేదు. అప్పటికీ ఇప్పటికీ చాలా మారింది. పధ్నాలుగేళ్ళకు మించిన వికాసం ఆమె అవయవాల్లో కనిపిస్తూంది. ఆడపిల్లల్లో గుర్తుపట్టలే నంత మార్పు తెచ్చేది కాలం. దాన్ని దాటింది రాధ. ఇప్పుడు బాగా పొడుగైంది. దానికితగ్గట్టు లావైంది. చింకి రిగా గుబురుగా ఎదురుతిరిగే ఆమెజుట్టు అందంగా దువ్వబడి నిగనిగలాడుతూవుంది. మాట మారింది. చూపు మారింది.

వేషం మారింది. కాని-ఆ మార్పులో సౌకుమార్యం లేదు. ఆ ఎదుగుదలలో నాజూకు లేదు. ఆ మొఖంలో లలితత్వం లేదు. మోటుగా వుంది. కాళ్ళకు పట్టాగొలుసులు 'ఘల్లు' మంటున్నాయి. జొన్నపాడులో నాగరికత బుట్టజాకెట్ల దాకా వచ్చి ఆగిపోయినట్టుంది. పదేళ్ళ క్రితం పట్టణాలలో అందరూ వేలంవెర్రిగా తొడుక్కునే ఆ జాకెట్లను రాధ ఇంకా వదలలేదు. రెండుతులాల బంగారంతో మొద్దులాగ చేయించిన జడగంటలు బరువుగా వేళ్లాడుతున్నాయి. వాటినిచూస్తే వేణుకు ఎద్దుకుచ్చు జ్ఞాపకంవచ్చింది. ముదురు గులాబీరంగు కంచిపట్టుచీర. దానిమీదకు నల్లజరీచారల పట్టుజాకెట్టు తొడిగింది. మోయలేనంత బంగారం ఆమె శరీరాన్ని బంధించింది ఎందుకో నవ్వుతుంది. ఎవరో తరుముతున్నట్టు అటూ ఇటూ వెర్రిగా తిరుగుతుంది. డబ్బాలో గులకరాళ్లుపోసి గిలకరించినట్టు మాట్లాడుతుంది. రాధమాటలు కర్ణకఠోరమై వేణుని బాధపెడుతున్నాయి. ఎంతసేపూ వాళ్ల సంభాషణలో కంచి పట్టుచీరలూ, నగలూ, నెక్లెసూ, కాసులపేరు, మేలిమిబంగారం, గమిడిగేదెపాలూ- ఇవీ! అవన్నీ వింటుంటే మనుష్యులు ఇంత అధ్వాన్నంగా ఎందుకుబతుకుతారా అనిపించింది. మధ్యాహ్నం మొగ వాళ్ల భోజనాలు అయాయి. ఆడవాళ్లు భోంచేస్తున్నారు. ఆల్బంలో ఫొటో అంటించడానికి రెండు అన్నంమెతుకులు తెద్దామని వంటింట్లోకి వెళ్లాడు వేణు. అన్నం తింటున్న రాధ పీటమీదనుంచి ఒక్కగెంతులో దొడ్లో జామచెట్టు చాటుకు దూకి దాక్కుంది. మళ్లీ వికవికలూ పకపకలూ!

'ఇంతసిగ్గు తగదు మరదలుపిల్లా!' అంది వసంత.

'ఆఁ! ఇదెన్నాళ్లులే! ఆకాస్త అడ్డూ తీరేదాకానేగా' అంది అత్తయ్య. ఎవరి రొద వాళ్ళదిగా వుంది.

# 8

ఇలాగే వారంరోజులు గడిచిపోయాయి. ఆనాడు సోమ వారం. ఆరాత్రే పరాంకుశంగారి కుటుంబం వెళ్లిపోతుంది. ఆయనా, వేణు తండ్రి రమాకాంతంగారూ పెళ్ళికొడుకు ప్రసక్తిలేకుండానే ముహూర్తం పెట్టేశారు.

వాళ్ళమాటప్రకారం జరుగుతే ఆ రాధ—ఆ సిగ్గుల దొంతర తన అర్ధాంగి! ఆయువు వున్నంతకాలం ఆవిడనూ, ఆవిడవాగ్ధోరణినీ భరించాలి. రాధమీద తనకేం కోపం లేదు. జాలికూడా అనిపిస్తుంది. కాని ఎక్కడి జయలక్ష్మి! ఎక్కడి రాధ!

అయ్యరుచేసిన కమ్మని ఇడ్లీ—సాంబారుకీ, ఇంట్లో ఇడ్లీ పేరుమీద చేసే మినపకుడుం పప్పుపులుసుకూ ఎంత తేడా వుంది! ఇదితిని అదని సరిపెట్టుకుంటారు కొందరు. ఇది స్వల్ప విషయం కావచ్చు. కొన్ని సూత్రాలు స్వల్పవిషయాలకు ఎల్లా సరిపోతాయో, పెద్దపెద్ద విషయాలకుగూడా అట్లాగే అన్వయించుకోవచ్చు.

వేణుకు అంతా అయోమయంగా వుంది. ఇంట్లో అందరూ రాధకూ, తనకూ పెళ్ళి అయిపోయినట్లే అనుకుం

టున్నారు. తండ్రిగాని, మేనమామగాని తనతో ఈ విషయం మాట్లాడటమే అనవసరం అనుకున్నారు. తను ఈ పెళ్లి ఎట్లా చేసుకోగలడు? జయలక్ష్మిని చేసుకోవాలని ఎన్నో ఆశలు పెంచుకున్నాడు. ఈ గండం ఎలా గడుస్తుంది? ఈ ఇష్టంలేని పెళ్ళి చేసుకుని తనేం బావుకుంటాడు? బుర్రంతా వేడెక్కి పోతోంది. గదిలోంచి బయటకు రావడం లేదు. తండ్రంటే భయం. తల్లంటే భయం లేకపోయినా, ఆవిడకోర్కెను కాదనే సాహసం తనలో లేదు. రాధ కోడలుగా రావాలని అమ్మ మనసారా వాంఛిస్తున్నది. ఇంక లాభం లేదు. తన భావాలన్నీ రాధకు ఒక ఉత్తరంద్వారా వ్యక్తంచెయ్యాలి. ఎంత కాలేజీ లెరక్కపోయినా కాస్తో కూస్తో చదువుకున్నదే గనక తనని అర్థంచేసుకోలేకపోతుందా? ఇష్టంలేని పెళ్ళి చేసుకుని రాధమాత్రం ఏం సుఖపడుతుంది? ఆలోచించాడు. చివరికి ఒక ఉత్తరం తయారుచేశాడు.

'రాధా!

'నీమీద నాకు అపారమైన వాత్సల్యం వుంది. నీకు గూడా నామీద గౌరవం వుందనీ, నన్ను అర్థంచేసుకుని నామాట మన్నిస్తావనీ నీ కీ ఉత్తరం వ్రాస్తున్నాను.

'పెద్దవాళ్లు మన పెళ్ళి నిశ్చయించారు. వాళ్ళఉద్దేశ్యం ప్రకారం జరిగితే మనం మరి మూడు నెలల్లో భార్యాభర్తలం అయిపోతాం. మనిద్దరిమధ్యా బతికినంతకాలం విడిపోవ డానికి వీల్లేని బంధం ఏర్పడిపోతుంది. ఆ తర్వాత మనం కావాలనుకున్నా ఆ బంధాన్ని తెంచుకోలేము.

'నాకూ కొన్నికొన్ని ఆశలూ ఆశయాలూ వున్నాయి.

అవి తీరాలని నేనుకోరడంలో తప్పు లేదనుకుంటూ. నా భవిష్యత్తు మరోకవిధంగా వుండాలని నాకోరిక. ఇంత నిర్మొహమాటంగా వ్రాస్తున్నానని ఏమీ అనుకోకు. ఈపెళ్లి నాకిష్టం లేదు రాధా! నేను మరొక అమ్మాయిని ప్రేమించాను. ఆమెను నా బ్రతుకుబాటలో నిలుపుకోవాలని వాంఛిస్తున్నాను. ఆ అమ్మాయిని వివాహం చేసుకుంటే, ఆమె జీవితం బాగుపడటానికీ నేను సుఖపడటానికీ అవకాశం వుంది. నిన్నుగనక నేను వివాహం చేసుకుంటే ఇద్దరం సుఖపడము. మనసులేని మనువువల్ల ఏం లాభంవుంది చెప్పు? నీమీద నాకు వాత్సల్యం వుందని మొదటే వ్రాశాను. నీకు యోగ్యుడైన వరుణ్ణి తెచ్చే బాధ్యత నాది. సలక్షణంగా ఈచేతులతో పెళ్లి జరిపిస్తాను. నన్ను నువ్వు మనస్ఫూర్తిగా అర్థంచేసుకుంటావని భావిస్తున్నాను. మనిద్దరం కలసి ఈ పెళ్లి జరక్కుండా చెయ్యాలి. నా ఈకోరిక నువ్వు మన్నిస్తావని ఆశిస్తున్నాను. నామీద కోపం తెచ్చుకోకు. చేతులు కాలింతరువాత ఆకులు పట్టుకున్నా చివరికి వ్యథతప్పదు. విశాలహృదయంతో నా ఆశయాన్ని మన్నించు.

ఆలోచించి మీఅమ్మావాళ్లకు చెప్పు. నేనూ ప్రయత్నిస్తాను.

నీ శ్రేయోభిలాషి,
వేణుగోపాల్.'

ఈఉత్తరం రాధకు యివ్వాలని వేణు ఉద్దేశ్యం. రాధ ఒంటరిగా కనిపిస్తే బాగుండు ననుకున్నాడు. కని పెట్టివుండగా వరండాలో జడచివర అల్లుకుంటూ కనిపిం

చింది. చప్పున ఉత్తరం ఆమె చేతిలో పెట్టి గదిలోకి వచ్చాడు. ఆమె విచిత్రభంగిమలో నృత్యం చేస్తూ అది తీసుకెళ్లి వరండాలో వున్న పరాంకుశంగారికి యిచ్చింది. మళ్లీ రభస ప్రారంభం. పరాంకుశంగారు రవ్వంత కోపం ప్రకటించి, చిరునవ్వును పెదాలవెనక దాచుకుంటూ, 'ఏమిటోయ్ ఈ తొందర! ఇట్లా ఉత్తరాలు రాసుకుంటే మటుకు కలిసొచ్చే దేమిటి?' అన్నారు మందలింపుధోరణిలో. వెంటనే కామాక్షమ్మగారు వచ్చి 'ఈ ఉత్తరాల గొడవ దానికి గిట్టదు. వెర్రిబాగుల్ది' అని వివరిస్తుండగా 'ఏం జరిగింది?' అంటూ రమాకాంతంగారు వేదికమీదకు ప్రవేశించారు. ఈ తతంగమంతా కిటికీలోంచి చూసిన వేణుకు పిచ్చెత్తినట్లయింది. బాధగా జుట్టు పీక్కున్నాడు. తాను అనుకున్న దేమిటి? తనకు జరిగిన పరాభవం ఏమిటి? రాధ ఉద్దేశ్యం ఏమిటి? నిజంగా అదంతా సిగ్గా? అభినయమా? అభినయంవల్ల వచ్చే లాభం ఏమిటి? ఆమాత్రం ఇంగిత జ్ఞానం లేదా?

వాకిట్లో పరాంకుశంగారు ఉత్తరం విప్పి చదువుతుండగా కామాక్షమ్మగారు ఆయన చేతిలో ఉత్తరం లాక్కుని, 'అదేంపనండీ! పసివాళ్లు ఏదో సరదాగా రాసుకుంటే, తగుదునమ్మా అని సిద్ధమౌతున్నారూ! గొప్పవారే!' అంటూ ఆ ఉత్తరాన్ని తెచ్చి వేణుగదిలో టేబుల్ మీద పెట్టింది.

ఈ సంఘటనఫలితంగా పరిస్థితి ఇంకా విషమంగా మారింది. పిల్లలకు ఏకాలంలో జరగాల్సిన ముచ్చటలు ఆ

కాలంలో జరగాలనీ, ఆలస్యమైతే వాళ్లుఏఅఘాయిత్యమైనా చెయ్యడానికి వీలుంటుందనీ, అందుకని తక్షణం ఆ మూడు ముళ్లూ వేయించి అమ్మాయిని వెంటనే కాపురానికి పంపుతాననీ పరాంకుశంగారు గట్టిగా వాగ్దానం చేశారు. రమాకాంతంగారు తమ ఆమోదాన్ని తెలిపారు. 'చిలకాగోరింకల లాగ చక్కగా కాపురం చేసుకుంటారులే వదినా!' అని కామాక్షమ్మగారు తల్లితో చెప్పి మురిసిపోతోంది.

వేణుకు ఉక్రోషం వచ్చి ఏడ్చాడు. ఎన్నడూ తెగించి బయటపడి తల్లిదండ్రులను ఎదిరించలేదు. ఈపెళ్లి చేసుకోనని చెపితే ఇల్లు రణరంగంగా మారుతుంది. రమాకాంతం గారికి రక్తపోటు, నరాల బలహీనత, డయాబెటిస్ యిత్యాది రోగాలు ఎన్నో వున్నాయి. రవ్వంత మనస్తాపానికే అవి విజృంభిస్తాయి. ఆయనమాటకు ఏమాత్రం ఎదురుచెప్పినా ఆయన గుండెలు బాదుకోవటం, జుట్టుపీక్కోవటం, సన్యాసం తీసుకుంటానని యజ్ఞోపవీతం తెంచి పారెయ్యడం మొదలైన దృశ్యాలు ఆ కొంపలో తరచు పదిమందినీ ఆకర్షించే వినోదాలు! పరాంకుశంగారూ, రమాకాంతంగారూ తన మెడ కొక ఉరిత్రాడు బిగించి చెరొకప్రక్కా లాగుతున్నట్టుంది.

# 9

మర్నాడు పూరీ ప్యాసెంజరుకు పరాంకుశంగారి కుటుంబం సపరివారంగా బయలుదేరి స్వగ్రామం తరలిపోయారు. వేణుగూడా స్టేషనుకు వెళ్లకతప్పలేదు. రైలుకదిలేదాకా

రాధసిగ్గు వరదల్లాగ పొంగుతూనేవుంది. అది చూస్తున్న కొద్దీ వేణుకు జుగుప్స ఎక్కువ కాసాగింది. ఇంటికి తిరిగి వస్తుంటే జయలక్ష్మిని చూడాలనిపించింది; రాత్రి తొమ్మిది దాటింది. ఇటువంటి టైములో వెడితే బాలాంబ ఏమను కుంటుందో? వెంటనే బాలాంబగురించి సత్యమూర్తి చెప్పిన కథ గుర్తుకువచ్చింది. అయినా జయలక్ష్మిలో ఏదో నైర్మ ల్యం వుందని తన అంతరాత్మ నొక్కిచెబుతూంది. ముళ్ల పొదలో ఇరుక్కున్న గులాబిలాగ, బురదలోరాలిన సంపెంగ పుష్పంలాగ లౌకికమైన కళంకం ఆమెను మలినంచేస్తు న్నది. కాని ఏదో అలౌకికమాధుర్యం, మహాపాతకాలను క్షాళనంచేసే తీవ్రశక్తులు ఆమె కన్నీటిలో వున్నాయని పించింది.

జయలక్ష్మిఇంటిముందు ఆగాడు. జయగది తనకు బాగా తెలుసు. లైటింకా వెలుగుతూనేవుంది. గేటుదాటి లోపలకువెళ్లి తలుపుతట్టాడు. జయలక్ష్మి వచ్చి తలుపు తీసింది.

'రా వేణూ!' అంటూ గదిలోకి దారితీసింది. గదిలో ఒక అపరిచితవ్యక్తి కూర్చున్నాడు. వయస్సుకు పదును పెడుతున్న కోరమీసాలు, నల్లటి శరీరానికి మెరుగుపెడ్తున్న తెల్లటి ప్యాంటూ - షర్టూ, బలిష్ఠంగా మెలితిరిగిన కండ రాలూ, వంకీల తలకట్టూ - అతనిముందు తనేదో పల్చబడి పోయినట్టు కుంగిపోయాడు వేణు.

'ఇతను సురేంద్రనాథ్, డెహ్రాడూన్ మిలిటరీ ఎకా

డమీలో ట్రైనింగ్ అవుతున్నారు' అని పరిచయం చేసింది. నమస్కరించాడు.

'ఈయన వేణుగోపాల్ గారని, నా ఫ్రెండు.' అతను నమస్కరించాడు.

రెండు నిమిషాల నిశ్శబ్దం!

'ఈరాత్రి జి. టి. కి వెళ్లిపోతున్నాడు వేణూ! నాతో ఒక ముఖ్యవిషయం మాట్లాడటానికి వచ్చాడు.' జయ నిశ్శబ్దాన్ని జయించడానికి యత్నించింది. వేణు మాట్లాడలేదు.

మరో రెండునిమిషాల నిశ్శబ్దం.

'క్షమించండి వేణుగోపాల్ గారూ! జయతో ఒక విషయం మాట్లాడాలి. ఇంతలో మీరూ వచ్చారు. మీరు ఒక్కనిమిషం – అభ్యంతరం లేకపోతే' సురేంద్రనాథ్ గొణిగాడు.

వేణుకు ఇది కొత్త అనుభవం. జయలక్ష్మితో మరొక పురుషుడు ఏకాంతంలో మాట్లాడవలసిన మాటలు అతని ఊహ కందని విషయం. లేచి నమస్కరించాడు.

'ఏమీ అనుకోకండి. రేపు రండి' అంది జయ సాగనంపుతూ.

రూపంలేని భావాలు మనసులో రేగుతుండగా, కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరాడు వేణు. అసలు ఈ పరిస్థితేమిటో జయలక్ష్మిని అడిగి తెలుసుకోవా లనుకున్నాడు.

మర్నాడు అక్కడికి బయలుదేరుతుండగా పోస్టుమేన్ ఎక్స్‌ప్రెస్ డెలివరీ లెటరు ఒకటి ఇచ్చి వెళ్లాడు. అది నర్సింమూర్తి మామయ్య వ్రాశాడు. ఆయన సాధారణంగా ఎవ

రికీ ఉత్తరాలు వ్రాయడు. ఏడాదికి ఒక ఉత్తరం రాస్తే అది ఆయన విషయంలో ఆశ్చర్యమే! ఈ ఉత్తరం గనక ఇవాళ రాయకపోతే వెయ్యిరూపాయలు నష్టం అని ఆయనకు తెలిసినా బద్ధకిస్తాడు. ఒకవేళ వ్రాసినా వెంటనే పోస్టు చెయ్యడం మరిచిపోతాడు. అవి ఏ పుస్తకంలోనో, ఏ టేబుల్ క్లాత్ క్రిందో నిద్రపోతుంటాయి. నర్సింమూర్తి మామయ్య ఉత్తరాలు వ్రాయక పోవడానికిగల కారణాలు బంధువులు అనేక రకాలుగా వెతుకుతుంటారు. నర్సింమూర్తికి గర్వం ఎక్కువనీ, పేకాటలో మునిగి తేలే మనిషనీ, బద్ధకం ఎక్కువనీ ఇలాగే రకరకాల, రంగురంగుల వ్యాఖ్యానాలు అతని మీద అభిమానం పట్టలేనివాళ్ళంతా చేస్తూనే ఉంటారు. వేణుకు మామయ్యమీద చాలా గౌరవం వుంది. 'సముద్రంలా అగాధమైన మనిషి మామయ్య' అనుకుంటాడు.

వేణుకున్న ఇద్దరు మామయ్యలలో నర్సింమూర్తి చిన్నవాడు. పరాంకుశంగారు పెద్దవాడు. ఇద్దరూ ఒక తల్లి కడుపున పుట్టినా మాటల్లోగాని, చేతల్లోగాని ఆవంతగూడా పోలికలు కనిపించవు. పరాంకుశం మాటలపోగు. నర్సింమూర్తి మితభాషి. పరాంకుశం లౌక్యం తెలిసినవాడు. కనిపించిన ప్రతివాడినీ కౌగలించుకుని, అతని కష్టాలన్నీ తాను భరిస్తున్నట్టు కళ్ళు తుడుచుకుంటూ, ధారాళంగా వాగ్దానాలు చేస్తూ, సునాయాసంగా వాటిని మరిచిపోతూ, అవి తప్పులుగావని వ్యవహరించే దిట్ట పరాంకుశంగారు. నర్సింమూర్తి అందరితోనూ చనువుగా మాట్లాడలేడు. అందర్నీ పూసుకుంటూ తిరగలేడు. స్నేహంగనక చేశాడంటే అవ

సరంవస్తే ప్రాణంయిస్తాడు. అదైనా పైకి ఎంతమాత్రం కనిపించనీయడు. పరాంకుశంగారిలా పూర్వాచార పరాయణుడు గాడు నర్సింమూర్తి. అన్నలాగ శ్లోకాలు వర్లించడం, సంభాషణలో ఉపనిషద్వాక్యాలు దొర్లించడం వగైరా తంతు నర్సింమూర్తికి గిట్టవు. నర్సింమూర్తి క్లబ్బులూ, కాఫీసిగరెట్లూ, క్రాపింగూ పరాంకుశంగారికి నచ్చవు. పరాంకుశం దృష్టిలో నర్సింమూర్తి చెడిపోయిన దురదృష్టవంతుడు. తనమాట వినుంటే ఈపాటికి ఒక ఇంటివాడై ప్రయోజకుడు కావలసినవాడు. వంశంలో చెడ బుట్టినవాడు. నర్సింమూర్తి పెళ్ళిచేసుకోకుండా ఉండడానికి విపరీతంగా బాధపడుతూ వ్యాఖ్యానించే లోకుల్లో పరాంకుశంగారు మొదటి వ్యక్తి.

వేణుకు చిన్నప్పటినుంచి నర్సింమూర్తిమీద ఏదో గురి. ఏదో గౌరవం, ఏదో అభిమానం! దానికీ, బంధుత్వానికీ సంబంధం లేదు. నిజానికి బంధుత్వంమీద తన కంత గొప్ప గౌరవం లేదు. నర్సింమూర్తి ఉత్తరంలో రెండే ముక్కలు వున్నాయి.

'బాబూ! రేపు ఉదయం 8 గంటలకు ఎక్స్‌ప్రెస్‌కు వస్తున్నా. కల్సుకో-చాలా జరూరు.

నీ మామయ్య

నర్సింమూర్తి.

# 10

ఉదయం ఏడున్నరకు స్టేషనుకు బయల్దేరాడు వేణు. ఈ రోజుల్లో ప్లాట్ ఫారం ప్రపంచానికి అద్దంలాంటిది. రక రకాల మొఖాలను, వచ్చిపోయే రైళ్ళనూ చూస్తూవుండటం ఒక కాలక్షేపం. ఎక్స్ ప్రెస్ అరగంట లేటని తెలిసింది. హిగింబాదమ్స్ దగ్గర నిలబడి కాసేపు పుస్తకాలన్నీ చూశాడు. పత్రికలపై శీర్షికలు చూశాడు. వచ్చేస్తూ బుక్ స్టాల్ మేనేజరు కేసి చూస్తే అతను మొఖం చిట్లించి చూడటం కనిపించింది. అరగంట కాలక్షేపం చేసి తన పుస్తకాలు కొనకుండా వెళ్ళడంలో తన అల్పత్వం మేనేజరు కళ్ళల్లో కనిపించింది. మళ్ళా వచ్చి ఓ ముప్పావలా పెట్టి ఒక వార పత్రిక కొన్నాడు. చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నట్టు తేలికపడ్డ మనసుతో బయటకు వచ్చాడు. ఎన్నో పరిచయమున్న మొఖాలు మందహాసాలతో, పలకరింపులతో, కుశల ప్రశ్నలతో వచ్చి పోతున్నాయి. హఠాత్తుగా సుశీల కనిపించింది. ఇంగ్లీషు లెక్చరర్ ఘోష భరించలేక సుశీల వీపుమీద ఒక పద్యం రాసి, అది పుట్టినరోజు పండుగకు ప్రెజంట్ చేశాడు. అయిదు రూపాయలు ఫైనుతో ప్రిన్సిపాలు ఆశీర్వదించినా, అద్భుతమైన సుఖాన్ని ఇచ్చిందా అనుభవం. ఆ తర్వాత ఇద్దరు ముగ్గురు మిత్రులు హేళనగా 'ఏరా! లోకంలో స్త్రీ సౌందర్యాన్ని అందరు కవులూ వర్ణిం

చారు. ముఖాన్నీ, కళ్ళనూ, నాసికనూ, తొడలనూ, వక్షో జాలనూ, చెక్కిళ్ళనూ వర్ణించారుగాని నీలాగ వీపుమీద కవిత్వం రాసినవాడు ఇంతవరకూ లేడురా భాయ్!' అని అన్నారు. తను నవ్వుతూ సమాధానం చెప్పాడు–'పూర్వపు కవులకు ఆడదాని సౌందర్యానికి నిక్కచ్చిగా అంచనా గట్టటం తెలియదు. అసలు వీపు ఆడదాని అందానికి వెన్నె ముక లాంటిది' అని.

సుశీల వేణును చూసి నవ్వి పలకరించింది. సుశీల జీవితంలో ఎంతో మార్పు వచ్చింది. పెళ్ళి చేసుకుంది. ముగ్గురు పిల్లలను కన్నది. మనిషి కొద్దిగా జగ్గింది. స్త్రీ సౌందర్యాన్ని కొరుక్కుతినకుండా పిల్లలు పుట్టే మార్గం ఏ సైంటిష్టన్నా కనిపెడితే బాగుండును అనుకున్నాడు వేణు.

కు స్త్రీలో పోటీకి పనికివచ్చే వస్తాదులాంటివాడు సుశీల పక్కన నడుస్తున్నాడు. 'మా వారే!' అంటూ సగర్వంగా పరిచయం చేసింది. జంకుతూ వేణు చెయ్యి జాపాడు. అతని చేతిలో వేణు చెయ్యి నలిగిపోయింది.

'వీడు పెద్దవాడు అనిల్‌కుమార్, వీడు రెండోవాడు సునీల్. మూడోది మనోమోహిని.' అని పిల్లల్ని చూపెట్టింది. ఆడదాని అందానికీ, ఆవిడ కనే పిల్లలకూ వున్న శత్రుత్వం బ్రహ్మకూడా రూపుమాప లేడు. లైటు వెలుగులో సుశీల రూపురేఖలు స్పష్టంగా కనుపిస్తున్నాయి. ఆవిడ వెన కాలే యత్కించిత్ అధికార దర్పంతో ఒక డవాలా బంట్రోతు. సుశీల భర్త భద్రాచలంలో డిప్టీ కలెక్టరుట. ఇల్లూ, జీపూ ఇచ్చారు. లంకంత ఆ ఇంట్లో నౌకర్లూ, చాకర్లూ

వుంటాడుట. గవర్నరుగారికి ఆయనంటే ప్రాణంట! మొన్న నామధ్య హైద్రాబాదు వెడితే గవర్నరు స్వంత కారు పంపి ఇంటికి రప్పించుకున్నాట్ట! ఇది చూసి మిగతా జిల్లా కలెక్టర్లంతా ఎవరి ముక్కులమీద వాళ్లు వేళ్లు వేసుకున్నారుట! వచ్చే ఏప్రిల్‌కు జిల్లా కలెక్టర్ అవుతాడుట. ఆయన జమాబందీ కెడితే కరణాలంతా పిట్టల్లాగ గజగజ లాడుతారుట. ఐనాసరే తనను ఆయన పువ్వుల్లో పెట్టి పూజిస్తాడట. సుశీల చెప్పుకుపోతూనే వుంది. వాళ్లాయన అవేవీ పట్టించుకోనట్టు జనాన్ని చూస్తున్నాడు.

సుశీల మాటల్లో పల్లవిస్తున్న జీవనమాధుర్యం గోచరిస్తున్నది. తన భర్తా, ఇల్లూ, పిల్లలూ, కారూ, నౌకర్లూ తప్ప తనకీజీవితంలో ఇంకేమీ అవసరం లేనట్లుంది. కావలసినవన్నీ దొరికిన పరిపూర్ణ జీవితంలాగవుంది. సంతృప్తితో ఆమెకళ్లు మెరుస్తున్నాయి. 'నేను చాలా సుఖపడుతున్నాను. నాకంటే అదృష్టవంతు లెవరు!' అనే ధ్వని లేని మాట ఆమె నోటినుంచి రావడం లేదు. తన జీవితానికి బంధంగల ప్రతి విషయాన్ని గురించీ ఘనంగా, గర్వంగా చెప్పుకోగల శక్తి ఆమెకుంది. అది తనకు లేదు.

ట్రైలు వచ్చింది. సుశీల దగ్గర శలవు తీసుకుని వాళ్లాయనను పలకరించాడు. అతను ఉలిక్కిపడి నమస్కారం చేశాడు. చిన్నమామయ్య కనిపించాడు. కాసేపు కబుర్లు అయాక 'రాధను చేసుకోవడం నీకు ఇష్టమేనా?' అని అడిగాడు.

'నీ అభిప్రాయం ఏమిటి మామయ్యా?' అన్నాడు వేణు.

'మేనరికం గనుక పిల్ల నచ్చితే చేసుకోవచ్చు.'

'రాధను చేసుకోవడం నా కిష్టంలేదు మామయ్యా!'

క్షణాల నిశ్శబ్దం. తర్వాత నర్సింమూర్తి అన్నాడు :

'జయలక్ష్మిని చేసుకుందా మనుకుంటున్నావా ?'

వేణుకు ఆశ్చర్యమనిపించింది. ఈసంగతి మామయ్యకు ఎట్లా తెలిసింది ? ఆయన దగ్గర ఏ విషయం దాచరాదన్న ఆత్మీయత వేణులో పొంగింది. ఉన్న యథార్థం అంతా చెప్పాడు. నర్సింమూర్తి మహదానందంతో, చెమ్మగిల్లిన కళ్ళతో 'చాలా సంతోషం నాన్నా ! తప్పకుండా చేసుకో. జయలక్ష్మి మనసు చాలా మంచిది. మీ ఇద్దరి దాంపత్యం ఆదర్శప్రాయంగా వుంటుంది. నేను జయను చేసుకోమని చెప్పడానికే వచ్చాను. ఇందుకు నాన్నావాళ్లు వప్పుకోరు. అయినా ధైర్యంగా వుండు. చాలామంది నీకు అనేక సలహాలు ఇవ్వడానికి వస్తారు. అవన్నీ ఆలోచించకు. మళ్ళీ నేను వచ్చే నెలాఖరుకు వస్తా. అప్పుడన్నీ ఆలోచిద్దాం' అన్నాడు.

'అయితే, మామయ్యా! జయలక్ష్మి నీ కెట్లా తెలుసు?'

వేణు ఆత్రుతను అణుచుకోలేక పోయాడు. రైలు కూత వేసింది.

'ఆ సంగతి తర్వాత చెబుతాను. వస్తా నాన్నా!' కదులుతున్న రైలులోంచి చెయ్యి ఊపాడు నర్సింమూర్తి.

వేణు ఆలోచనలో పడ్డాడు. తనకు బుద్ధి తెలిశాక

ఎన్నడూ చిన్నమామయ్య తనతో ఇంత చనువుగా మాట్లాడ లేదు. జయలక్ష్మికీ, చిన్నమామయ్యకూ వున్న సంబంధం ఏమిటి? ఈ విషయంలో ఆయన ఇంత శ్రద్ధ వహించడానికి కారణం ఏమిటి? అర్థంకాని ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకలేదు. ఏది ఏమైనా జయలక్ష్మిని చేసుకోవాలనీ, ఆమెతో కలిసి బ్రతకాలనీ మనసు పరుగులు తీస్తున్నది. జయలక్ష్మిలో ప్రపంచానికి కనిపించని ఏదో నైర్మల్యం వుంది; గుర్తించని పవిత్రత వుంది. జయలక్ష్మి శిరీషకోమల పుష్పం.

ఒకవారం ప్రశాంతంగా గడిచింది. ముహూర్తం పెట్టుకుంటానికని పరాంకుశంగారు వచ్చారు. ఇంక తను ఆలస్యం చెయ్యగూడ దనుకున్నాడు వేణు. ఆ రాత్రి భోజనాలు అయాక అందరూ వసారాలో చేరి, పెళ్లి ఏర్పాట్లను గురించి మాట్లాడుకుంటున్నారు. వేణు వచ్చేసరికి అందరూ మాట్లాడటం ఆపేశారు. పక్కింటి అన్నప్పశాస్త్రిగారు 'రా వోయి పెళ్లికుమారుడా!' అని ఆప్యాయంగా పిలిచారు. వేణు పక్కనే వున్న బెంచీమీద కూలబడ్డాడు.

'ఏమయ్యా! వేణుగోపాలం! నీకు సైకిలు కావాలా? రేడియో కావాలా?' అని అడిగాడు అన్నప్పశాస్త్రి.

వేణు జవాబు చెప్పలేదు.

'సైకిలు వుంటే ఎక్కడైనా వెళ్లి రావడానికి ఉపయోగపడుతుంది. రేడియో ఐతే నాటకాలూ, పాటలూ వినొచ్చు. కాలక్షేపం బాగా జరుగుతుంది.' రెండిటిమీదా కన్ను వేశాడు రమాకాంతంగారు.

'అబ్బాయికి మూడు వేలు కట్నం. అత్తగారికి నూట పదహార్లూ, ఆడబడుచులకు నూట పదహార్లూ కంచిచీరలు, మామగారికి పట్టుపంచెలు—ఇదిగాక పెళ్ళికొడుకు తేల్చవలసింది సైకిలుగాని, రేడియోగాని—'

వివరాలు అన్నప్పగారు చెప్పారు. వేణుకు ఈ బేరాలు చూస్తే చిరా కనిపించింది.

'నేను ఈ పెళ్లి చేసుకోను నాన్నా!' అన్నాడు ధైర్యంగా.

రమాకాంతంగారు ఉలిక్కిపడ్డాడు. పరాంకుశంగారు సూటిగా చూశాడు. అన్నప్పశాస్త్రికి అసలా మాటకు అర్థం తెలియలా.

'ఏమిట్రా నువ్వు వాగేది?' అన్నాడు రమాకాంతం.

'నేను రాధను చేసుకోను అని చెబుతున్నా!'

'అదే. ఎందుకు చేసుకోవూ—నీకిదేం పోయేకాలమూ అని నేను అడుగుతున్నారా అప్రాచ్యుడా!' రమాకాంతంగారి కళ్లు చింతనిప్పుల్లాగ మెరుస్తున్నాయి. ఆయన ఈ తిరుగుబాటు సహించలేకపోయాడు.

'నాకా పల్లెటూరి మొద్దు వద్దు. నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. కొద్ది రోజుల్లో పెళ్ళి చేసుకోబోతున్నాను కూడా' అంటూ చకచకా తన గదిలోకి వెళ్లి తలుపులు వేసుకున్నాడు.

ఆకాశం విరిగింది. భూమి పగిలింది. నక్షత్రాలు నేలరాలాయి. ఆ ఇంట్లో ప్రళయం వచ్చింది. అనుకున్నట్టే రమాకాంతంగారు జుట్టు పీక్కుని, రంకెలువేసి, తెలుగు

భాషలో వున్న మారుమూల తిట్లన్నీ తిట్టి గుండెలు బాదు కుంటూ బయటకు వెళ్ళిపోయారు. అన్నప్పగారు పితృభక్తి గురించి, మాతృభక్తి గురించి, మేనరికపు వివాహాలూ, వాటి ప్రాశస్త్యమూ అనే విషయాన్ని గురించి అనర్గళంగా మాట్లాడి, శోషొచ్చి మజ్జిగ తాగడానికి లేచి ఇంటికి చక్కా పోయాడు. తల్లిగూడా ఈ దృశ్యాన్ని రసాత్మకం చేయ డానికి కళ్లు తుడుచుకుంటూ, ముక్కు చీదుకుంటూ వంటిం ట్లోకి పోయి చెంగు పరుచుకు పడుకుంది. వేణు చెల్లెళ్లిద్దరూ బిక్కమొఖాలు వేసుకు నుంచున్నారు. ఈమహాప్రళయంలో రవ్వంతగూడా చలించక అదే ప్రసన్నవదనంతో, ఇది తన కూతురి పెళ్ళి విషయం కానట్లూ, ఏదో రసాత్మక నాటకం చూస్తున్నట్టూ వుండిపోయాడు పరాంకుశంగారు.

వేణుకు ఆ రాత్రల్లా నిద్దరపట్టలేదు. కళ్ళు మూస్తే పీడకలలు రావడం మొదలుపెట్టాయి. తెల్లవారితే ఆ వాతా వరణం ఎట్లా భరించాలో అర్థం కాలేదు. ఎక్కడికైనా వెళ్లి పదిరోజులు వుంటే బాగుండు ననిపించింది. చప్పున ముకుందరావు 'బాబాయి జ్ఞాపకానికి వచ్చాడు.

అయిదు గంటలకే లేచి మొఖం కడుక్కొని నాలుగు జతల బట్టలు బేగ్‌లో పెట్టుకున్నాడు. ఇంకా ఎవరూ లేవ లేదు. తల్లిని లేపి వరంగల్ వెడుతున్నానని చెప్పాడు వేణు. తల్లి మాట్లాడలేదు. ఆ ఊరు వదిలేముందు జయ లక్ష్మితోనూ, వాళ్లమ్మతోనూ అన్నివిషయాలూ మాట్లాడా లనుకున్నాడు. కాని మాట్లాడకుండానే వచ్చేశాడు. వరం గల్ నుంచి జయకు ఒక ఉత్తరం రాశాడు. జరిగిన విష

యాలన్నీ రాసి, 'ఈ ప్రపంచాన్ని ఎదిరించైనా సరే మనం పెళ్లి చేసుకుందాం జయా! ఎవరూ దీన్ని ఆపలేరు' అని ముగించాడు లేఖ.

వేణు వరంగల్‌లో వున్న వారం రోజులూ పరాంకుశంగారు హైద్రాబాదు వదిలిపెట్టలేదు. మర్నాడే బయల్దేరి ఊరి నాలుగు బజార్లూ కలియ తిరిగి, జయలక్ష్మి అడ్రసూ, సంగతి సందర్భాలూ అన్నీ వాకబు చేశాడు. ఈ భోగట్టా సేకరించడానికి పరాంకుశంగారికి సత్యమూర్తి చాలా తోడ్పడ్డాడు. ఆయనకు అవసరం అయినదానికంటే పదిరెట్లు ఎక్కువ అందజేశాడు సత్యమూర్తి. ఎంత చెప్పినా వేణు వినలేదనీ, జయలక్ష్మిని పెళ్లి చేసుకోవడం మంచిది కాదనీ, ఈపెళ్ళి ఆపుచేయించి వేణు జీవితాన్ని ఉద్ధరించడానికి తను చేయగలిగిన సాయం ఏదన్నావుంటే తప్పకుండా చేస్తాననీ పరాంకుశంగారికి వాగ్దానం చేశాడు. ఆయన తృప్తిగా ఇంటికొచ్చారు.

రమాకాంతంగారు చిత్రమైన మనిషి. ఆయన ఏమాత్రం వడిదుడుకులకూ తట్టుకోలేడు. అది మాసిపోయేదాకా విపరీతంగా బాధపడుతూ అన్నం మానేసి కృశించిపోతున్నానని ఆపేటంతా ప్రచారం చేసుకుంటాడు. జనానికి తనమీద విపరీతమైన సానుభూతి వుండాలని ఆయన కోరిక. పరాంకుశంగారు ఇంటికొచ్చి, 'బావా! ఇదయ్యా సంగతి! అది ఒక వేశ్యమాత. ఎలా కన్నదో, ఎవరికి కన్నదో ఒక ఆడపిల్లను కన్నది. దానికి పెళ్లిచెయ్యాలని వలపన్నింది. అందులో మన వెర్రినాగన్న పడ్డాడు. పోనీ, చూసీ చూడ

నట్టు ఊరుకుందామా అంటే ఈ అస్త్రావ్యస్తపు పెళ్లివల్ల మన కుటుంబాలు విడిపోవడమేగాకుండా మీ కుటుంబం సర్వనాశనమై పోతుంది. ఇంటికి జ్యేష్ఠుడు ఇట్లా కానిపని చేస్తే మిగతాపిల్లలకు పెళ్లిళ్లు ఎట్లా అవుతాయి? అయిన వాళ్లు ఎవరు నీసంబంధం చేసుకుంటారు?! అందుకని ఎట్లాగైనా ఈపెళ్ళి ఆపుచెయ్యి బావా!'

'నేను ఏం చెయ్యను బావా! వాడు చిన్నవాడా చెవులు మెలేసి కూచోబెట్టడానికి? కొరుకుడుపడని కొయ్యలాగ వున్నాడు. ఏంచెయ్యాలో అర్థంగావడంలేదు' అని రమాకాంతంగారు కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

'అందుకనే కొంత మంత్రాంగం నడపాలి బావా! ఆపని నేను చూస్తాను. అదంతా నాకు వదిలిపెట్టి నువ్వు నిశ్చింతగా వుండు' అని యజ్ఞోపవీతాన్ని విష్ణుచక్రంలాగ గిరగిరా తిప్పాడు పరాంకుశం.

# 11

పరాంకుశంగారికి ఈ కేసు కొత్తదిగాదు. ఆయన జీవితంలో ఇటువంటివి లక్షోపలక్షలు చూసినవాడు. ఒకనాడు పనిగట్టుకు బాలాంబఇంటికి వెళ్ళాడు. జయలక్ష్మి ఇంట్లో లేదు. పరాంకుశంగారు ఇంట్లో అడుగుపెడుతూనే 'తల్లీ! జయలక్ష్మి నీ కేమవుతుంది' అని అడిగాడు. ఈ కొత్తవ్యక్తిని చూసి తెల్లబోయింది బాలాంబ. ఆయన్ని

కూర్చోమనాలనికూడా తట్టలేదు. 'మాఅమ్మాయేనండీ!' అంది. ఎందుకో ఆ మెగుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయి.

'చూడమ్మా! నేను చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను. ఏదో ఎర్రగా బుర్రగా వుందని మా వేణుగాడు మీ అమ్మాయివలలో పడ్డాడు. అభం శుభం తెలియని సన్నాసి. వాడితర్వాత పెళ్లి కావలసిన పిల్లలు ఆరుగురున్నారు. వీడిటువంటి గోతిలో పడితే తక్కినపిల్లలకు పెళ్లిళ్లు ఎట్లా అవుతాయి ? మా కుటుంబాలను నాశం చెయ్యకమ్మా! నువ్వు నా తోబుట్టులాంటిదానివి' అని ప్రాధేయపడ్డాడు. ఎంతోసేపు ఎన్నో రకాలుగా చెప్పాడు. బాలాంబ శిలా ప్రతిమలాగ వింది. చివరికి అంది – 'మిమ్మల్ని నాశనం చెయ్యాలని మా కెప్పుడూ లేదు. మీ బాధకొద్దీ మీరు నోటికొచ్చినట్లు మాట్లాడారు. కాని, ఆమాటలు మమ్మల్నెంత బాధ పెడతాయో మీరు ఆలోచించ లేదు. సరే! వెళ్ళండి. మా అమ్మాయివల్ల మీఅబ్బాయికి ఎటువంటి ప్రమాదమూ జరగదు.' కళ్లల్లో నీరు వరదలై పొంగింది. అభిమానం మరణించి పిశాచమై పీక పిసుకుతూంది.

పరాంకుశంగారు మెట్లు దిగుతుండగా జయలక్ష్మి ఎదురైంది. తక్షణం ఆగి, కళ్లజోడు సవరించి, క్రిందినుంచి మీదిదాకా నఖశిఖపర్యంతరం పరీక్షించాడు. జయలక్ష్మికి నవ్వొచ్చింది. వయసుమళ్లినా సరదా తీరని ముసలివాళ్ల సర్వస్వం చూపుల్లోనూ, మాటల్లోనూ విజృంభిస్తుంది. ఆలాంటివాళ్ళనుచూసి కవ్వించడం, రెచ్చగొట్టటం, నవ్వు

కోవడం వయసులో వున్న చిలిపిపిల్లలందరికీ అలవాటే.

'ఏమిటి తాతగారూ! అట్లా చూస్తూన్నారు పాపం!' అని మర్యాదగానే పలకరించింది. పరాంకుశం త్రుళ్లిపడి 'నువ్వు బాలాంబకూతురివిగదూ!' అన్నాడు. 'ఔను' అంది జయ. 'ఆహాఁ!' అని తల పంకించి రెప్పవాల్చకుండా చూస్తూవుంటే, చిరాకనిపించి, ఇంక మాట్లాడకుండా లోపలకు వచ్చేసింది.

ఇంట్లో అడుగుపెట్టేసరికి తల్లి మంచంమీద బోర్లబొక్కలా పడుకుని ఏడుస్తూంది. ఆస్థితిలో తల్లిని చూసేసరికి జయలక్ష్మి అంతరాల్లో దాగివున్న మాతృప్రేమ ఒక్కసారి పెల్లుబికింది. తల్లి ఘోరమైన తప్పుచేసిం దని ద్వేషించినా-ఏదో ఒక సమయాన మాతృప్రేమ ఉప్పెనలాగ పొంగు లెత్తుతుంది.

'ఎందుకమ్మా! ఏడుస్తున్నావ్ ?' అంటూ, జాలిగా తల నిమిరింది. ఆ ప్రశ్నలోవున్న చల్లదనం బాలాంబను మరింత బాధపెట్టింది. భోరున ఏడుస్తూ-కూతుర్ని కౌగలించుకుని, చెప్పలేక చెప్పలేక చెప్పింది. 'నువ్వు ఆ అబ్బాయిని చేసుకోకు జయా! ఆకుటుంబాన్ని పాడుచేయడం మంచి పని గాదు. పైగా అల్లరీ, రభసా! మనమే మానుకుంటే మంచిది' అంది.

ఎవరు ఈమాట అన్నది? తనను కనిపెంచిన తల్లి! తను ఎన్ని ఆశలు పెంచుకుంది? 'నిన్ను పెళ్లిచేసుకుంటాను జయా!' అని వేణు చెప్పినప్పుడు తనెంత పొంగిపోయింది! తను నిరంతరం తల్లికి సమస్యగానే వుంటూంది, అలాగే

తల్లి తనకు సమస్య అవుతూంది. ఒకరి నీడలో ఒకరు నుంచున్నారు. ఒకరి నీడ ఒకరిని దహించివేస్తూంది. జయలక్ష్మికి వొళ్లంతా భగ్గున మండినట్లయింది. వెర్రిబాధతో గుండె పగులుతుందేమో ననిపించింది. ఆ బాధతో తల్లిని తిట్టింది. కనగానే చంపనందుకు శపించింది. ద్వేషానలంతో కంపించిపోతూ, తన గదిలోకి వెళ్లి మంచంమీద వాలిపోయింది.

# 12

తెల్లవారింది. నిద్రలో జయలక్ష్మిదుఃఖం కరిగిపోయింది. కన్నీరు ఇగిరిపోయింది. ఉదయం లేవగానే మనసూ, శరీరం ఎంతో తేలికగా వుంది. కాఫీ త్రాగుతుండగా వేణూ వచ్చాడు. అతనికి మరొక కప్పు తెచ్చి ఇచ్చింది. బాలాంబ గదిలోంచి బయటకు రాలేదు. ఇద్దరూ ఎంతోసేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఎవరూ మాట్లాడలేక పోతున్నారు. ఏదో మాట్లాడాలి. ఏదో బరువు దించుకోవాలి. కాని-ఎట్లా మొదలు పెట్టాలో అర్థంకావడం లేదు. వేణు మొఖంలో వున్న దీనత్వం జయలక్ష్మిలో వున్న నిశ్చలత్వాన్ని చెదరగొట్టలేక పోయింది. ఒకరికొకరు చెప్పుకోవాల్సింది చాలా వున్నా ఏమీ చెప్పకుండానే ఆ సమావేశం ముగిసింది. ఒక్కొక్క సమయంలో కొన్ని మాటలు ఎదురుపడి చెప్పలేము. అటువంటి సమయంలో కాగితం, కలమే సాధనాలు.

వాటి ద్వారా ఎటువంటి భావాలనైనా వ్యక్తం చేయవచ్చు. ఆ రాత్రి జయలక్ష్మికి ఉత్తరం రాశాడు.

'శైశవంలో నుంచి యౌవనంలోకి అడుగు పెడుతున్నప్పుడు ఎన్నో కలలు కంటాం. ఎన్నో ఆదర్శాలతో ఆశయాలు పెంచుకుంటాం. కాని అనుకున్నవి అనుకున్నట్టు జరగవు. కలలు కరిగిపోతాయి. ఆశలు విరిగిపోతాయి. మన పెళ్ళికి ఎందుకింత రాద్ధాంతం జరగాలో అర్థం గావటం లేదు. నా ఇష్టం వచ్చినట్టు నేను బ్రతకడానికి వీలుకావడం లేదు. ఈ ఉచ్చులాళ్లు, ఈ తీవ్రశక్తులు నన్ను బలహీనం చేస్తున్నాయి జయా! మనస్సు వికలమై పోతోంది. ఆనందంగా, ప్రశాంతమైన వాతావరణంలో, పవిత్రంగా జరగాల్సింది పెళ్ళి. దానికి బదులు కన్నీళ్ళు-బురద, స్వార్థం-గౌరవం పేరుతో రక్తదాహం ఇవి కనుపిస్తున్నాయి. ఈ పరిస్థితిలో-ఈ వయస్సులో మన మిద్దరం సమస్త విశ్వాన్నీ ఎదిరించి బ్రతగ్గలమా? నా కేమీ పాలుపోవడం లేదు. ఆలోచించు. తొందరపడటం మంచిది కాదేమో. ఎట్టి పరిస్థితులలోనైనా మనం వివాహం చేసుకుందా మనే అంతిమ నిశ్చయం చేసుకున్నా, కొన్నాళ్లు ఆగడం మంచి దనిపిస్తూంది. నన్ను అపార్థం చేసుకోవని భావిస్తున్నాను.'

జయలక్ష్మి ఉత్తరం నలిపి కింద పారేసింది. అది చదువుతూంటే ప్రపంచాన్నంతా అలాగే నలిపి నాశనం చేయాలన్నంత కసి గలిగింది. రక్తం కన్నీరై పొంగింది.

రెండు నెలలు ఏ సంఘటనా లేకుండా గడిచాయి. వేణు మళ్ళీ కనిపించలేదు సరిగదా-మిగతా స్టూడెంట్సుతో

కలిసి మైసూరు వెళ్ళాడు. ఈలోగా జయలక్ష్మి పరిస్థితిలో కొంత మార్పు వచ్చింది. ఎలాగైనా ఆ ఇంట్లోంచి వెళ్ళి పోవాలని నిశ్చయించుకుంది. ఇక్కడవుండి ఇలాగే తనింక బ్రతకలేదు. ఆ ఊరు తనకు చేసిన అపకారమేమిటో, ఉపకారమేమిటో నిశ్చయంగా తనకు తెలియదు. ఉన్న ఊరి మీద చిత్రమైన మమకారం ప్రతిప్రాణికీ వుంటుంది. ఆ ఊరిలో ఏ ఒక్క వ్యక్తిమీదా తనకు అభిమానం లేక పోయినా, ఆ ఊరిమీద మమకారం పోదు. అందరూ పగ బట్టి అవమానించినా అభిమానం పోదు. మనుష్యులందరినీ ద్వేషించినా, ఆ ఊరిని ద్వేషించలేము.

జయలక్ష్మికి అదృష్టవశాత్తూ చింతలపూడిలో ఉద్యోగం వచ్చింది. నూటయాభై జీతం. తను స్వతంత్రంగా బ్రతకడానికి భగవంతు డేర్పరచిన మొదటి అవకాశం. అన్నిటినీ వదిలి దూరంగా వెళ్ళిపోవా లనిపించింది. ఈ పాపకూపం నుంచి బయటపడాలి. ఈ ముఖాలను మళ్ళీ చూడాలనిపించడం లేదు. తల్లిముఖం నిత్యం తనని బాధి స్తోంది. ఈ బంగారుపంజరం నుంచి తను విముక్తురాలై, స్వేచ్ఛగా ఎగిరిపోవా లని వుంది. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకుంది. ప్రయాణం రోజు దాకా తల్లికీ విషయం చెప్పలేదు. ప్రయాణానికీ, మొదటి జీతం వచ్చే దాకా ఖర్చులకూ కొంత డబ్బు కావాలి. తన దగ్గర ఇరవై రూపాయలకంటే ఎక్కువ లేదు. తల్లిని అడగటానికి అభి జాత్యం అడ్డువస్తోంది. ఎవర్ని అడగాలి? చప్పున సత్యవతి గుర్తుకు వచ్చింది. దాని దగ్గరుంటే తప్పకుండా ఇస్తుంది.

కాని, వుంటుందా? ఎవరికీ సహాయం చేసే శక్తి లేనప్పుడు ఎదుటివాళ్ల కష్టాలకు అంతులేని సానుభూతి చూపించే శక్తి వస్తుంది. లేనివాళ్ళ మంచితనానికి విలువ లేదు. ఉన్నవాళ్లు మంచిగావుంటే హరించి పోతారు.

రెండు వందలు కావాలని సత్యవతిని అడిగింది. సత్యవతి ఆశ్చర్యపోయింది. జయలక్ష్మి తనను డబ్బు అడగట మేమిటి? మర్నాడు ఇస్తానని చెప్పి గాజులు బ్యాంకులో పెట్టి రెండు వందలు తీసుకెళ్ళి జయలక్ష్మి కిచ్చివచ్చింది. ఉన్న వాళ్ళకు సహాయం చెయ్యడంలో లేనివాళ్ళకు అద్వితీయమైన ఆత్మానందం వుందేమో!

బయట రిక్షా నిలబడి వుంది. జయలక్ష్మి తల్లికి చెప్ప కుండానే వెళ్లిపోవా లనుకుంది. రిక్షావాడు పెట్టే, బెడ్డింగూ పట్టుకెళ్లాడు. బాలాంబ గదిలోనుంచి బయటకు వచ్చింది.

'ఎక్కడికి వెడుతున్నావ్ జయా! నాతో చెబితే నేను వద్దంటానా తల్లీ!' అంది కంపిస్తున్న స్వరంతో.

జయలక్ష్మికి తల బరువెక్కింది. కళ్లు నీటితో నిండి, చూపు మసక మసకగా వుంది. తను ఏదో చేయగూడని పని, క్షమించరాని తప్పు చేస్తున్న ట్లనిపించింది. మాట రాలేదు. అల్లాగే అచేతనంగా నిలబడి పోయింది.

'నీ సుఖానికి నేను అడ్డువస్తానా జయా! నీ గురించి నేను ఎంత బాధపడుతున్నానో నీకు అర్థంగావడం లేదు.'

జయలక్ష్మిలో చలనం కలిగింది. నిగ్రహించుకుంది. ఒక్కసారి బంధాలన్నీ తెగతెంపులు చేసుకుని స్వేచ్ఛగా ఎగిరిపోయే సమయంలో తల్లి నేర్పుగా వల విసురుతోంది.

జయలక్ష్మి శక్తినంతా కూడదీసుకుని ఒక్క ఊపులో రిక్షా ఎక్కి కూర్చుంది. ఆమె కళ్లల్లోంచి నాలుగైదు కన్నీటి బొట్లు రాలిపడ్డాయ్ !

ఆ ఘనీభవించిన నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రైలుకూత బాలాంబ గుండెల్లో జొరబడింది. ఆ కూత ఏదో అపశ్రుతిలా-వికృతంగా హృదయాన్ని తడిగుడ్డలాగ పిండింది! 'నా చిట్టి తల్లి నాకు గాకుండా వెళ్లిపోయింది' అనుకుంది. అంతలోనే అశుభం శంకించినందుకు లెంపలు వేసుకుంది. 'నా బిడ్డను నా కెన్నడూ దూరంగా విసిరి వెయ్యకు భగవాన్ ! ఏనాటికైనా తిరిగి నా వొళ్లో సుఖంగా నిద్రపోనీ!' అంటూ సూర్యోదయం అయేవరకూ భగవంతుడిని పరిపరి విధాల ప్రాధేయపడింది, బ్రతిమలాడింది. దూషించింది. నిందలు మోపింది. తెల్లవారాక అలసిపోయి నిద్రించింది. ఆమె చేష్టలన్నీ మూగగా చూశాడేమో మాట్లాడలేని భగవంతుడు !

# 13

స్త్రీ కడుపులోంచి పుట్టిన పురుషుడు ఆమె కాళ్ళ చెంత పెరిగి, ఆమెకౌగిట్లో స్వర్గాన్ని, ఆమె కన్నీటిలో నరకాన్ని అనుభవించి నశిస్తాడు. పురుషుడిలోనుంచి సృష్టి శక్తిని గ్రహించిన స్త్రీ ఆతనికోసం క్రమంగా చావడంలో ఆనందాన్ని పొందుతూ, ఆ ఆనందంలోనే జీవితానికిఅర్థాన్ని కల్పించుకుంటూ, సృష్టికి ప్రతిసృష్టి చేసి రాలిపోతుంది. ఈ

సత్యానికి లక్షవ్యాఖ్యానాలూ, కోటిఅర్థాలూ కల్పించుకుని గందరగోళం చేసేది మనిషి ఒక్కడే. జడపదార్థాలకు లేని చైతన్యం మానవుడికి ఉంది. జంతుజాలానికి లేని స్వతంత్ర బుద్ధిగూడా అతనికి సంక్రమించింది. దీనికివివేకమనీ, తెలివి తేటలనీ, సంస్కారమనీ, మనోవికాసమనీ, మేధాశక్తి అనీ రకరకాలపేర్లు పెట్టుకుని, దాని గొప్పదనాన్ని అంచనాకట్టి, అది లేని తక్కిన సృష్టిలో తన ప్రత్యేకతలు వేలెత్తి చూపిం చుకుని, తనవీపు తానే తట్టుకుని సంతృప్తిపడుతున్నాడు మానవుడు. ఈ మేధాశక్తి మానవుడికి లేకపోతే ఏం కొంప మునిగింది? ఇది సత్యమూర్తి ప్రశ్న. సత్యమూర్తి దేన్న యినా తలక్రిందులుగా చూస్తాడని అతని స్నేహితబృందం అంటుంది. ప్రపంచమే తల్లక్రిందులుగా వుందనీ, అది సరిగ్గా కనపడాలంటే చూసేవాడు తల్లక్రిందులుగా చూడాలనీ సత్యమూర్తి సమాధానం ఇస్తుంటాడు. నిజమేనేమో! మానవుడికి మనస్సుంది. ఎందుకూ? నిరంతరం గతాన్ని గురించి బాధలతోనో, భవిష్యత్తుగురించి బరువులతోనో కుమిలిపోవడానికా? అనంతకోటి నక్షత్రమండలంలో రేణువు లాంటి భూమండలంపై-రేణువుకంటే హీనంగా జీవించే తన అల్పత్వాన్ని పోల్చుకుంటూ కుంచించుకుపోవడానికా? ఏసుఖంతోనూ సంతృప్తిపడకుండా, దొరికినదాన్ని తృణీక రిస్తూ, అందనిదానికోసం అర్రులుజాస్తూ, అడ్డంవచ్చిన మను ష్యులను ద్వేషిస్తూ, నాశనంచేస్తూ, తనకంటే అతీతవ్యక్తి ఎదురైనపుడు దాసోహం చేసి ఆత్మహత్య చేసుకుంటా నికా? సృష్టిలో దేంట్లోంచీ శరీరం సుఖాన్ని అందుకోలేక

ని స్తేజమైనపుడు ఏదో ఒక అసాధ్యమైన అదర్శాన్ని బల వంతంగా నమ్మి, సుఖాలకు భయపడి, ఇరుకుమూలల్లో, సందుల్లో, మహారణ్యాల్లో, సంఘసేవలో, దైవభక్తిలో ఆత్మ వంచన చేసుకుంటానికా? బ్రతికినందుకు ఏదో సాధించా లంటారు తన్మయానందస్వామి. అలా సాధించకపోతే సృష్టి ఆగిపోతుందా? అసలు బ్రతకడం ఎందుకు? పుట్టాంగనక! ఎందుకు పుట్టాం? సమాధానం శూన్యం. సమాధానం వెతు క్కుంటానికి మళ్ళీ శైశవంలోనుంచి వెనక్కుపోయి మాతృ గర్భంలో ప్రవేశించి, అక్కడ నిక్షిప్తమైవున్న అనంత విశ్వాన్ని శోధించాలి.

ఏమి టీపిచ్చి ఆలోచనలు! అందరికీ ఇట్లాంటి ఆలో చనలు వస్తాయా? అందరూ ఇట్లా మనసును కలుషితం చేసుకుని, నీళ్లు కారిపోతూ కూర్చుంటారా? తన చుట్టూ వేల మందీ, లక్షలమందీ మనుష్యులు తిరుగుతున్నారు వాళ్ళం దరూ ఎందుకో తననుంచి దూరంగా తొలగుతున్నట్టు అని పిస్తోంది. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అందరూ బరానీ ల్లాగ జీవితాన్ని నమిలేస్తున్నారు. వాళ్లు అంత ఆనందంగా ఎట్లా వుండగలుగుతున్నారు? నుబ్బులు క్షణక్షణం విరగబడి నవ్వుతుంది. అంత విరగబడి నవ్వడానికి నరాలలో ఎంత చైతన్యం వుండాలి! తన శక్తి లేమయాయి? నవ్వలేనివాళ్లను కాల్చిచంపే ప్రభుత్వం వస్తే మానవాళికి ఎంత మేలు! అప్పుడు ఎవ్వరూ మిగలకపోతే! తన్మయానందస్వామికి జీవితంమీద విరక్తి ఎందుకు కలిగిందో? ఆయనగూడా పూర్వాశ్రమంలో ఎన్నో బాధలు పడివుంటాడు. ఆ జీవితం

మీాద వెగటుపుట్టి, అన్ని బరువులూ దించుకుని అన్ని బంధాలూ త్రెంచుకుని విరాగై వుంటాడు. ఆయనవయస్సు ముప్పైఅయిదుకు మించివుండదు. ఆయనకు పెళ్ళి అయిందో లేదో? లేక ఎవర్నన్నా ప్రేమిస్తే, ఆమె మోసం చేసివుండ వచ్చు. లేక అప్పులబాధ కావచ్చు. ఆయన పెదవులపై నిరంతరం అతినిర్మలమైన మధురహాసం నాట్యం చేస్తూవుంటుంది. మందహాసపు మేలిముసుగు తీస్తే ఎట్లా వుంటాడో? తన్మయానందస్వామి - పేరు బాగుంది. ఆయన పూర్వాశమంలో గుడ్లురుముతూ, రాక్షసనృత్యం చేస్తూ పలుపుతీసుకుని పెళ్లాన్ని బాది. యజ్ఞోపవీతాన్ని తెంచి వీధిలోకి పోతున్న దృశ్యం కళ్ళకు కనిపించింది. ఏమిటో ఊహ! ఇంతకూ ఆయనకు భార్య వుందో లేదో!

తన్మయానందస్వామి ఆ ఊరు వచ్చి నెలదాటిందిట రోజురోజుకూ ఆయన రు ప్రఖ్యాతులు అడవిమంటల్లాగ వ్యాపిస్తున్నాయి. ఆయన్ని చూస్తున్నప్పుడల్లా తనకు సన్యాసం పుచ్చుకుందా మనిపిస్తుంది. తనుగూడా సన్యాసినియై కొండల్లో-మఠంలో ప్రశాంతజీవితం గడపగలదా? ఇప్పు డసలు అటువంటి మఠాలున్నాయా? పూర్వం వుండే వని ఎక్కడో చదివినజ్ఞాపకం. ఆరోజుల్లో కొన్నిమఠాల్లో పురుషులతోబాటు స్త్రీలకుగూడా సన్యాసం ఇచ్చి, ఆశ్రమంలో చేర్చుకునేవారుట. సన్యాసం పుచ్చుకున్నవాళ్ళల్లో అన్నివయసులవాళ్లూ వుండటంవల్ల మళ్ళీ క్రొత్తప్రేమలూ, కొంగ్రొత్త కోర్కెలూ చిగురించి, జంటలుజంటలుగా మఠాలు మహాపరివర్తనం చెందేవిట! దీని ఫలితాలను

కొందరు ప్రేమఫలాలనీ మరికొందరు పాపఫలాలనీ పిలుచుకునేవారుట. ఫలం ఏదైనా, జరిగిందేమిటంటే ఆ సన్యాసుల మఠాలు సంతానోత్పత్తి కేంద్రాలుగా మారటం!

ప్రాచీనవ్యవస్థలనన్నింటినీ పునరుద్ధరించాలని ఇటీవల ఒక నాయకుడు సింహగర్జన చేసినట్టు పేపర్లో ఫోటో వేశారు. ఎన్నికలు రసాత్మకాలు. ఎన్నిక లయాకగానీ సంగతి తేలదు. ముచ్చటైన మూడురంగుల నర్తకి ముఖచిత్రంతో భగవద్గీతబైండు. మేలుప్రతి. ఒక ప్రకటన. అన్నింటిలో మూలపదార్థం ఒక్కటే! పాశ్చాత్యశాస్త్రజ్ఞుల వ్యాఖ్య. శుక్రగ్రహానికి ప్రయాణం. ఒకవార్త! వరుడు కావాలి! ఎవరికి? కన్యలందరికీ. ఎందరు కన్య లున్నా రీ లోకంలో? అందరికీ వరుళ్ళు కావాలి! రెండు తలల శిశువు! నిప్పులు భక్షించే యోగి!! హిమాలయాల్లో ముప్ఫై అడుగులమంచుమనిషి. జబ్బల్పూరులో ఒక కాలేజీ అమ్మాయిని ఇద్దరు రౌడీలు చెరపటం. పధ్నాలుగుమందితో ఒక ఇంటిని తగులబెట్టిన వైనం-ప్రపంచమే ఒక బ్రహ్మాండమైన పిచ్చాసుపత్రి! ఏడుపైసల వారాపత్రికలో నవరసాల వరదలు!! కారుచౌక – చౌక కారుల ఉత్పత్తి. కార్లున్నవాళ్ళందరినీ క్వారీలో రాళ్లు మోయించాలి. సత్యానికి జైలు.

ఆలోచనలు నీరసించి, జయలక్ష్మి నిద్రపోయేసరికి అర్ధరాత్రి ఒంటిగంట దాటింది.

# 14

తెల్లవారింది. పనిమనిషి కాఫీకుంపటి అంటించి నిద్రలేపింది.

కాఫికి తనకూ జన్మా                దేదో వుంది. జయలక్ష్మి వస్తూ తనతో మంచి కాఫిపొడుం తెచ్చుకుంది. ప్రశాంతమైన చలిగాలి శరీరాన్ని గిలిగింతలు పెడుతూంది. ఇంకా చలికాలం పోలేదు. వయసు ముదురుతున్న అందమైన శరీరంనుంచి జారలేక - వీడిపోతున్న యవ్వనంలాగ వుంది చలి. ఆచలిలో-ప్రాతఃకాలంలో మంచి కాఫికి అమృతాని కున్న పరిమళం వుంటుంది. చలి అనుభవిస్తూ చిక్కటి-కమ్మని కాఫీని రుచిచూడటం అల్పమైన అనుభవం గాదు. కాకపోతే మనం దాన్నిగురించి తీవ్రంగా ఆలోచించం. జీవితంలో ఎన్నోవిషయాలు ఇలాగే విస్మరిస్తాం!

జయలక్ష్మి మనసు ఎంతో తేలికగా వుంది. శరీరం లేడిపిల్లలాగ గంతులు వేయాలనే ఆరాటపడుతోంది. నిన్న జీవితాన్ని గురించి వచ్చిన చెడ్డ ఆలోచనలన్నీ ఇవాళ అర్థవిహీనంగా, అనవసరంగా కనుపించాయి. ఈ క్షణాన పట్టి చూస్తే ఏ ఒక్కటీ సమస్యగా నిలవటం లేదు. తన సమస్యలన్నీ ఊహాజనితాలేనా! భ్రమలేనా? పనిమనిషి నీళ్ళు తోడింది. స్నానం చేసి నల్లబోర్డరు గులాబీరంగు వాయిలు చీరకట్టి ఆకుపచ్చ జాకెట్టు తొడుక్కొని, తిలకం దిద్దుకుంటూ అద్దంలో చూసుకుంది. తన కళ్ళల్లో ఏదో మెరుపు కనిపించింది. మొఖంలో ఏదో ఆనందం! ఈ ఉదయాన భవిష్య

త్తును గురించిన క్రొత్త ఆలోచనలు, క్రొత్త వాతావరణం, క్రొత్త మనుష్యులూ ఎంతో ఉత్సాహాన్నిస్తున్నాయి. ఇన్నాళ్లూ తల్లి సంపాదించిన డబ్బుతో బ్రతికింది. ఇప్పుడు స్వతంత్రంగా జీవించే శక్తి తన కుంది. రాత్రి మనసు ఎంత దిగులుగా, బరువుగా వుందో, ఇప్పుడంత చురుకుగా వుంది.

ఆఫీసుకు తయారై వెళ్ళింది. రాష్ట్రం మొత్తంమీద ఆ కేంద్రాన్ని ప్రభుత్వం వారు ప్రత్యేకంగా ఎన్నుకుని అనేక వ్యవసాయక పరిశోధనలు సాగిస్తున్నారు. తన పై అధికారి బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు. పాతికేళ్లు వుంటాయి. నల్లగా, పొట్టిగా వుంటాడు. ఏదో పని చేసి అలిసిపోయిన వాడిలాగ నిరంతరం రుమాలుతో చెమట తుడుచుకుంటూ ఆయాసపడుతుంటాడు.

జయలక్ష్మి వెళ్ళి నమస్కారం చేసింది. అతను మర్యాదగా మాట్లాడాడు. డ్యూటీలో చేరడానికి లాంఛన ప్రాయంగా కర్మకాండ అంతా ముగిశాక తన సీటు చూపించాడు ఆఫీసరు. ఆ టేబుల్‌మీద 'సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్' అని ప్రముఖంగా ఒక అట్టమీద రాసి వుంచారు. ఆ రోజల్లా జయలక్ష్మికి పనిలేదు. అందరూ హడావుడిగా వున్నారు. తను మాత్రం గోళ్లు గిల్లుకుంటూ కిటికీలోనుంచి కాంపౌండులో తోటనూ, ఆవల షెడ్డునూ, ఒంగోలునుంచి తెప్పించిన ఆంబోతునూ, ఇంకా అవతల చిట్టడివినీ, కొండల్నీ చూస్తూ గడిపింది. రెండో రోజు ఒక ఎర్రటి గిరజాల జుట్టు యువకుడు వచ్చి రెండు దస్తాల తెల్లకాగితాలు టేబుల్ మీద పడేసి 'రూళ్లు కొట్టండి' అనేసి కొంచెం సిగ్గుపడుతూ

వెళ్ళిపోయాడు. 'సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్' అనే అక్షరాలతో మెరుస్తున్న అట్టకేసి ఒకక్షణం చూసి, వెడుతున్న ఆ ఎర్రటి గిరజాల జుట్టు యువకుడికేసి ఒక క్షణం చూసి వ్రాళ్లు వేయడం మొదలుపెట్టింది జయలక్ష్మి. ఆనాటి డ్యూటీ అంతటితో ముగిసింది.

ఆ తర్వాత వారం రోజులు ఇంచుమించు ఇలాగే జరిగిపోయాయి. కాకపోతే ఈ పదిరోజులూ ఊరును గురించీ, ఆఫీసును గురించీ చాలా విషయాలు తెలుసుకోవడానికి వీలు కలిగింది. ఊళ్ళో నూటికి డెభ్భైమంది రెడ్లు, పదిమంది హరిజనులు, మిగతావాళ్లు తక్కిన కులాలవాళ్లు. ప్రస్తుతం ఆ ఊరికి-ఊరికేమిటి, ఇంచుమించు ఆ ఫిర్కాకు - నాయకుడు బుల్లి రెడ్డి అనే వెంకట్రామరెడ్డి. వాళ్లు నలుగురు అన్నదమ్ములు. పంపకాలు కాగానే పెద్దాయన విజయవాడ చేరి, లాడ్జింగ్-కాఫీ హోటలు పెట్టి బాగా సంపాదించి అక్కడే స్థిరపడిపోయాడు. రెండో ఆయన తన వాటా కొచ్చిన నాలుగెకరాలూ అమ్మి, నైజాం ప్రాంతంలో కారు చౌకగా వందెకరాలుకొని కష్టపడి ఆ అడవిని పంటచేల క్రిందచేసి, ఈ నాటికి మోతుబరి అయాడు. మూడో ఆయన సినిమాల్లో చేరి జాతకం కలిసిరాగా గొప్ప దర్శకుడుగా పేరు తెచ్చుకుని మద్రాసులో స్థిరపడిపోయాడు. కాగా నాలుగో ఆయనకు దివాణంలాంటి ఇల్లూ, నాలుగెకరాల మాగాణీ మిగిలింది. ఆ నాలుగో ఆయనే బుల్లిరెడ్డి. ఇతగాడు అలనాటి ధర్మరాజులాగ కారణాంతరాలచే ఆస్తిఅంతా పోగొట్టుకుని, మరే వ్యాపారం నచ్చక, ఏ వృత్తి సయించక, వల్లమాలిన

దేశాభిమానం కొద్దీ రాజకీయాల్లోకి దిగి, క్రమంగా ఆ ఫిర్కాకు పెద్దయ్యాడు. ఏ ఆఫీసర్లు వచ్చినా, మహానాయకులు వచ్చినా సదరు బుల్లిరెడ్డిగారి దివాణంలోనే మకాం వేసేవారు. రెడ్డిగారు దొడ్లోని కొబ్బరిబొండాలు కొట్టించి, అమృతంలాంటి పానీయం అందిచ్చి, అతిథులను ఆనందింప జేసి అదే కాలంలో తన పలుకుబడికి కోటలు కట్టుకునేవారు.

ఆరడుగుల ఆజానుబాహుడు బుల్లిరెడ్డి. నల్లగా మెలికలు తిరిగిన కండరాలూ, వంకీలు తిరిగిన క్రాపింగూ, నెత్తుటి చారలతో నిప్పులు చిమ్మేకళ్ళూ, ఖాదీ పంచ, ఖాదీ లాల్చీ, అదే కండువా, రోల్డుగోల్డు ఫ్రేము గల కళ్ళజోడూ, నాలుగు వేళ్ళకూ రాళ్ళ ఉంగరాలు, నోట్లో గుంటూరు పుగాకు చుట్ట, గంభీరమైన కంఠస్వరం – సవాలక్ష విధాల నాయకునికి కావలసిన హంగు లున్నవాడు. ముప్పై ఏళ్లు దాటినా పెళ్ళి చేసుకోకుండా ఆ దివాణంలో ఇద్దరు నౌకర్లతో వుంటాడు.

ఈ వివరాలన్నీ పనిమనిషి సోదెమ్మ జయలక్ష్మికి పూసగుచ్చినట్టు చెప్పింది. తనకు ఇల్లు కుదిర్చి, పనిమనిషినీ, పాలదాన్నీ కుదిర్చింది బుల్లిరెడ్డే. నిన్నవచ్చి టూరింగు సినిమాకు ఫ్రీ పాసు ఇచ్చి వెళ్లాడు. ఆలోచించినకొద్దీ బుల్లిరెడ్డి తనకు దగ్గరగా రావడానికి ప్రయత్నిస్తున్నట్టనిపించింది జయలక్ష్మికి. ఆ ఊహ రావడంతోటే భయంతో శరీరం క్షణకాలం వణికింది. గుండె వేగంగా కొట్టుకుంది. మనసు చిత్తరపోయింది. బుల్లిరెడ్డి తరచు వచ్చి తన క్షేమసమాచారాలు విచారించిపోవడం జరుగుతూంది. నెల గడిచింది.

ఇంతవరకూ అతని మాటల్లోగాని, చేతల్లోగాని రవ్వంత కూడా బెసికినట్టు కనిపించలేదు. తన అనుమానానికి అర్థం లేదనుకొంది.

ఇంక ఆఫీసులో దినచర్య. ఒకరకంగా ఆఫీసరు చాలా మంచివాడు. మిగతవాళ్ళందరిలో! తమాషాగా కనిపించేవ్యక్తి ఒక డున్నాడు. అతనిపేరు శేషాద్రిట! ఇరవై దాటాయేమో! భావకవిలాగ వుంటాడు. అందానికి జుట్టు రేపుకుంటాడేమో! ఎప్పుడూ మొఖంమీదే వుంటుంది. ఆ రేగిన జుట్టులో ఒక క్రమం వుండ. ఆకాశంలోకి చూస్తాడు, కళ్ళు మత్తుగా తడితడిగా వుంటాయి. చొక్కాకు గుండీలు వుండవు. బూట్లకు మేజోళ్ళు వుండవు. లూజ్ గా వుంటాడు, గాలికి కొట్టుకుపోతున్నట్ట. ప్రపంచమంతా తన కేదో అన్యాయం చేస్తున్నట్టు, తను ఏ శుక్రగ్రహానికో, అంగారక గ్రహానికో పోతున్నట్టు కనిపిస్తాడు. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడడు. ఆఫీసరంటే అతని కెందుకో చిరాకు. అన్నీ మరిచిపోతాడు. చివాట్లు తింటాడు. అంతలో భావనాసముద్రంలో మునిగి పల్టీలు కొడతాడు.

జయలక్ష్మికి శేషాద్రిని చూడటం, అతని ధోరణి పరికించడం ఒక కాలక్షేపం క్రింద అయింది. అతని మొఖాన్ని చూస్తే అతిసాధువైన గంగిగోవు గుర్తుకు వస్తుంది. అప్పుడప్పుడు తనకేసి చూస్తుంటాడు. కాని ఆ చూపులో ఏమాత్రం భావప్రకటనా వుండదు. శేషాద్రిమీద తనకు కొంత సానుభూతి ఏర్పడింది. అతన్ని చూడగానే 'పాపం!' అనిపిస్తుంది అతను కో-ఆపరేటివ్ ఇనస్పెక్టర్.

అదేహోదాతో మరి నలుగురు ఉద్యోగులు వున్నారు. వాళ్ళలో ఇతను కలవడు. ఇతనితో వాళ్ళు కలవరు. ఆ నలుగురూ శరీరాలు వేరుగాని, ప్రాణం ఒకటే అన్నట్టు తిరిగేవారు. కాఫీ తాగటానికి నలుగురూ కలిసి వెళ్ళేవారు. ఒకడుగనక టిఫిన్ తెస్తే-మిగతా ముగ్గురికీ పంచేవాడు. వాళ్లు నలుగురూ విడివిడిగానూ, సమిష్టిగానూ శేషాద్రికేసి అదోలా నవ్వుతూ చూస్తుండేవారు. మధ్యాహ్నం కాఫీ పేరుతో కాంటీన్ పక్కనున్న చెట్టుకింద బెంచీలమీద కూలబడి, ఒక అరగంటసేపు అతిరసాత్మకచర్చలుచేస్తుండే వారు. ఆ చర్చలకు ఆయువుపట్టులాంటివాడు ముకుందరావు. ఆంధ్రసాహిత్యానికి ఆత్మబలిదానం చేసిన అమరవీరుల్లో తన్నుకూడా భవిష్యచ్చరిత్రకారులు చేర్చితీరతారని ఆయన ఆశిస్తాడు, ఆక్రోశిస్తాడు. అతనిమీద అతనికి విపరీత మైన సదభిప్రాయం వుంది. చెరువులో హత్య అనీ, చెరువు గట్టుమీద రెండు హత్యలనీ, చెరువుపక్కసందులో ఆరు గురు ప్రేమికుల ఆత్మహత్యలనీ మూడు మహాకావ్యాలు వ్రాసి, మహామహుల అభిప్రాయాలు సేకరించి, వాటిని ముగ్గురు మహానాయకులకు వరుసగా అంకితంచేసినట్టువార్తా పత్రికలలో సచిత్రవార్తలు వేయించి జీవితాన్ని చరితార్థం చేసుకున్న కారణజన్ముడు ముకుందరావు. ఈ ప్రపంచానికీ, చాకరకం మనుష్యులకూ తాను అతీతుడనని త్రికరణశుద్ధిగా జీవించేతాలూకు మనిషి. అతగాడికి లోకంలో తెలియని విషయం లేదు. జరగని అనుభవం లేదు. చెయ్యనిస్నేహం లేదు. ఏ రిక్షావాడో చెయ్యవలసిన చీకటితప్పు అతగాడు

చేస్తే పోలీసులు పట్టుకుని, తలప్రాణం తోకకొచ్చి చచ్చి నంత పనై బయటపడ్డప్పుడు–ఆ జీవితరహస్యం మిగతా ముగ్గురికీ తెలిసింది. అప్పుడు అతగాడు విన్నవించిన అభి ప్రాయం ఇవ్విధంగా ఉద్రేకపూరితంగా వుంది.

'నేను సత్యాన్వేషకుణ్ణి. సత్యం ఈ సంఘంలో బ్రతక లేక చీకటి సందుల్లోనూ, పతితల గుండెల్లోనూ, హీనుల హృదయాల్లోనూ మగ్గి చస్తోంది. అది చూసి అనుభవిం చాలి. ఆ సత్యాన్ని శోధించి జీవిత రహస్యాన్ని తెలుసు కోవాలి. ఈ ప్రక్రియ ఫలితంగానే వుడ్ బెక్, గ్రిజంగల్ విశ్వరచయిత లయ్యారు.' అంటూ కళ్లు తుడుచుకున్నాడు ముకుందరావు. అతను చెప్పింది అంతా నిజమని త్రికరణ శుద్ధిగా నమ్మి, తమ హృదయాలు కూడా ద్రవించినట్టు తక్కిన ముగ్గురూ ఎవరి పాత్రలు వాళ్లు అభినయించి ముక్కులు చీదుకున్నారు.

వాళ్లు నలుగురిలో భీముడులాంటి వాడు భీమారావు. అతగాడు కూడా యుగానికో, తరానికో పుట్టే మహా పురు షుల కోవలోకి చెందినవాడనని అభిప్రాయం. 'ఈ కాలం వాళ్లకు వెన్నముకలో సత్తా ఏముందండీ! ముప్పై ఏళ్ళకే ముసలాళ్లై సత్తు ఉడిగిపోతుంటే! దీనికి కారణం ఏమిటను కున్నారు? చద్దన్నాలు మానేయటం! కంపల్సరీ ఎడ్యుకేష నల్ లాగ మిలిటరీ ఫోర్సుతో భారతీయులందరిచేతా కాఫీలు మాన్పించి చద్దన్నాలు తినేటట్లు చేయించండి. మళ్లీ దేశంలో అందరూ ఛత్రపతి శివాజీల్లాగ ఆజానుబాహులు కాకపోతే చెవి తెగ్గోయించుకుంటాను!' అంటూ కాఫీ

త్రాగుతూ, సదరు శివాజీవాళ్లింటి పక్క నున్నట్టూ, తను రోజూ అతణ్ని చూస్తున్నట్టూ, భారతజాతి యావత్తుకీ సందేశం ఇస్తున్నట్టూ గాంఢ్రించేవాడు.

మూడోవాడు పెరియాళ్వారు. పేరలా వుందిగాని—క్రాపింగ్ షోగ్గా కత్తిరించుకుని, నాజూకు జాకెట్లు తొడుక్కునే విలాసపురుషుడే! అతను చేసేది చిన్న ఉద్యోగమే కాని—భయంకరాచార్యులనే మోక్షకాముడు ఒకడు పున్నామనరకానికి జడిసి, ఈ బుద్ధిమంతుణ్ని దత్తత చేసుకున్న ఫలితంగా ఒక లక్షరూపాయల ఆస్తి లభించింది. భయంకరాచార్యులుగారు 1947 లో స్వర్గానికి పోవడంతో, భారతదేశంతోపాటు పెరియాళ్వారుకు కూడా స్వాతంత్ర్యం కొట్టుకొచ్చింది. వెంటనే పిలక కత్తిరించి, చెవులకు వున్న దుద్దులు తీయించి, నామాలు చెరిపి, పంచలతో దిళ్ళ గలీబులు కుట్టించి, స్వర్గీయ భయంకరాచార్యులుగారు స్వర్గానికి చేరకముందు తన ఇంటిని స్వర్గధామం చేసుకున్న దేవేంద్రుడు పెరియాళ్వారు. ఆ తర్వాత భారత దేశానికి డొమినియన్ ప్రతిపత్తిపోయి, అది రిపబ్లిక్ కావడంతో సమరోత్సాహం లాంటిది కొట్టుకొచ్చి, రెండెకరా లమ్మిపారేసి కారు కొన్నాడు. ఆ కారుకు నాలుగు చక్రాలూ, బ్యాండ్ మేళం లాగ సందడిచేసే ఇంజనూ, ఓ స్టీరింగ్ పళ్లెం వున్నాయి. పాతిక మైళ్ల స్పీడులో వెడుతున్నా పదివేలమైళ్ళ వేగంతో వెడుతున్న రాకెట్‌లాగ సందడిచేసే ఆ చిన్న కారుమీద పెరియాళ్వారు గౌరవం, గొప్పదనం, ఆత్మాభిమానంవగైరాలన్నీ ఆధారపడి వున్నాయి. ఆ కారునే తన ఆత్మగా, హృద

యంగా, ప్రేయసిగా, దైవంగా, లోకంగా, సమస్తంగా భావిస్తూ, కడిగిస్తూ, పూజిస్తూ, తోయిస్తూ విశ్వశాంతికి పాటుపడా లనేది పెరియాళ్వారు జీవితధ్యేయం. ఈ కారు సందడికి తోడుగా పెరియాళ్వారుకు సంగీత సాహిత్యాలలో కొన్ని హక్కులు సంక్రమించాయి. అతని కన్నతండ్రి వెంగళాచార్యులుగారు గొప్పసంగీత విద్వాంసుడనీ, త్యాగరాయ కీర్తనలలో రక్తితక్కువని హరికథా క్షేత్రంలో ప్రవేశించి, ఆంధ్ర దేశానికీ సమస్త భూమండలానికీ తెనుగు హరికథను అందించిన మహాపురుషుడని ప్రఖ్యాతి చెందినవాడనీ చెబుతూవుంటాడు. పోగా పెంపుడు తండ్రి భయంకరాచార్యులు మహాపండితుడనీ, కాశీ పండితులు అప్పుడప్పుడొచ్చి ఆయనదగ్గర తమ అనుమానాలు తీర్చుకువెడుతుండే వారనీ, కాళిదాసు కావ్యాల్లో వున్న అనేక తప్పుల్ని ఈయన సవరించి, సంస్కరించాడనీ, ఏదో శతకం ప్రారంభించి ఆరు పద్యాలు వ్రాసి ఏడోది వ్రాస్తుండగా కవితావేశం పొంగి, గుండె ఆగి కన్ను మూశాడనీ పెరియాళ్వారు ఉవాచ. అతగాడితో అయిదు నిమిషాలు మాట్లాడేలోపు ఎవరికైనా ఈ భోగట్టా అందిస్తాడు. ముకుందరావు మూడు పుస్తకాలు వ్రాయడం చూసి ఒక నెల సెలవుబెట్టి, కత్తులు నూరి గంతులేసి ఎక్కాల పుస్తకంలాంటి స్వేచ్ఛా ఛందస్సు గల పద్య కావ్యం అయిదొందల కాపీలు అచ్చుకొట్టించుకొచ్చి, విశాలాకాశంలోకి విరజిమ్మి ముకుందరావుమీాద కసి తీర్చుకున్నాడు పెరియాళ్వారు. ఆ పుస్తకం వెనక పేజీలో ఆంధ్ర పాఠకుల ఉత్కంఠను సంతృప్తిపరచడానికి రంగు రంగుల

ఫోకసింగులతో ఫొటో తీయించి, అది వేసి, జననం, విద్యాభ్యాసం, వంశగౌరవం, అభిరుచులూ వర్ణించి మరీ అచ్చు వేయించాడు. పీఠికలో ఇలా వ్రాయబడింది:

'ఈ కవి కూన భావకవిత్వపు వెన్నెల; సాహిత్య సింహం. అటు కన్నతండ్రి నుంచి సంగీత రసాన్ని, ఇటు పెంపుడు తండ్రినుంచి సాహిత్య పరిమళాన్ని వారసత్వం పుచ్చుకున్న గట్టిదిట్ట! ఈయన ఎడమ ఊపిరితిత్తిలో సంగీతం, కుడి ఊపిరితిత్తిలో సాహిత్యం నిరంతరం ప్రవహిస్తుంటాయి. ఈ మహాకావ్య రచనతో ఈ కవివీరుడు కర్మవీరుడై ఛందస్సుల జెలుగోడల్ని బద్దలుకొట్టి డొక్క చించి డోలు కట్టాడు. ఇవన్నీ ఇతని స్వంత కారులో వెడుతున్నప్పుడు వర్చి కూర్చిన గీతాలే!' అనే వాక్యంతో ముగించి, పెరియాళ్వారుకు స్వంతకారు వుందనే సృష్టిసత్యాన్ని నిఖిల జగాలకూ వెల్లడించారు  ఠీకా రచయిత (సదరు పెరియాళ్వారు).

నాలుగోవాడు ఆనందమూర్తి. చూట్టానికి అతిసాధారణ వ్యక్తిలాగ కనిపిస్తాడు. కాని, లోపల అతని హృదయంలో ఎన్నో రకాల గనులున్నాయట! ఒక్కమాటలో చెప్పాలంటే - ఆనందరావు ఆదర్శాల పోగట! ఆశయాల గుట్టట!! అన్యాయాలూ, అక్రమాలూ అతను సహించలేడుట! అసత్యాలూ, అనవసరపు వాగుళ్లూ అతనికి సయించవుట. ఈ అసలు విషయాన్ని ఆనందమూర్తి రోజూ రెండుపూటలా బయటపెడుతూనే వుంటాడు. ఆనలుగురిలో మిగతా ముగ్గురూ ఈ సత్యాన్ని గాఢంగా నమ్ముతుంటారు.

అందరిలోకీ ఆనందమూర్తి మితభాషి; ముకుందరావు అతి భాషి. ఆనందమూర్తి అందంగా వుంటాడు. ఆ యథార్థం గ్రహించిన మేధావి! ముక్తసరిగా మాట్లాడుతూ వుంటాడు. ముసిముసిగా నవ్వుతాడు. లోకంలో బలహీనులైన మనుష్యులను చూసి జాలిపడుతుంటాడు. 'అన్యకాంత లెదురైన మాతృభావము చేత మరలువాడు' ఆ తాలూకు మనిషి. అతని మొఖం కొళ్ళన్ మార్కు! అనేక ప్రశ్నలు అడుగుతుంటాడు. వాళ్ళు చెప్పే సమాధానాలు శ్రద్ధగా వింటుంటాడు. పసిపిల్లవాడిలాగ, అభం శుభం తెలియని అమాయకునిలా తల పంకిస్తుంటాడు. అదొక రమణీయమైన ధోరణి. ఏకపత్నీవ్రతుల కోవలోకి చెందినవాడు ఆనందమూర్తి. అతను అనేక లక్షలసార్లు అనేక లక్షలమందిని అడిగిన ప్రశ్నలలో కొన్ని–

'మనుష్యులు ఎందుకు అబద్ధాలు చెబుతారు?'

(తాత్పర్యం:–నేను జీవితంలో ఎన్నడూ అసత్యం చెప్పను. అసత్యం ఎలా ఆడాలో నాకు తెలియదు.)

'వీళ్లు వున్నదున్నట్టు ఎందుకు మాట్లాడరు? ఈ పాలిటిక్స్ ఎందుకు?'

(తాత్పర్యం:–ఈ పాలిటిక్స్ నాకు తెలియవు. నేను వున్నదున్నట్లు మాట్లాడుతాను.)

'మన ఉద్యోగా లెంత? ఒకవేళ ఎంతైనా అనంత విశ్వంలో మనిషిస్థాన మెంత? ఎందుకీ ఆఫీసర్ల మెడ లింత స్టిఫ్‌గా వుంటాయి? మనం కట్టుకుపోయేదేముంది?'

(తా:-నేను అతీతమానవుణ్ణి. వేదాంతిని. అతివిశాల హృదయుణ్ణి.)

'అసలు కేరక్టర్ లేకుండా ఎందుకు బ్రతకాలి చెప్పండి? దొరగారి కోడలు-ఛా! మనుష్యు లింత నీచంగా ఎల్లా బ్రతుకుతారు? అసలు బ్రతకకపోతే ఏం? కాకిలాగ కలకాలం బ్రతికేకన్న హంసలాగ రోజు బ్రతికితే చాలదూ?'

(తా:-నేను హంసలాంటి మనిషిని. నీతిమీద నాకు చాలా నమ్మకం వుంది. పతివ్రతని (పుంలింగార్థంలో). ఈ సృష్టిలో నాకూ, భగవంతుడికీ తప్ప ఇంకెవరికీ కేరక్టర్ లేదు.)

'కొందరు ఆఫీసర్లు పై వాళ్ళకు దాసోహం అంటా రెందుకు? ప్రమోషనుకా? ఏం, ప్రమోషను రాకపోతే?'

(తా:-తక్కిన క్షుద్రమానవులలాగ నేను ప్రమోషనుకు ఆశపడే కీటకాన్ని గాదు. లోగడ సెలవిచ్చినట్టు నీతిగలవాణ్ణి. నిజాయితీ పురుషుణ్ణి. నేను పై ఆఫీసర్లకు దాసోహం చెయ్యను. ప్రమోషను వచ్చినా రాకపోయినా జీవితాన్ని ఒకేవిధంగా చూసే శక్తి నాకు గీత ఇచ్చింది- కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన.)

'ఈ ప్రపంచంలో నిజాయితీ గలవాళ్ళు బ్రతకడం కష్టం. ఇది దొంగలకీ, లోఫర్లకీ, గేంబ్లర్లకీ, రోగ్‌లకీ కాలం!'

(తా:-ఎన్ని లెక్కలుకట్టినా ఈ మూడువందల కోట్ల ప్రపంచజనాభాలో నేను ఒక్కణ్ణే నిజాయితీగలవాణ్ణి. నేను రోగ్‌ని కాదు.)

సారాంశం:-ఏసుక్రీస్తూ-గాంధీ, బుద్ధుడూ వగైరాలు

పడిన ఇబ్బందులన్నీ చూస్తే-నేను అస్త్రసన్యాసంచేసి, ఈ లోకాన్ని మరమ్మత్తు చెయ్యడం కష్టమని నిశ్చయించు కున్నాను.

ఇటువంటి విచిత్రవ్యక్తులు నలుగురూ ప్రాణస్నేహితులై, ఎవరి ఆధిక్యతనుగురించి వారు వంతులవారీగా ఒకరి తర్వాత మరొకరు చెప్పుకుంటూ, మధ్య మధ్య చౌకబారు సర్వప్రపంచానికి ప్రతినిధిగా నిల్చిన శేషాద్రిని చూసి, అతనికీ తమకూ మధ్యవున్న అగాధాన్ని, తమ ఔన్నత్యాన్ని, అతగాడి క్షుద్రత్వాన్ని తల్చుకుంటూ పోల్చుకుంటూ, అతన్ని హింసించడంలో ఆనందాన్ని వెతుక్కుంటూ సంబరపడేవాళ్ళు నలుగురూ ఐక్యరాజ్యసమితికి ప్రతినిధులు

# 15

ఒకనాడు శేషాద్రి జయలక్ష్మితో బాధగా అన్నాడు. 'నేనీ ఆఫీసులో వంటరితనం అనుభవిస్తున్నానండీ! ఏదో దిగులుగా వుంటోంది. మనసువిప్పి మాట్లాడుకునే స్నేహితుడు లేడు. ఎవరితోనో ఏదో చెప్పుకుని ఏడవాలనిపిస్తుంది.'

జయలక్ష్మికి జాలి అనిపించింది. భయంకరమైన వంటరితనంలో వున్న మాధుర్యం శేషాద్రికంటే తనకే బాగా తెలుసు. తనేదైతే సానుభూతి లోకంనుంచి అర్థిస్తున్నదో, అదే శేషాద్రికి అందించాలని దయతో అంది:

'శేషాద్రీ! నీతో నేను స్నేహంగా వుంటాను. నిజా

నికి నాకూ అలాంటిది అవసరమనిపిస్తూంది. నాకు మనుషుల మీాద నమ్మకం ఏనాడో పోయింది. కాని వాళ్ళమధ్యనే బ్రతకాల్సివస్తోంది. వాళ్ళతోనే నవ్వుతూ మాట్లాడాలి. స్నేహంగా వున్నట్టు నటించాలి. ఇదే మన జీవితం శేషాద్రి గారూ! వయస్సు పెరుగుతున్నకొద్దీ మనుష్యుల నరాల్లో రకం మాయమై విషం ప్రవహిస్తుందేమో అనిపిస్తోంది. మిమ్మల్ని ఓదార్చడానికి నేనెవర్ని? అయినా...'

ఇంతలో బ్లాక్ ఆఫీసరు వచ్చాడు. శేషాద్రీ, జయల కబుర్లు చెప్పుకోవడం సహించలేకపోయాడు. ఆఫీసుకు, శృంగారానికీ బొత్తిగా సంబంధం వుండరాదని గాఢంగా నమ్మే ప్రభుత్వభక్తుడు ఆయన.

ఒకనిమిషం అయాక, 'ఆఫీసరు పిలుస్తున్నాడండీ' అన్నాడు ప్యూన్. శేషాద్రి వెళ్ళాడు. ఆఫీసరు సింహంలా గర్జిస్తూ, 'ఈపుస్తకానికి రూళ్ళు ఎవరుకొట్టారు?' అన్నాడు.

'జయలక్ష్మండీ!' అన్నాడు శేషాద్రి.

'ఆఅమ్మాయిచేత రూళ్ళు వేయించే అధికారం నీకెవరిచ్చారు? ఆవిడ మంచిది గనుక నువ్వు చెప్పిన పని చేసింది. నాకు రిటన్‌గా సంజాయిషీ కావాలి.' అంటూ ఆ రూళ్ళపుస్తకం శేషాద్రిమొఖంమీాద కొట్టాడు. ఆఫీసరు గారి మాటలు అన్యాపదేశంగా జయలక్ష్మికి గురిపెట్టబడ్డాయి.

జయలక్ష్మి ఆమాటలన్నీ విన్నది. శేషాద్రికి ప్రపంచం పగిలిపోతే బాగుండుననిపించింది. ఉద్యోగం పోతుందని గాదు. ఆఫీసరు జయలక్ష్మిముందు తనను అవమానించి,

చిత్రవధ చేశాడు. ఆఫీసరును చంపాలనుకున్నాడు. ఉరి కంబం కనిపించింది. కాళ్లు విరగ్గొడితే బాగుండుననిపించింది. తను చేసిన అపరాధం జయలక్ష్మిచేత రూళ్ళ కొట్టించడం గాదని తనకు తెలుసు. అది ఆఫీసరుకూ,జయలక్ష్మికీ తెలుసు. అసూయను ద్వేషిస్తే మనిషి దేముడే అవుతాడు. మనుష్యులందరూ దేముళ్ళయితే తన ప్రత్యేకత పోతుందని ఆ భగవంతుడు ఇట్లా సృష్టించాడేమో !

తలవంచుకుని రూముకు వెళ్ళిపోయాడు శేషాద్రి. జయలక్ష్మికి మొఖం చూపించలేకపోయాడు. కళ్ళల్లోంచి జలజలా కారుతోంది కన్నీరు. వెళ్లి మంచంమీద వాలిపోయాడు. మధ్యాహ్నం ఒంటిగంట అయింది. ఆఫీసు అయిదింటిదాకా వుంది. వదిలిపెట్టివచ్చేశాడు. ఆఫీసరు ఏం చేస్తాడో? ఏడ్చాడు. వాడిని వదిలిపెట్టటం మహాపచారం. తనకు బ్రతుకుమీద ఎలాగూ మమకారం లేదు. వాణ్ణి చంపే సేగాని తనపగ తీరదు. ఆ వెధవప్రాణం తియ్యడంఎంత? అరిటిగెలమీద వున్న కత్తిచాలదూ! ఇల్లు తగలబెడితే? ఆయన సంపాదించిన పాపమంతా నిర్మూలమైపోతుంది.

ఆ ఆలోచనలతో నిద్రపోయాడు శేషాద్రి. కళ్ళల్లోంచి కారిననీరు దిండులోకి ఇంకిపోయింది. నిద్ర లేచేసరికి నాలుగుగంటలయింది. కళ్లు తెరిచాడు. ఎదురుగా ఒక స్త్రీమూర్తి కూర్చున్నట్టు మసకగా కనిపించింది. స్వప్నసౌందర్యమేమో అనుకున్నాడు. వెన్నెల విరిసినట్టు నవ్వింది జయలక్ష్మి. తత్తరపాటుతో ఒక్కదూకున పక్కమీదనుంచి లేచాడు.

శేషాద్రిని ఓదార్చడానికి వచ్చింది జయలక్ష్మి. కొంత వేదాంతం చెప్పింది. కొందరు మనుష్యుల తీరు అంతే నన్నది.

'వాళ్ళనుచూసి జాలిపడటంకంటే మన మేం చెయ్య లేము శేషాద్రీ! ఎదుటివ్యక్తుల్ని హింసించడంలోనే వాళ్లకు ఆనందం కనిపిస్తుంది. అదొక జబ్బు! అది రోగి ఎన్నాళ్లు బ్రతికితే అన్నాళ్ళూ పీడిస్తుంది. ఎన్నిరోగాలకు మందులు కనిపెట్టినా ఈరోగానికిమటుకు ఏమందూ ఎవరూ కనిపెట్ట లేదు.' అంది.

జయలక్ష్మిమాటల్లో ఏదో తియ్యనిసంగీతం వినిపిం చింది శేషాద్రికి. ఇటువంటి వ్యక్తి తనకు తోడుగా వుంటే చాలు! ఎటువంటి జీవితాన్నయినా భరించవచ్చు అనుకున్నాడు.

'జయలక్ష్మి! నాకు కావలసినవాళ్లు చాలామందే వున్నారు. కాని, ఎందుకనో వాళ్లు నీకంటే ఆత్మీయులనిపిం చడం లేదు. నీలాంటి అక్కయ్య నాకుంటే బాగుండునని పిస్తోంది.'

'ఎందుకలా అనుకోవాలి శేషాద్రీ! నన్ను అక్కగా చూసుకోగల నిండు హృదయం నీ కున్నప్పుడు నేను నీ సోదరి నెందుకు కాకూడదు?'

ఒక్కక్షణంలో ఆ పవిత్రబంధం వాళ్ళిద్దరినీ బంధిం చింది. ఒకోసారి హఠాత్తుగా ఇటువంటి సంఘటనలే జరుగు తుంటాయి. అయినవాళ్లు దూరంగా తొలిగిపోయి, ఎవరో ముక్కూ మొఖం తెలియని వ్యక్తి ఆత్మీయుడుగా, ఎవరూ

విడదీయని ఆత్మీయుడుగా లభిస్తాడు. అట్లా ఒకరి కొకరు లభించినప్పుడు ఇద్దరి జీవిత గమనాలూ మారడానికి అవకాశం వుంది. కాని, లోకంపోకడ వేరు. వయస్సులో వున్న స్త్రీపురుషులు వివాహం చేసుకోకుండా సోదరభావంతో వున్నా అది హర్షించదు. దానికి అనేక విపరీతార్థాలు కల్పిస్తారు; అనేక కట్టుకథలు ప్రచారంలోకి తెస్తారు. వీళ్లు ఆత్మీయులు అవనీ, పరాయివాళ్లు అవనీ! 'అదిగో పులి అంటే, ఇదిగో తోక' అంటారు. ప్రపంచం తీరే అంత!

జయలక్ష్మి, శేషాద్రీ రాను రాను చాలా దగ్గర కొచ్చారు. ఈ అనుబంధం అమ్మను వదిలివచ్చిన జయలక్ష్మికి చాలా హాయినిచ్చింది. ఆఫీసుకు రాగానే శేషాద్రి కోసం వెతికేవి జయలక్ష్మికళ్ళు. శేషాద్రి కూడా కృతజ్ఞతతో ఆమెకేసి చూసేవాడు.

ఒకనాడు రాత్రి భోజనాలయాక బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసరు డాబామీద ముకుందరావు, భీమారావు, ఆనందమూర్తి, పెరియాళ్వారూ నలుగురూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ రోజే తల్లికి జబ్బుగా వుందని శేషాద్రికి కబురు వచ్చింది. తల్లికి వైద్యం చేయించాలి. వెళ్ళడానికీ ఛార్జీలకే పది రూపాయలు కావాలి. పెట్టెలో చిల్లరంతా పోగుచేస్తే నాలుగు రూపాయలా ఎనభై అయిదు పైసలు వున్నాయి. లాభం లేదు. ఎవర్నయినా అప్పు అడగాలని బయల్దేరాడు శేషాద్రి. ఊరంతా తిరిగాడు. ఎందరో పరిచయస్థులు కనిపించారు. ఎవర్నీ అడగలేక పోయాడు. పరిచయంగల వ్య ఎదురైనపుడు అతని మంచి చెడ్డల

గురించీ, స్థితిగతుల గురించీ, అతనికి తనమీద గల అభి ప్రాయం గురించీ మనసులో క్షణకాలం తర్జన భర్జనలు సాగించేవాడు.

ఆ ఆలోచనలు అలా వుండగానే అవతల పెద్దమనిషి దాటిపోయేవాడు. తిరిగి తిరిగి ఇంటికొచ్చాడు. బ్లాక్ లైబ్రరీనుంచి తెచ్చిన పుస్తకం ఒకటి తిరగేస్తుంటే, ఒక పేజీలో 'స్నేహితుల్ని అప్పు అడగటంకంటే పరిచయస్థుల్ని అడగటంమంచిది' అని వ్రాసివుంది. నవ్వొచ్చింది. అంతలో తల్లి గుర్తుకొచ్చింది. ఉలిక్కిపడి లేచాడు. రాత్రి తొమ్మిది దాటింది. బ్లాక్ ఆఫీసుకు వెళ్లాడు. డాబామీద తక్కిన నలుగురూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళుచాలా పెద్దగా మాట్లాడుకుంటున్నారు. మధ్య మధ్య ముకుందరావు నిష్కారణంగా ఎగురుతూ చప్పట్లు చరుస్తూ నవ్వుతున్నాడు. ఆ సంభాషణలో శేషాద్రి పేరు తరచూ రావడం వినిపించింది. శేషాద్రి మెట్లమలుపు దగ్గర ఆగిపోయాడు. తను బ్రతికుండగా తన గురించి వాళ్లు మంచిగా మాట్లాడుకోరు. వాళ్ల మాటలు అనేకసార్లు తనని బాధిస్తున్నాయి. అట్లా దొంగ చాటుగా వింటే వాళ్ళు చులకన చేస్తారని తెలుసు. కాని అక్కణ్ణుంచి కదలలేక పోయాడు. ఆ మాటలు శూలాల్లాగ గుండెల్ని చీల్చుకుంటూ హృదయాంతరాళాల్ని తాకుతున్నాయి.

'వాడి మొఖం! అది వాడికి లొంగుతుందనుకున్నావా! ఇటువంటి చవటలను అది ఎంతమందిని చూసిందో!' సవాల్ చేస్తున్నట్టు మాట్లాడాడు ముకుందరావు.

'మరి చూట్టానికి హరిశ్చంద్రుడి భార్యలాగ వుంటుం దేమిటోయ్!' ఏమీ ఎరగనట్లు అమాయకంగా అడిగాడు మూర్తి.

'అలాంటి వాళ్ళను అసలు నమ్మగూడదు బ్రదర్! నా ఒపీనియన్ ఏమిటంటే, అది ఆ శేషాద్రిగాడిని వెర్రి వెధవను చేసి ఆడిస్తోంది!' ఈ కంఠం భీమారావుది.

'ఆ వెర్రిపీనుగువల్ల దీని కేం లాభ మంటావ్?' ఆనంద మూర్తి ప్రశ్న.

ముకుందరావు తెలివి తేటలు ఒలకపోస్తూ అన్నాడు: 'అదే తమాషా మూర్తీ! ఒకరకం ఆడవాళ్లు వుంటారు. వాళ్లు ఒక పట్లాన ఎవరికీ లొంగరు. దురదృష్టవశాత్తూ భగవంతు డిచ్చిన అవయవసౌష్ఠవం, అందచందాలూ వుంటాయి. ఒక చిరునవ్వు పారేస్తారు. ఒక క్రీగంటిచూపు విసురుతారు. పొరపాటున చెయ్యి తగిల్చి, 'సారీ!' అంటారు. ఎదుటివాడిని క్రిందినుంచి పైదాకా శల్యపరీక్ష చేస్తూ, 'నువ్వెంత అందగాడివోయ్!' అన్నట్టు చూస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే, మొగవాణ్ణి పెంపుడు కుక్క క్రింద చూస్తారు. పిల్లి కూనలాగ చూస్తారు. ఈ వెర్రి నాగమ్మ దాని వెనకాలే తోకాడిస్తూ, ప్రదక్షిణాలు చేస్తూ తిరిగి తిరిగి విసుగేసి, ఒకనాడు బావురుమంటాడు!'

'జయలక్ష్మి సినిమాల్లో చేరుతుందటగా?' ఆనంద మూర్తి ప్రశ్న.

'ఔనౌను! బుల్లిరెడ్డి ఈ ఎర చూపి తరలించాలని ప్రయత్నిస్తున్నాడు.'

'దాని మొహం! ఏదో ఒడ్డూ పొడుగూ లావూ వుందిగాని, కెమేరాలో హిడింబిలా వుంటుంది' వ్యాఖ్యానించాడు భీమారావు.

'అలా అనబోకు. ఆ కళ్ళల్లో గ్రేస్ వుంది. ఆమె కళ్ళల్లో యౌవనపు ఫెర్వర్ పొంగుతుందోయ్! మా యింటి పక్కన ఒక అమ్మాయి వుండేది. గౌన్లు తొడుక్కుంటున్నప్పటినుంచి ఆ పిల్లను నేను ఎరుగుదును. రఫీసాహెబ్ ఆ అమ్మాయిని చూసి అమాంతం మూర్ఛపోయి బొంబాయి తీసుకెళ్ళి హీరోయిన్‌గా బుక్ చేశాడు. ఆమె ఏమంత బాగుంటుందని? సుల్తానానోయ్. ఆమె లక్షలూ కోట్లూ ఎట్లా గడిస్తుందంటావ్? ఆ యౌవనపు ఫెర్వర్! అదీ కారణం' అన్నాడు పెరియాళ్వార్.

'అబ్బాయ్! ఒకటి చెపుతున్నాను విను. అది అంత త్వరగా బుల్లిరెడ్డి వలలో పడుతుందని నేను నమ్మను. అది అసలు అలాంటిది కాదనిపిస్తోంది. దానిమీద ఎందుకనో నాకు గౌరవం కలుగుతోంది' అన్నాడు ఆనందమూర్తి. అది అతని మనస్సులో ఉద్దేశ్యంగాదు. మిగతా ముగ్గురినీ రెచ్చగొట్టాలి. ఇంకా స్తవాగించాలి. ఆనందమూర్తి మాటలు మిగతా ముగ్గురికీ టానిక్‌లాగ పనిచేశాయి. ఎవరికి తోచినట్టు వాళ్ళు మాట్లాడారు. వ్రాయడానికి కూడా వీల్లేని ధోరణి సాగింది. చివరకు తలొక పది రూపాయలు చందా వేసుకుని, ఒకళ్ళను హైదరాబాద్ పంపించి జయలక్ష్మి నటిస్తున్న పాతివ్రత్యంలో ఎంతటి సత్తా వుందో తెలుసుకోవాలని తీర్మానించారు. కంకణం కట్టుకున్నారు. 'ఎవరీకార్యం

సాధించేది?' అన్న ప్రశ్న బయలుదేరింది. 'నేను వెళ్తాను' అంటూ ఆనందమూర్తి ముందుకొచ్చాడు. తన నిర్ణయానికి కారణం ఇలా వివరించాడు:

'జయలక్ష్మి మంచిదని నేనంటున్నాను. కాదని మీరంటున్నారు. సరే! నేను స్వయంగా హైద్రాబాదు వెళ్ళి, ఆమెను గురించి పూర్తి వాకబు చేస్తాను. జీవిత రహస్యాలు అన్వేషిస్తాను. తిరిగొస్తాను. ఎందుకు? ఆమెను అల్లరి చెయ్యడానికి గాదు. ఈ అల్లరినుంచి కాపాడటానికి.'

వాళ్లు నలుగురూ లేచారు. మెట్ల మలుపులో రాతి విగ్రహంలాగ నుంచున్న శేషాద్రిని చూసి కొంచెం తెల్లబోయారు. కొంచెం తేరుకుని 'ఎంత సేపటినుంచి ఇక్కడున్నావోయ్!' అన్నాడు ఆనందమూర్తి. నెపోలియన్ ఫ్రాన్స్ సింహాసనాన్ని స్వీకరించినట్టు ఎదురు తిరగలేని వాళ్ళందరినీ 'ఏమోయ్!' అనే అధికారాన్ని స్వీకరిస్తుంటాడు ఆనందమూర్తి.

'మీ మాటలు నేను వినలేదు లెండి' అన్నాడు మాట విరిస్తూనే శేషాద్రి.

'విన్నా ఫర్వాలేదు శేషాద్రీ! మన జీతాల హెచ్చింపు గురించి రాష్ట్రప్రభుత్వంతో సంప్రదించడానికి మన ప్రతినిధిని హైదరాబాదు పంపాలని నిశ్చయించుకున్నాం. అందుకు తలొక పదిరూపాయలు చందా వేసుకుంటున్నాం. నీ పదిరూపాయలు కూడా రేపు ఇయ్యి' అన్నాడు ఆనందమూర్తి.

## 15. పవిత్రబంధం-ప్రవాదులు

శేషాద్రికి శరీరం ఉడికిపోతూంది. కాని, ఏం చెయ్యాలో అతనికి తోచ లేదు. 'వీళ్లు మనుష్యులా! కుక్కల కన్నా హీనులు' అనుకున్నాడు. 'నా దగ్గర ఇప్పుడు డబ్బు లేదు. రేపు వుంటే ఇస్తాను.' అని చకచకా వచ్చేశాడు.

అతనికి జీవితంమీాద అసహ్యం వేసింది. పవిత్రంగా చూసుకునే తమ సంబంధంమీాదా, జయలక్ష్మిమీాదా ఎన్ని అపవాదులు వేశారు!

శేషాద్రిమనసంతా వికలమైపోయింది. ఇంక ఎవరినీ డబ్బు అడగలేకపోయాడు. రూముకొచ్చి మంచంమీాద బోర్లగిలా పడుకున్నాడు.

మర్నాడు ఆఫీసులో జయలక్ష్మినడిగి యాభైరూపా యలు తీసుకున్నాడు శేషాద్రి. జయలక్ష్మివదనం నిర్మలంగా వుంది. 'ఈమెనా వాళ్లు అంత నీచంగా ఊహించింది!' శేషాద్రికి ఆ నలుగురిమీాదా విపరీతమైన అసహ్యం కలిగింది. వాళ్ళన్నమాటలు జయలక్ష్మితో చెప్పబుద్ధికాలేదు. ఆరోజే తల్లిని చూడటానికి రామచంద్రపురం వెళ్ళాడు. అతను మళ్లీ వచ్చేసరికి వారం దాటింది. ఆ వారంరోజుల్లో చింతల పూడి వాతావరణంలో చాలామార్పు వచ్చింది. ఆనంద మూర్తి హైదరాబాదువెళ్లి జయలక్ష్మిగురించి కావల్సిన రసాత్మకమైన కథలు మోసుకొచ్చాడు.

# 16

బ్లాక్ ఆఫీసులో జయలక్ష్మిని గురించిన చర్చలు ఉధృతంగా చెలరేగుతున్నాయి. జయలక్ష్మికి ఆ వాతావరణంలో ఏదో మార్పు కనిపించింది. తననుచూసి అందరూ ఏదో మాట్లాడుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. వాళ్ళ చూపులు తనను సూదులు గుచ్చినట్టు గుచ్చుతున్నాయి. పరిస్థితి ఏమిటో ఎంతకీ అర్థంకావడం లేదు.

రామచంద్రపురంనుంచి శేషాద్రి తిరిగివచ్చాడు. తల్లికి కొంచెం నయంగానే వుంది. రాగానే జయలక్ష్మిని కలుసుకుని, ముకుందరావు ప్రభృతులు అనుకున్న మాటలన్నీ చెప్పాడు. ఆనందమూర్తి హైదరాబాదు ప్రయాణంలోని ఉద్దేశ్యం జయలక్ష్మికి తెలిసింది. తనవెనక సాగుతున్న ఇకిలింపులకూ, గుసగుసలకూ కారణం ఇప్పుడు అర్థమైంది. ముకుందరావు మీదమీద అసహ్యం కలిగింది. మనుష్యులింత సంకుచితంగా ఎందుకుంటారో అర్థంకాలేదు. తను వాళ్ళకేం అపకారం చేసింది? తనసంగతి వాళ్ళకెందుకు? వాళ్ళు తనమీద కసితీర్చుకోవడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నారు? జయలక్ష్మిమనసు విపరీతంగా గాయపడింది. ఏసమస్యలకు పరిష్కారమార్గం దొరకక తను భయపడి పారిపోయివచ్చిందో, అవి తను ఈ మారుమూల వున్నా వెంటాడుతున్నాయి. ఈ విషఫలితాలను జీవితాంతకాలం తను అనుభవించాల్సిందే!

ఆరోజు ఆఫీసుకాగితం పుచ్చుకొచ్చి, 'చూడమ్మా! ఇది జిల్లా పరిషత్తుకు పంపాలి. దీన్ని నువ్వు వ్రాయి. తప్పు లుంటే నేను దిద్దిపెడతాను,' అన్నారు ఆనందమూర్తి. జయలక్ష్మి కృతజ్ఞతతో నవ్వుతుందనుకున్నాడు. కాని, ఆవిడ మొఖం దానికి పూర్తిగా విరుద్ధంగావుంది.

'ఏంటమ్మా! నేను చెప్పేది అర్థమయిందా! నేను నీ అన్నలాంటివాణ్ణి. నీకేదన్నా సహాయం కావల్సివస్తే నన్ను సిగ్గుపడకుండా అడగాలి.' అని కన్నబిడ్డను తండ్రి సంబోధించినంత లాలనగా అన్నాడు. తన మాటలకు జయలక్ష్మి నోట మాటరానంత తీవ్రంగా ద్రవించుతుందనుకున్నాడు. జయలక్ష్మిహృదయం భగ్గున మండింది. ఇతన్ని ఏం చెయ్యాలి? కసిదీరా తిట్టాలా? పీక పిసికేయ్యాలా? అంతపని చేస్తేగాని తనభాధ తీరదు. కాని, అది తన మనుగడకే మోసం. ఊరుగాని ఊళ్ళో వంటరిగా వున్న తను ఎంత నిస్సహాయురాలో ఇప్పుడర్థమయింది జయలక్ష్మికి. ఆ యమ చెర తప్పించుకు వచ్చినా, ఈ నరకం తప్పేట్టులేదు. తిరిగి తను అక్కడికి అడుగుబెట్టని పక్షంలో తను ఎన్ని అవమానాలైనా భరించాలి. గదిలోకివచ్చి తలుపులు బిడాయించుకు పడుకుంది.

ఆరోజునాయంత్రం ఆనందమూర్తి పనిగట్టుకుని జయలక్ష్మి ఇంటికి వెళ్లి తలుపుతట్టాడు. జయలక్ష్మి తలుపుదీసి అతన్నిచూసి ఆశ్చర్యపోయింది.

'ఏమ్మా! ఏంచేస్తున్నావ్? వంటయిందా?' అంటూ ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండానే స్టూలుమీద

కూర్చున్నాడు. జయలక్ష్మి నిర్ఘాంతపోయింది.

'ఏమి టిలా వచ్చారు?' అంది తేప్పరిల్లి.

'ఏమీ లేదమ్మా! ఎలా వున్నావో చూసి పోదామని వచ్చాను' అంటూ ఆనందమూర్తి అతి హుందాగా ప్రపంచం గురించీ, స్త్రీ జీవితం గురించీ, ముఖ్యంగా వయసొచ్చి వంటరిగా ఉద్యోగాలు చేసే కన్యల సమస్యల గురించీ అరగంట మాట్లాడాడు.

అంతా విని 'ఇంతకీ నన్నేం చెయ్యమంటారు మీరు?' అంది జయ.

'అబ్బే! ఏంలేదు. లోకంతీరు ఆలోచించి ప్రవర్తించాలమ్మా! ఏపుగా ఎదిగి, ఎర్రగా వయసులో వున్న ఆడపిల్ల ఒక్కర్తీ, 'నా' అన్నవాళ్ళు లేకుండా దుష్టుల మధ్య వుండటం క్షేమంగాదు.'

'ఎవరండీ ఆదుష్టులు?' కొంచెం గట్టిగానే అడిగింది.

అతను గొంతు కొంచెం తగ్గించి, ఏదో రహస్యం చెబుతున్నట్టు, 'ఆ బుల్లి రెడ్డి వున్నాడు చూశావూ! చాలా ప్రమాదకరమైన మనిషి. వాణ్ణి దగ్గరకు రానీకు' అన్నాడు.

జయలక్ష్మికి వెర్రి ఆవేశం వచ్చింది.

'ఆనందమూర్తిగారూ! లోకంలో మీరే తెలివిగలవాళ్ళ మనుకుంటున్నారా? మీ సలహాలూ, సహాయాలూ కావాలని నేను కలవరిస్తున్నా ననుకుంటున్నారా? మీరు హైదరాబాదు పనిగట్టుకు వెళ్ళి నా గురించి లక్షకథలు మోసుకొచ్చి, ఈ ఊరంతా ప్రచారం చేసిన సంగతి నాకు తెలియ దనుకున్నారా? అంత తియ్యగా ఎట్లా మాట్లాడు

తున్నారండీ? కడుపునిండా కావలసినంత విషం పెట్టుకుని ఆప్యాయత ఒలకబోస్తూమాట్లాడటం చాలా గొప్పవిషయం! నా అన్నలాంటి వాడినన్నారే! మీ చెల్లెల్ని మీ రిలాగే అల్లరి చేస్తారా? మీకంటే నోరులేని పశువులు నయంగాదు టండీ! సిగ్గులేక నా ఇంటికి వచ్చి నాకు హితోపదేశాలు చేస్తున్నారా? ఇకచాలుగాని నామీద దయవుంచి వెళ్ళండి. పొరపాటునైనా మా ఇంటికి మరొకసారి రావడానికి ప్రయత్నించకండి!' అంది కంపిస్తున్న గొంతుతో.

ఆనందమూర్తి వెన్నులో బాకుపెట్టి పొడిచినట్లయింది. జయలక్ష్మి ఇలా ఎదురు తిరుగుతుందని కలలో కూడా ఊహించలేదు. క్షణంలో అతని మొఖం పగబట్టిన కోడెత్రాచులాగ అయింది. జయలక్ష్మి కేసి కసిగా చూస్తూ, 'నీ మేలుగోరి హెచ్చరిక చేస్తే నన్నే అవమానిస్తావ్ గదూ! నీ పాతివ్రత్య మెంతో నాకు తెలుసులే! సరే! చూచుకో నా తడాఖా' అంటూ చరచరా వెళ్ళిపోయాడు.

ఆనందమూర్తి వెళ్ళగానే జయలక్ష్మి శేషాద్రి గదికి వెళ్ళింది. ఈ దుఃఖంలో పాలు పంచుకోవడానికి మరొక వ్య కావా లనిపించింది. జరిగిందంతా శేషాద్రితో చెప్పింది. శేషాద్రి సానుభూతితో విన్నాడు. పొద్దుపోయే దాకా అలాగే కూర్చుని ఇద్దరూ మనసులోవున్న కాలుష్యాన్నంతా కడిగివేసుకున్నారు. వాకిట్లో గుమ్మంలో ఏవో నీడలు కదిలాయి.

'ఎవరో వాకిట్లో వున్నట్టున్నారు శేషాద్రీ!' అంది జయలక్ష్మి.

శేషాద్రి లేచి గుమ్మం దగ్గరకు వెళ్లాడు. గబాగబా వెళ్ళిపోతున్న ఆనందమూర్తి, ముకుందరావూ కనిపించారు. కాసేపుండి జయలక్ష్మి ఇంటికి చేరింది.

ఆ మర్నాడు మరికొన్ని సంగతులు చింతలపూడి యావత్తూ అడివిమంటల్లాగ వ్యాపించాయి. జయలక్ష్మిచేత దెబ్బతిన్న ఆనందమూర్తి బెబ్బులిలాగ విజృంభించాడు. దానికి తక్కిన ముగ్గురూ సాయం చేశారు. ఆ సాయంత్రం జయలక్ష్మి ఆఫీసునుంచి ఇంటికొచ్చేసరికి, ఇంటి యజమాని వెంకుంపంతులుగారు తన కోసమే ఎదురు చూస్తున్నట్టు ఇంటి అరుగుమీద కూర్చుని వున్నాడు.

'జయలక్ష్మిగారూ! మీరు వెంటనే మా ఇల్లు ఖాళీ చెయ్యాలి' అన్నాడు. జయలక్ష్మి ఒక్కసారి నిశ్చేష్టురాలైంది.

'ఎందు కనండీ?' అంది.

'మరొక ఇల్లు చూసుకోమ్మా! ఏదో సంసారు లుండ వలసిన కొంపలుగాని అందరూ వుండేవిగావు' అన్నాడు నిరోస్తహమాటంగా.

జయల మొఖం వెలవెలబోయింది. వెంటనే పౌరుషం, ప్రపంచం అంతా తనమీద పగబడుతున్నందుకు దుఃఖం వచ్చాయి. అన్నింటినీ తమాయించుకుని, అభిమానం పీకపిసికి, ఆయనతో ఏమీ వాదించకుండా 'రేపు ఖాళీచేస్తానని ఆయన్ని పంపించింది. ఆయన గేటు దాటుతుంటే శేషాద్రి ఎదురయాడు. ఏదో నాగుపాముని చూసి

బెదిరిపోయినట్టు, శేషాద్రిని చూసి దూరదూరంగా తొలిగి పోయాడు వెంకటంపంతులు.

శ్రీదిని ఆహ్వానించింది జయలక్ష్మి. ఆ మెహృదయం అంతా దుఃఖంతో నిండిపోయింది.

'ముకుందరావూ, ఆనందమూర్తి పనిగట్టుకు నన్ను అల్లరిచేస్తున్నారు శేషాద్రీ! ఇంటాయన ఇల్లు ఖాళీచెయ్య మన్నాడు. ఇంక వుండటానికి నాకు ఈవూళ్ళో ఇల్లెవరిస్తారు?' అంది బాధగా.

'మనుష్యు లింత దానవులుగా ఎందుకు మారతారో అర్థంకావడం లేదు జయలక్ష్మి! నేను నీకు చెయ్యగల సహాయం ఏముంది? నీకభ్యంతరం లేకపోతే నాగదిలో వుందుగాని' అన్నాడు శేషాద్రి.

'ఇప్పటికే మనని కాకుల్ని పొడిచినట్లు పొడుస్తు న్నారు. ఇంక ఇద్దరం ఒక ఇంట్లోవుంటే బ్రతకనిస్తారా? నీ వెర్రిగాని...'

'ఏం వుంటే? మనం తప్పు చెయ్యనప్పుడు లోకానికి ఎందుకుభయపడాలి జయలక్ష్మీ?' అన్నాడు శేషాద్రి కొంచెం ఆవేశంగా.

'తప్పునేర్పుగా చెయ్యగలిగితే భయపడవలసిందేమీ లేదు. మన మనసులు నిర్మలంగా వుండవచ్చు. అయినా లోకం హర్షించదు. మనం భయపడవలసిం దెప్పుడూ లోకానికే. అదీగాక...'

'చెప్పు!'

'మనిద్దరం అవివాహితులం. అందులోనూ వయసులో

వున్నవాళ్లం. ఎంత నిర్మలంగా కలిసివున్నా, మనని ఎవరూ నమ్మరు.'

'నమ్మకపోతే ఉరిపెట్టుకు చావమను. మనం ప్రపంచానికి భయపడిన కొద్దీ అది మన్నింకా భయపెడుతూనే వుంటుంది. అటువంటప్పుడు మొండిగా ఎదురుతిరిగితే తప్ప బ్రతకలేము.' జయలక్ష్మి విషాదంగా నవ్వింది.

'అదిగాదు శేషాద్రీ! నేనుచేసిన అపరాధం ఏమిటో నాకు అర్థంగావటం లేదు. ప్రపంచమంతా నామీద కక్ష కట్టినట్టు అనిపిస్తోంది. హైదరాబాదులో వుండలేక దూరంగా ప్రశాంతిగా బ్రతుకుదామని ఇక్కడ ఉద్యోగంలో చేరాను. కాని, ఇక్కడగూడా నన్ను మనుష్యులు బ్రతకనివ్వడం లేదు. ఈ మనుష్యులందరికీ భయపడాల్సివస్తోంది. నాకంటే దురదృష్టవంతురాలు ఎవరైనా వుంటుందా శేషాద్రీ?' జయలక్ష్మి జాలిగా అడిగింది.

'జయలక్ష్మి! ప్రపంచంలో కష్టాలు అనుభవించేది నువ్వొక్కదానివేనని నీ అభిప్రాయం. నువ్వేదో అతీత వ్యక్తివనీ, నీగురించి అందరూ అపవాదులు వేస్తూ ప్రచారాలు చేస్తున్నారనీ నీ బాధ. కాని, ఒక్కసంగతి అర్థం అవుతోంది జయా! ఈ ప్రపంచానికి కొన్ని లక్షణాలు వున్నాయి. మనిషి సలక్షణంగా వుంటే అసూయపడుతుంది. ఆ మనిషిని ద్వేషిస్తుంది. తనద్వేషం న్యాయమనీ, ధర్మ సమ్మతమనీ అనుకొని తృప్తిపడటానికి ఆ మనిషిలో లోట్లు వెతికి వెతికి వెలుపలికి తీస్తుంది. గోరంతలు కొండంతలు చేస్తుంది. విశ్వమంతా ప్రచారం చేస్తుంది. ఆ మనిషిమీద

బురద చిమ్ముతుంది. మురికిపూస్తుంది. వికృతంగా మారు స్తుంది. అప్పటికిగాని ప్రపంచానికి శాంతిలేదు. ఇది నీ విషయంలోనేగాదు, అందరివిషయంలోనూ అంతే. ఎవళ్ళో మననిగురించి అనుకుంటున్నారని బాధపడటంకంటే వెర్రి తనం లేదు. తెల్లవారింది మొదలు మనం లక్షలమందిని గురించి లక్షల మాటలు అనుకుంటూవుంటాము. అంత మాత్రాన బాధపడితే ఎట్లా? అందరిచేతా మంచి అనిపించు కోవాలని తాపత్రయపడినకొద్దీ ఫలితం దూరంపోతుంది.'

'అయితే నన్నేం చెయ్యమంటావు శేషాద్రీ!'

'ఏమీ చెయ్యమనటం లేదు. నువ్వు ఇప్పుడు ఎదు ర్కొంటున్న సమస్య బయటికొచ్చిన ప్రతిస్త్రీ ఎదుర్కో వలసిందే. అందమైన ఆడపిల్ల బజారుస్త్రీకంటే నీచమైంది అనుకుంటంలో ముకుందరావుకు ఆనందంవుంది. శ్రీమంతు డైన వ్యక్తి పరమలోభిలాగ గడ్డితిని బ్రతుకుతున్నాడను కోవడంలో పెరియాళ్వారుకు ఆనందం వుంది. చూడముచ్చ టగా ప్రేమానురాగాలతో దాంపత్యజీవితం గడుపుతున్న భార్యాభర్తలు పోట్లాడుకుచస్తున్నారనుకోవడంలో ఆనందమూర్తికి సంతృప్తివుంది. అందర్నీ ముగ్ధుల్నిచేసే రూపురేఖలున్న పురుషుడిలో కావల్సింది లేదనుకోవడంలో భీమారావుకు మోక్షం లభిస్తుంది. వాళ్ళకేగాదు, కొంచెం హెచ్చుతగ్గుపాళ్ళల్లో మనందరికీ అటువంటి పైశాచికానందం కలుగుతూనే వుంటుంది. దానికి బాధపడటంలో అర్థం లేదు.'

'నువ్వు చెప్పింది కాదంటంలేదు. ఈ పరిస్థితులలో

నన్నేం చెయ్యమంటావో చెప్పమంటున్నా శేషాద్రీ!'

'నన్ను సలహా అడుగుతున్నావా?'

'ఔను.'

'నే చెప్పినట్టు చేస్తావా?'

'చేస్తాను.'

'కాస్సాగు, చెబుతాను.'

స్టౌ వెలిగించి కాఫీకాచి రెండుకప్పుల్లో పోసి పట్టుకొచ్చాడు శేషాద్రి. అతను కాఫీకాస్తుంటే జయలక్ష్మికి నవ్వొచ్చింది.

'ఎందుకు నవ్వుతావ్?'

'నువ్వు కాఫీ పెట్టడం చూస్తే నవ్వొచ్చింది.'

'కాఫీ బాగుండ లేదా?'

'బాగుంది!'

'మరి?'

'కాని, నువ్వు కాచడం బాగుండ లేదు.'

'నేను పెట్టకపోతే ఇంకెవరు పెడ్తారు?'

'భార్యను తెచ్చుకోకూడదూ?'

'ఎక్కడనుంచి?'

'పెళ్లి చేసుకుంటే సరి!'

'నా మొఖానికి పిల్ల నెవరిస్తారు?'

'నీ మొఖాని కేం శేషాద్రీ! సలక్షణంగా వుంది.'

'నా మొఖం నీకు బాగుంటే కావల్సిం దేముంది.'

'నాకే గాదు మీ ఆవిడకు కూడా బాగుంటుంది.'

ఇద్దరూ నవ్వుకున్నారు. ఏవో నిగూఢమైన ఆశలు

వాళ్ల ఇద్దరి మధ్యా మెదులుతున్నాయి. అట్లా మాట్లాడు కోవడంలో ఇద్దరూ చిత్రమైన ఆనందం అనుభవిస్తున్నారు.

'జయలక్ష్మీ! చాలా రోజులనుంచి నిన్ను ఒక మాట అడగా లనుకుంటున్నాను. దాచకుండా చెప్తావా!'

'అడుగు!'

'ఈ ప్రశ్న నిన్ను అడగొచ్చునో లేదో నాకు తెలి యదు.'

'ఫర్వాలేదు లేవయ్యా స్వామీ! కాని—'

'నువ్వింకా పెళ్ళెందుకు చేసుకోలేదు!'

'ఇంకా అంటే?'

'పెళ్ళయివుంటే ఈపాటికి నలుగురు బిడ్డల్ని కనవల సిన దానివి!'

జయలక్ష్మి మొఖం ఒకసారి పాలిపోయింది.

'నాకు పెళ్లికాకపోవడం నీగ్గూడా సమస్యగా వుందా?'

'కోపం వచ్చిందా ఏమిటి? నన్నపార్థం చేసుకోకు జయలక్ష్మీ! నిన్ను చులకన చెయ్యాలని నా ఉద్దేశ్యం గాదు. నీకు సలహా ఇచ్చేముందు నీ విషయా లన్నీ నాకు తెలియాలి గదా!'

'అబ్బె! నీమీాద కోపం ఎందుకు శేషాద్రీ! ఇప్పటికి చాలామందికి నన్నెరుగున్న వాళ్ళందరికీ నా పెళ్లి విషయం సరదాగా చర్చించే సమస్యగా వుంటూంది. కాలక్షేపానికి నాలాంటి అభాగినులు చర్చనీయాంశాలే మరి. నువ్వు అట్లా అడిగా వేమిటని నేను అనుకోవడం లేదు. నాకూ పెళ్లి

చేసుకోవా లనీ, బిడ్డలతో ప్రశాంతంగా బ్రతకాలనే కోరిక బలీయంగా వుంది. అసలు నిజంగా నాలాంటి వాళ్ళకు పెళ్లి అవసరం మరీ ఎక్కువేమో! ఇది నా సుఖంకోసం గాదు, పొడుస్తున్న కాకులనుంచి తప్పించుకోవడానికి.'

'మరి ఇంతకాలం పెళ్ళి ఎందుకు చేసుకోలేదు జయలక్ష్మి?'

'ఎవర్ని చేసుకోవాలి శేషాద్రీ? ఎలా చేసుకోవాలి? ఎవడో ఒకడు కనిపించాలి గదా! చేసుకుంటానని ముందుకు రావాలిగదా! ఇవన్నీ కుదరద్దూ?'

'వయసు వచ్చి ఊహ తెలిశాక ప్రతి కన్యకూ ఒక రాజకుమారుణ్ణి చేసుకోవాలని వుంటుంది. రాజ్యంలో కోటి మంది కన్నెలుంటే రాజకుమారుడు ఒక్కడే వుంటాడు. అలాగే మగవాళ్లు కూడా. అందాల ఊర్వశిని చేసుకోవాలనుకుంటారు. కాని, ఎంతమంది సౌందర్యమూర్తులు కన్పిస్తారు? నూటికి ఒకళ్లు—లేక ఇద్దరు. అంతేగా! అందరూ అటువంటివాళ్లు దొరికేదాకా పెళ్లి చేసుకోకూడదనుకుంటే నూటికి తొంభై తొమ్మిదిమంది ఆజన్మబ్రహ్మచర్య వ్రతంలో రాలిపోతారు.'

'అబ్బే! నాకు అలాంటి ఆశ లేం లేవు శేషాద్రీ! నాతో స్నేహం చెయ్యడానికి ఇంచుమించు ఆంధ్రదేశంలో ఏ పురుషుడైనా ముందుకు వస్తాడు. ఆ విషయం నాకు తెలుసు. నేను కోరేది అది గాదు, నాతో సమానంగా నా కష్టసుఖాలు పంచుకుంటూ, నేను బ్రతికున్నంత కాలమూ

నాకు నీడనివ్వాలి. ఇంతవరకూ అలాంటి మనిషి నాకు కని పించ లేదు.'

'ఇంతవరకూ నిన్ను పెళ్లి చేసుకుంటా నని ఎవరూ ముందుకు రా లేదా?'

'చెప్పానుగా! సౌఖ్యాన్వేషులు లక్షమంది నా చిరు నవ్వు కోసం ఆరాటపడ్డారు. ఒకతను పెళ్లి చేసుకుంటా నన్నాడు. నాకూ అతను నచ్చాడు. కాని, అత నింకా పసి తనంలో నేవున్నాడు. అతని మనస్సు చాలా బలహీనమైంది. ఏ మాత్రం శబ్దమైనా బెదిరిపోతాడు. నన్ను పెళ్లి చేసుకోవా లనే వుంది. కాని, అతనికి అందు క్కావలసిన ధైర్యం, సాహసం రెండూ లేవు. తల్లిదండ్రుల నెదిరించి, తెగించి నా దగ్గరకు వస్తాడని నేను అనుకోను.'

జయలక్ష్మి నిట్టూర్చింది.

శేషాద్రి ఆలోచనలో పడ్డాడు. ఆ సంభాషణ అంత టితో ఆగిపోయింది. జయలక్ష్మిని వెళ్లి ఇంటిదాకా దిగబెట్టి వచ్చాడు శేషాద్రి. అతను వెడుతూంటే వెనక ఎవరో సకి లించినట్టు అనిపించింది. ఎవరో తమను అనుసరిస్తున్నట్టు అలికిడయింది. జయలక్ష్మి తాళం తీసి లోపలికి అడుగు పెడుతూ-'శేషాద్రి నాకు సలహా చెప్పనే లేదు' అనుకుంది.

# 17

మర్నాడు జయలక్ష్మికి రెండు ఉత్తరాలు వచ్చాయి.
ఒకటి తల్లి వ్రాసింది. రెండోది వేణు వ్రాశాడు. ముందు వేణు వ్రాసిన కవరు చించింది. అందులో ఒక శుభ లేఖ, ఉత్తరము వున్నాయి. ఏప్రియల్ 22వ తేదీన వేణు గోపాల్‌కూ, రాధకూ వివాహం. బంధుమిత్ర పరివార సహితంగా వచ్చి వధూవరుల నాశీర్వదించమని పిలుపు. ఉత్తరం విప్పింది.

'జయా!

చివరికి విధికి లొంగిపోవాల్సి వచ్చింది. కుటుంబ బాధ్యతలకు తలవంచి, నా ప్రేమనూ, సౌఖ్యాన్నీ వదులుకోవలసి వచ్చింది. నన్ను అపార్థం చేసుకోవని భావిస్తున్నా, నా పరిస్థితులలో నువ్వు వున్నా వనుకొని ఆలోచించు. నువ్వు నాకు కలిసిన నిముషంనుంచి ఈ క్షణంవరకూ నీ గురించే ఆలోచిస్తున్నా. ఏం లాభం? నేను కన్న కలలన్నీ కల్లలై పోయాయి. ఈ పెద్దలూ, సంఘం కట్టుబాట్లూ నన్ను నిస్సహాయుణ్ణి చేసేశాయి. నామీద కోపం తెచ్చుకోవు గదూ! కాని, ఒక్కటి మటుకు కోరుతున్నా. మన వివాహం కాకపోయినా, మన స్నేహం బతికినంతకాలం నిలవాలి. ఇది కోరిక గాదు జయా! యాచన. నీకు అన్యాయం చేస్తున్నా ననే భావం నన్ను పిండేస్తూంది. ప్రళయవేగంలో కొట్టుకుపోతున్న తృణంలా నా జీవితం సాగిపోతూంది. ఎంత ప్రయ

శ్రీంచినా నిన్ను నా దాన్నిగా చేసుకోలేక పోయాను. నా దురదృష్టం స్వల్పమైంది గాదు. నా పరిస్థితి అంతా నీముందు పెట్టాను. నన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తావని ఆశిస్తున్నాను.

నీ శ్రేయోభిలాషి,
వేణు.

రెండో ఉత్తరం చించింది.

'తల్లీ !

ఉద్యోగం పేరుతో నన్ను వదలి వెళ్ళిపోయావు. పోట్లాడుకున్నా, అనగూడని మాటలు అనుకున్నా ఇదివరకు నా కళ్ళముందు కనిపించే దానివి. నా బాధ నీకు అర్థంగాదు తల్లీ! నేను మరణించాక, నీ కోసం తపిస్తున్న నా గుండెలు మట్టిలో కలసిపోయక నా బాధ నీకు తెలుస్తుంది. చని పోయేలోగా ఒక్కసారి నన్ను 'అమ్మా!' అని ప్రేమగా పిలిచి నా జన్మ తరింపజేస్తావనే ఆశ నాకు వుండటం లేదు. నన్ను ద్వేషించకు జయా! ప్రేమించడానికి నీకంటే నా కింకెవరున్నారు? ఎవరు నా ఆశలు నిలుపుతారు? నాకు ఈ క్షణంలో బయల్దేరి నీముందు వాలాలని వుంది. కాని, నా నీడగూడా నిన్ను భయపెడుతున్నదని, కావాలని నాకు దూరంగా వెళ్ళిపోయావు. అలాంటప్పుడు నీ దగ్గరకు ఎలా రాను ? వస్తే నాతో మాట్లాడతావా తల్లీ! నీ దగ్గరనుంచి ఈ ఒక్కమాటతో కార్డువస్తేచాలు. రెక్కలు గట్టుకు వచ్చి వాలతాను. ఆశతో ఎదురు చూస్తుంటా.

ఇట్లు,
నీ కన్నతల్లి బాలాంబ.

మరోమాట :- ఈమధ్య నా ఆరోగ్యం బాగుండటం లేదు. విముక్తి బహుశా ఎంతో దూరంలో లేదనుకుంటాను. నిన్ను చూడకుండా చనిపోతే, ఆ కోరికతో పిశాచాన్నయి పోతానేమోనని భయంగా వుంది. నాకు భయపడకుండా నువ్వు ఇక్కడకు వచ్చేరోజు కోసం ఎదురు చూస్తున్నాను. నేను వెళ్లిపోయేలోగా నువ్వు రాగలవా జయా!

అమ్మ.'

జయలక్ష్మి మనసును ఆ రెండు ఉత్తరాలూ తడిగుడ్డలా పిండివేశాయి. కళ్లు బరువెక్కిపోయాయి. కన్నీరు తుడుచుకోవాలనే ఆలోచనకూడా లేకుండా, శూన్యంగా కప్పుకేసి చూస్తూ కూర్చుంది జయలక్ష్మి.

'ఆఫీసరుగారూ!' అంటూ పిలిచిం దొక కంఠం. గుమ్మంలోకి చూసింది, బుల్లి రెడ్డి! అతను రెండడుగులు వేసి జయలక్ష్మి ఏడుస్తున్న దని గ్రహించాడు. కొన్నాళ్లుగా బ్లాక్‌లోని తక్కిన ఆఫీసర్లంతా జయలక్ష్మిని ఎట్లా వేధిస్తున్నదీ బుల్లి రెడ్డి వింటూనే వున్నాడు. దీనికి కారణం ముకుందరావు మూతా అని కూడా అతనికి తెలుసు. ఫలానా వాళ్ల తల సాయంత్రానికి నరుక్కురమ్మంటే తెచ్చి ఇచ్చే వీరాధివీరులు అనేకమంది బుల్లి రెడ్డి అడుగుజాడలలో మెదులుతుంటారు. ఈ సంగతి జయలక్ష్మికి తెలుసు. విషాదానలంతో భస్మమైపోతున్న జయలక్ష్మి హృదయంలో ప్రతీకార వాంఛ రేగుతున్నది.

'జయలక్ష్మిగారూ! మీరు ఎందుకు బాధపడు

తున్నారో నాకు తెలుసు. ఆ ముకుందరావు ముఠా వాళ్లేగా మిమ్మల్ని అల్లరి చేసేది!' అన్నాడు.

'ఔనండి' అంది జయలక్ష్మి.

'మీరు భయపడకండి. నేను వున్నాను. నేను సై అంటె చాలు వాళ్ల ఎముకలు విరగబొడిచేస్తారు.'

జయలక్ష్మి వణికింది. ముకుందరావు ముఠాకి శాస్తి జరగటం తన కిష్టమే. అటువంటి వాళ్లను ఏం చేసినా పాపం లేదు. తనకి వాళ్లమీద వీసమెత్తు జాలి కూడా లేదు. కాని, విధి వక్రించి తలలు పగిలితే? హత్యలు జరిగితే? ఎంత రభస! ఎంత అల్లరి!!

'వద్దండీ బుల్లిరెడ్డిగారూ! ఎవరి పాపాన వాళ్లని పోనివ్వండి. నా కోసం మీరు ఇరుకులో పడటం న్యాయం గాదు' అంది తత్తరపాటుతో.

'మీకు తెలియదండీ! వెధవ పీనుగులు! మీరు చూస్తూ ఊరుకోండి, వాళ్లని నల్లుల్ని నలిపినట్టు నలిపేస్తాను. మీ కాళ్లముందు పడి ఏడ్చేలా చేస్తాను.' అన్నాడు బుల్లిరెడ్డి.

'బుల్లిరెడ్డిగారూ! నాయందు మీ కేమాత్రం గౌరవం వున్నా, దయవుంచి ఇలాంటి పనులు మాత్రం చెయ్యబోకండి' అంది తల వంచుకుని.

'నా సహాయంమీరు ఎప్పుడూ వద్దంటూనే వున్నారు. నన్నుగాని మీరు విరోధిగా భావిస్తున్నారా?' అన్నాడు బుల్లిరెడ్డి.

'అబ్బె! అలా అనుకోకండి. ఈ ప్రపంచంలో ఈ మాత్రం సహాయం చేసేవాళ్లు మాత్రం నా కెవరున్నారు?

నాకేదన్నా అవసరం వస్తే నేనే అడుగుతాను.'

'ఇప్పుడు నా సహాయం మీకేమాత్రం అవసరం లేదన్నమాటేగా!'

'కావాలి. వెంకంపంతులుగారు ఈ ఇల్లు ఖాళీ చెయ్యమంటున్నారు. ఖాళీ చేస్తే నాకు ఇల్లెక్కడ దొరుకుతుంది?'

'ఎందుకు ఖాళీ చెయ్యమన్నారు?'

'నేను మంచిదాన్ని కాదుట. తన ఇల్లు సంసారులకు మాత్రమే ఇస్తాడుట.'

'అంతమాట అన్నాడా బ్రాహ్మడు?'

'అంతమాట అనిపించారు.'

'సకిలీసన్నాసులు! మీరు ఇల్లు ఖాళీచేయకండి. ఏంచేస్తాడో ఆసంగతి నేను చూస్తాను.'

'ఇల్లు అతనిది. మనకు ఖాళీ చెయ్యననటానికి ఏమధికారం వుంది?'

'ఫర్వాలేదు. చెయ్యబోకండి. అ వెంకంపంతులు ఒకళ్లననేవాడా? వాడి కూతుళ్లకంటే చెడతిరిగినవాళ్లున్నారా? మిమనుకుట్టే సాయబుతో లేచిపోయిన రెండో కూతుర్ని నోరెత్తకుండా తెచ్చి ఇంట్లో పెట్టుకోలా?'

జయలక్ష్మి ఆలోచనలో పడింది. బుల్లిరెడ్డి వెళ్లిన దగ్గరనుంచి అతన్నిగురించే రకరకాల ఆలోచనలు వస్తున్నాయి. బుల్లిరెడ్డి శక్తిగలవాడు. అతనిఅండ అవసరమనిపిస్తాంది. అంతమాత్రాన??

మర్నాడు వెంకంపంతులు దూకుడుగా వచ్చి ఇల్లు ఇంకా ఎందుకు ఖాళీచెయ్యలేదని గదమాయించడం ప్రారం

భించాడు. మరో ఇల్లు దొరకగానే ఖాళీ చేస్తానంది జయలక్ష్మి. రేపుగనక ఖాళీ చెయ్యకపోతే సామాను బయటపారేయిస్తా నన్నాడు వెంకటంపంతులు. 'మీదా'యంటూ లోపలకు వెళ్లి పోయింది జయలక్ష్మి. ఉద్యోగం మాని ఎక్కడికన్నా వెళ్లిపోవాలనిపించింది. కాని, ఎక్కడికి? తా నెవరికి అప కారం చేసింది? తను చేసిన తప్పేమిటి? మళ్ళీ హైద్రాబాద్ వెళ్ళాలనిపించడం లేదు. మరింక తను నిలవగల చో టెక్కడవుంది? ఆలోచనలు సాగిసాగి అలిసి నిద్రపోయింది.

# 18

తెల్లవారింది. ఇంకా కోళ్లు కూస్తూనేవున్నాయి. కాకులు అరుస్తూనే వున్నాయి. వెంకటంపంతులు ఇద్దరు మనుష్యు లను వెంటబెట్టుకొచ్చి జయలక్ష్మి ఇంటితలుపులు బాదటం మొదలుపెట్టాడు. ఆమె తలుపులుతీసి. సమరోత్సాహంతో ఊగిపోతున్న వెంకటంపంతులు సంరంభం చూసింది.

'ఈమాత్రం సామాను బయటపారేయడానికి ఇద్దరు మనుష్యులు కావల్సివచ్చారా పంతులుగారూ!' అంది నిర్లిప్తంగా జయలక్ష్మి.

'సామాను బయటపారేయండిరా!' ఆజ్ఞాపించాడు వెంకటంపంతులు.

పొలానికి బండి కట్టుకుపోతున్న మున్సబుగారి ఇల్లరికపుటల్లుడు బండాపి సినిమా చూస్తున్నట్టు నిలబడి పోయాడు.

'పంతులుగారూ! రెండురోజులు గడువివ్వించండి. మీఇల్లేగాదు. మీఊరే వదిలివెళ్లిపోతాను. ఇవాళ్టికి వుండ నీండి' అంది మెల్లిగా.

'వీల్లేదు. నీ కీ ఊళ్లో ఇళ్ల కేం తక్కువ లేదు. నిన్ను నెత్తిమీదపెట్టుకు పూజించేవాళ్ళు కోకొల్లలు' నిర్మొహమాటంగా అన్నాడు పంతులు.

జయలక్ష్మికి బాకుతో వెన్నుపొడిచినట్లనిపించింది. కాని, బ్రతిమాలుతూనే 'పంతులుగారూ! రేపు వెళ్లిపోతాను. ఈఒక్కరోజూ ఆగండి. ఇన్నాళ్లుగా వుంటున్నాను. ఎట్లాగో మీఇల్లు మైలపడిపోయింది. ఈఒక్కరోజులో ఇంకేమీ జరగదు' అంది బాధతో, రోషంతో, కసిగా.

ఈ ఘట్టంలో రంగంమీదికి ప్రవేశించారు వాళ్ళు నలుగురూ. వెంకుంపంతుల్ని ఇంతవరకూ ప్రోత్సహించి పంపిన ముకుందరావు ముఠాకు అతని కరుకుతనంమీద నమ్మకం లేదు. ఇంట్లోంచి వెళ్లిపొమ్మనగానే జయలక్ష్మి కంటతడిపెట్టి బ్రతిమాలుతుందనీ, ఆమాత్రానికి వెంకుంపంతులు జావకారి, నీరసించి సొమ్మసిల్లి తిరిగి చక్కావస్తాడనీ వాళ్ళభయం. ఈ పురుషకార్యం ఆద్యంతం నిర్విఘ్నంగా సాగించాలనే సద్బుద్ధితోనే వాళ్లు పనిగట్టుకుబయల్దేరారు. కాని, వెంకుంపంతులు కొన్ని సందర్భాలలో సమర్థుడే. ఎంత పిరికివాడైనా, ఎదుటివారు ఎదురుతిరగలేరని నమ్మకం కుదిరితే, మహారథిలాగ విజృంభించగల సాహసి. ఆమధ్య సత్రంధర్మకర్త ఆకస్మికంగా మరణిస్తే దానిమీద కొంత అధికారం తాత్కాలికంగా వెంకుంపంతులికి సంక్ర

మించింది. అంతటితో ఒక మహాసామ్రాజ్యసింహాసనం లభించినట్టు ఉబ్బిపోయి, రోజూ రెండుపూటలా ఆ సత్రంలో వంటలొండే ముసలమ్మతో ద్వంద్వయుద్ధం చేసి 'నీఉద్యోగం ఊడబెరికేస్తా' నంటూ బెదరిస్తూ, రొప్పుకుంటూ ఇంటికొచ్చే వాడు. మార్గమధ్యంలో ఎవరన్నా కనిపిస్తే తనకూ, సత్రం ముసలమ్మకూ జరిగిన ఈ వాగ్యుద్ధాన్ని రసాత్మకంగా వర్ణించి, ఆ మహాసంగ్రామంలో తాను చూపిన ప్రజ్ఞాకౌశలాలను సోదాహరణంగా వివరించి హింసించేవాడు. అలాంటి వానికి ఇటీవల ఆసత్రంమీద అధికారం పోవడంతో రంకెలు వేసే అవకాశం లభించడం లేదు. జయలక్ష్మిపై తన దర్పం చూపించే అవకాశం భగవత్ప్రసాదంగా స్వీకరించి, గోచీ దోపుకుంటూ, యజ్ఞోపవీతం సవరించుకుంటూ, పిలక పదే పదే ముడివేస్తూ సాగరగంభీరమైన హావభావాలను చిత్ర విచిత్రభంగిమలో వ్యక్తంచేస్తూ కడసారిగా ఆజ్ఞాపించాడు.

'చూస్తారేంరా! సామాను బైటకు గిరవాటుపెట్టండి.'

ఈలోగా పుణ్యపురుషులు నలుగురూ రెండు జట్లుగా విరిగిపోయారు. ముకుందరావూ, పెరియాళ్వారూ వెంకంపంతులు జట్టు, భీమారావూ, ఆనందమూర్తి జయలక్ష్మి జట్టు. ఈ రెండుజట్లూ వాగ్యుద్ధం ప్రారంభించాయి.

వెంకంపంతులు జయలక్ష్మిట్రంకును రోడ్డుమీదకు గిరవాటు పెట్టాడు. అది ఫెళ ఫెళ మ్రోగుతూ మూత ఊడి క్రిందపడింది. స్నో సీసా బద్దలైపోయింది. పౌడరు డబ్బా దొర్లి మురికి గుంటలో పడింది. అత్తరు సీసా పగిలి గాబోలు సువాసనలు గుబాళించాయి.

'పారిస్ అత్తరు, పాపం! అలా పగలగొట్టారేం పంతులుగారూ!' అంటూ ప్రారంభించాడు ఆనందమూర్తి.

'ఈ అత్తరు అనుభవించాలంటే తెనాలి మెరక దిబ్బకే పోవాలి' వినీ వినపడనట్టు అన్నాడు భీమారావు.

ఈ సమయంలో జయలక్ష్మి ఏడుస్తుందని వాళ్ళు ఆశించారు. ఎలా ఎడుస్తుందో చూడాలని గంపెడాశతో వచ్చారు. కాని జయలక్ష్మి ఏడవటం లేదు. వీధి పక్క చౌకరకం గారడీ విధిలేక చూస్తున్నట్టు కనిపించింది. రసాత్మకంగా వుండవలసిన ఘట్టం పేలవంగా వుంది. కొంత గాలి విసరి రాజుకోనియ్యడం అవసర మనిపించింది. రెండు జట్లుగా విడిపోయిన ఆ నలుగురూ బిగ్గరగా కేకలు వేయటం ప్రారంభించారు. మధ్యలో ఆనందమూర్తి జయలక్ష్మి దగ్గరకు వచ్చి, అతిలాలనగా, 'జయలక్ష్మీ!' అన్నాడు. ఏవో చిత్రమైన ఆలోచనలలో మునిగిపోయిన జయలక్ష్మికి ఆనంద మూర్తి పిలుపు వినిపించలేదు.

'చూడమ్మా!' మరీ దగ్గరగా వచ్చి పిలిచాడు.

'ఏమిటీ?' అంటూ ఉలిక్కిపడింది జయలక్ష్మి.

'ఈ ఉపద్రవం నుంచి బయటపడటానికి ఓ పని చెప్తా, చేస్తావ్?'

'ఏమిటి?'

'పోనీ, శేషాద్రి ఒక్కడే వుంటున్నాడు. అతని గదిలో మకాం వేయగూడదూ ఈ నాలుగు రోజులూ! వచ్చే దసలే చలికాలం!'

ఇంత సేపూ అతిప్రశాంతంగా, చోద్యం చూస్తున్న

ట్టున్న జయంతిలక్ష్మి దెబ్బతిన్న చిరుతపులిలా రేగి, ఆనంద మూర్తిని చాచి రెండు లెంపకాయలు కొట్టింది. అతని గూబపై అయిదు వేళ్లు తేలాయి. ఈ దెబ్బతో వాళ్లు నలుగురూ ఒక్కటయ్యారు. జయలక్ష్మి ఆడది కాదనీ, భయంకర నారీ పిశాచమనీ అక్కడ గుంపులు గుంపులుగా చేరిన మహాజనానికి నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. జయలక్ష్మిపై తిరగబడబోయిన ఆనందమూర్తిని నలుగురు పెద్దలు అతికష్టంమీద ఆపుజేశారు. ఊళ్ళో జనం సగంమంది అక్కడ మూగారు. ఎవరికి తోచిన మాటలు వాళ్లు అంటున్నారు. ఆడది వంటిల్లు వదిలిరావడం ఎటువంటి ప్రమాదాలకు దారితీస్తుందో వివరిస్తున్నాడొక అవధాని.

'అది ఆడది. కాని రాక్షసి. అన్యాయంగా, అక్రమంగా నామీద చెయ్యి చేసుకుంది. నేను తలుచుకుంటే దాన్ని క్షణంలో పిండి చేసెయ్యగలను. కాని, మీరంతా పెద్దలు. తప్పు చేసినవారికి బుద్ధి చెప్పేది మీరు. దానికి మీరేం శిక్ష విధించినా నేను అనుభవిస్తాను.' అంటూ ఎన్నికల ధోరణిలో ఉపన్యసిస్తున్నాడు ఆనందమూర్తి.

వెంటనే అక్కడ జరిగిన హఠాత్సంఘటన అందర్నీ నిర్ఘాంతపోయేటట్టు చేసింది. నాలుగు కర్రలు బలంగా ఆనందమూర్తి తలమీద పడ్డాయి. నిస్సహాయుడైన ఆనందమూర్తి ఆశ్చర్యంతో, భయంకరమైన బాధతో బిక్కచచ్చి కుప్పలా కూలిపోయాడు. మృత్యుదేవి ప్రళయనాట్యానికి మ్రోగిన మహిమఘంటికల్లా కర్రలు ఆనందమూర్తి శిరస్సుపై ఖంగున మ్రోగినై! మలిన రుధిరవాహి

నిలో మాంసపు ముద్ద కొట్టుకుంటున్నది. కడసారి జీవుడు మృత్యుదేవతతో పెనుగులాడుతున్నాడు. ఆ శరీరానికి చైతన్యమిచ్చిన అదృశ్యశక్తి అనంతవిశ్వంలోకి తరలిపోతున్నది. ఆనందమూర్తి కళ్లు తేలిపోయాయి. సూర్యుడు నల్లబడ్డాడు. భూమి మండి భస్మమైపోయింది. ఆకాశం తిరిగింది. మనుష్యులు శరీరాలు లేని ఆత్మల్లాగ కనిపించారు, అస్తమిస్తున్న ఆనందమూర్తి కళ్ళకు. పదిక్షణాల్లో ఆనందమూర్తిని మట్టిలో విసర్జించి అనంతాకాశంలో లీనమైపోయాయి అతని ప్రాణవాయువులు.

# 19

ఆనందమూర్తిని హత్యచేసినందుకు బుల్లి రెడ్డిమీద పోలీసులు కేసుపెట్టారు. జయలక్ష్మి ఉద్యోగం చేయలేక రాజీనామా ఇచ్చి హైద్రాబాదు వచ్చేసింది. కేసు చాలా కాలం నడిచింది. దేశమంతా కాలక్షేపానికి ఈ కేసుని గురించి సుదీర్ఘచర్చలు జరిపింది. పత్రికలకు ఇటువంటి హత్యకేసులు టానిక్కుల్లాగ పనిచేస్తాయి. జయలక్ష్మి కూడా కోర్టుకు హాజరు కావలసి వచ్చింది. పత్రికా విలేఖరులు మహానాయకుడివెంట బడ్డట్టు ఆమెను చుట్టు ముట్టేవారు. జయలక్ష్మి పేరు ఆంధ్రదేశానికే సుపరిచితమైంది. ఆమె ఫోటో కావా లంటూ ఎందరో రాశారు. ఓ భావోద్రేకి ఇంకాస్త ముందుకుజరిగి, 'ప్రాణాలకు తెగించి, ప్రత్యర్థి ప్రాణాలు తీయించిన మీ సౌందర్య సౌభాగ్య వికాసం

యువకలోకానికి దర్శనీయం గదా!' అంటూ భావకవిత్వం తాలూకు లేఖ ఒకటి, సెంటురాసిపంపాడు. కేసు సంవత్సరం నడిచింది. హైదరాబాద్‌లో గూడా ఇదొక రసాత్మక గాధగా నలుగురూ చేరిన ప్రతిచోటా చర్చింపబడేది. కొందరు జాలిగానే 'ఏం జయా! ఏం జరిగిం దసలు?' అని అడిగినా, ఆ ప్రశ్న జయలక్ష్మిని చిత్రహింస పెట్టేది. కొందరు అమాయకంగా అడిగితే, కొందరు వ్యంగ్యంగా అడిగేవారు, ఆకాశంలో హాయిగా ఎగిరే తేనెటీగపొట్టలో తుమ్మముల్లు గుచ్చి, అది చస్తుంటే సంబరపడే మనుష్యులు గూడా ఈ పురాణ భూమిపై వున్నారు. ఈ కేసు గురించి ఏమీ ప్రశ్నించని వ్యక్తి ఒక్కతే! ఆమె బాలాంబ!! ఇంత జరిగినా తల్లి తననేమీ ప్రశ్నించకపోవడం గూడా జయ లక్ష్మిని బాధించింది. తల్లి అడిగితే మరొక విధంగా బాధ పడేది.

సంవత్సరం అయాక ఓనాటి ఉదయం పేపర్లో ప్రము ఖంగా కనిపించిన ఒక వార్త చూసింది జయలక్ష్మి.

'చింతలపూడి హత్యకేసులో బుల్లిరెడ్డికి ఉరిశిక్ష!'

ఆ వార్త చదివి శిలాప్రతిమలా నిశ్చేష్టురాలైంది జయలక్ష్మి. ఏ విధి వికృతంగా తన్నిట్లా ఏ నికృష్టగమ్యా నికి తరుముకుపోతున్నదో ఊహాకందటం లేదు. బుల్లిరెడ్డిని తాను ఉరి తీస్తున్నట్టు బాధ కలిగింది. శాపగ్రస్తమైన తన బతుకును ఎవరూ సంస్కరించ లేరు. సహాయం చేయలేరు. చేయాలని ముందుకు వచ్చినా తన గాలిపోకగానే నశించి పోతారు. ఉరితీసే ముందు ఆ అభాగ్యుడు ఎట్లా వుంటాడో?

అతని ఆలోచనలు ఏ విధంగా వుంటాయో? తల బాదు కుంటూ విలపిస్తాడా? లేక నిర్లిప్తంగా, చైతన్యం లేని పాషాణంలాగ విధికి లొంగిపోతాడా? బుల్లిరెడ్డి ఇప్పుడు పశ్చాత్తాపంతో బాధపడుతున్నాడేమో? ఆనందమూర్తిని చంపి అతను లోకానికి మేలే చేశాడు. కాని-బుల్లిరెడ్డి బ్రతకాలి. అతన్ని బ్రతికించడానికి గనక వీలుంటే, తన ప్రాణాన్ని ధారపోసి అయినా అతన్ని మృత్యువునుంచి తప్పించగలదు. కాని తానేం చేయగలదు? తన బాధ బుల్లిరెడ్డికి చెప్పుకుని ఏం లాభం?

'అమ్మా!'

తలెత్తి చూసింది జయలక్ష్మి. తల్లి!

'చూడమ్మా! ఈసారి నీతో పోట్లాడటానికి రాలేదు. జరిగిందేదో జరిగిపోయింది. నా మాట కొంచెం ప్రశాంతంగా విను. నేను ఇంక ఎక్కువకాలం బ్రతకను. బ్రతకాలనీ లేదు. నా వంట్లో ఏదో నలత కూడా ప్రవేశించింది. నువ్వా పెద్దదానివయ్యావు. వయసొచ్చింది. వీలైనంత త్వరగా పెళ్ళి చేసుకోవడం అవసరం.'

'నేనూ చేసుకోవాలనే అనుకుంటున్నాను. ఇలా వంటరిగా బ్రతకటం నాకు దుర్భరమనిపిస్తూంది. కాని నన్నె ళ్ళి ఎవరు చేసుకుంటారు అమ్మా!' తలెత్తి మెల్లిగా అంది జయలక్ష్మి. ఆ మాట బాలాం గుండెల్లో శూలంలాగ పొడిచింది.

'అదృష్టవశాత్తూ ఒక సంబంధం కుదిరేటట్టు వుంది జయా!' బాలాంబకంఠం జీరపోయింది.

జయలక్ష్మి తల్లి ముఖంలోకి చూసింది. ఈ రెండు సంవత్సరాలలోనే రెండు దశాబ్దాలలో రావలసినంత మార్పు ఆమెలో వచ్చింది. ఆమె శరీరంపై మోజుతీరిన యవ్వనం క్రమక్రమంగా దూరదూరంగా పారిపోతున్నది. నాలి ముచ్చులా వార్ధక్యం ముసురుకొస్తున్నది. బుగ్గలు గుంటలు పడ్డాయి. నుదురు ముడతలు పడుతూంది. నూనె లేక తల లోని తెల్ల వెంట్రుకలు మరీ వికృతంగా కనిపిస్తున్నాయి. మీద ఏదో బరువున్నట్లు మనిషి కొంచెం క్రుంగింది.

'ఎక్కడిది దా సంబంధం?'

'సత్యమూర్తని ఇక్కడనే కో ఆపరేటివ్‌లో గుమాస్తాగా చేస్తున్నాడు.'

'అతను నాకు తెలుసు.'

'తెలుసా? అయితే చెప్పు తల్లీ! ఆ సంబంధం నీ కిష్టమేనా?'

'అతని కిష్టమేనా?'

'ఆహాఁ! కళ్ళకద్దుకు చేసుకుంటాడు. నువ్వు ఊ అంటే చాలు!'

జయలక్ష్మి ఆలోచనలో పడ్డది.

'కొంచెం ఆలోచించుకోనీమ్మా! తర్వాత చెప్తాను.'

'నీకు తెలియదమ్మా! ఈ ఆలోచనలతోనే నే నీ స్థితికి వచ్చాను. ఇప్పటికి పదేళ్లుగా నీ గురించే ఆలోచిస్తున్నాను. నీ క్షేమం కోరి చెప్తున్నాను. అతన్ని చేసుకోమ్మా!'

'సరేనమ్మా! నీ మాట కెదురు చెప్పడం నా కల

వాళ్లై పోయింది. కాని, ఇంక ఎదురు చెప్పను. నీ ఇష్టం-నువ్వు ఏం చేసినా నాకు అంగీకారమే.'

వెంటనే బాలాంబ జయలక్ష్మిని కౌగలించుకుని ముద్దులవర్షం కురిపించింది. జయలక్ష్మి హృదయం వెన్నలా కరిగి తల్లి పాదాల ముందు రాలిపోయింది.

అతిత్వరగా, చురుకుగా పెళ్ళిఏర్పాట్లు జరిగాయి. ఎక్కువ అట్టహాసం లేకుండా జయలక్ష్మి సత్యమూర్తి భార్యగా గుర్తించబడింది. బంధువు లెవరూ రాలేదు. వరంగల్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న వేణు మాత్రం భార్యతోనూ, ఏడాదిపాపతోనూ వచ్చి, దంపతులను ఆశీర్వదించి సోమర్సెట్‌మాం నవలల సెట్టు ఒకటి జయలక్ష్మికి బహూకరించి వెళ్ళాడు.

పెళ్ళయిన నాలుగురోజులకు బాలాంబ నాలుగు వేలు తెచ్చి సత్యమూర్తి కిచ్చింది. 'బాబూ! నా కొడుకూ, కూతురూ నువ్వే. మీరిద్దరూ సుఖంగా వుండటమే నాకు మిగిలింది. రెండునెలలపాటు ఇద్దరూ దేశమంతా తిరిగి సుఖంగా గడిపి రండి. డబ్బుకి మీ కేం లోటూ లేదు. మీరు కార్డురాసిన తక్షణం కావలసింది పంపుతాను' అంది. అల్లుడికి స్వయంగా ఒక డజను ట్వీడుసూట్లు కుట్టించింది. దగ్గరుండి ప్రయాణపు ఏర్పాట్లు చేసింది.

సత్యమూర్తి ఒక ప్లాను తయారుచేశాడు. ముందు విమానంమీద మద్రాసు, తర్వాత బెంగుళూరూ, ఊటీ, బొంబాయి, ఢిల్లీ, కాశ్మీరం-ఇవీ తిరిగి రావలసినవి. ప్రయాణానికి కావల్సిన భోగట్టా అంతా సేకరించాడు. బాలాంబ

స్వయంగా బేగంపేట విమానాశ్రయానికి వెళ్ళి విమానం ఎక్కించింది. జయలక్ష్మి శరీరఆరోగ్యం గురించి జాగ్రత్తగా వుండమని వందసార్లు చెప్పింది. బిడ్డకు కనిపించకుండా కళ్ళు తుడుచుకుంది. విమానం మెల్లిగా బయల్దేరి, భూమిని వదిలి ఆకాశంలోకి లేచింది. కనుచూపుమేర దాటి విమానం పూర్తిగా అదృశ్యమైపోయేదాకా అలాగే నిలబడింది.

ఇంటికి వస్తూ అనుకుంది బాలాంబ:

'రామచంద్రప్రభో! ఈ జీవితంలో క్షణం శాంతి ఎరుగను. నా మిగిలిన సర్వస్వం నా బిడ్డ. అది ఈ రోజు పరాధీనమైంది. నేను పొందింది ఏమిటో - పోగొట్టుకుంది ఏమిటో, భగవాన్, నీకే తెలియాలి!'

నూతనదంపతులు సుఖయాత్రకు బయలుదేరారని వేణుకు తెలిసింది. సత్యమూర్తి అంటే అణువణువునా అసహ్యం ఏర్పడింది. అతను అసలు మనిషిలాగ కనిపించ లేదు. కీటకంకంటే నికృష్టమైన ప్రాణి. జయలక్ష్మిని తాను వివాహం చేసుకోకుండా అడ్డుపడింది మూర్తి. మేనమామతో ఆ పెళ్ళి జరక్కుండా చేసింది మూర్తి. నీతినిగురించి గొంతు చించుకొని ఉపన్యాసాలు ఇచ్చింది మూర్తి. హఠాత్తుగా ఓ నగ్నసత్యం వేణు కళ్ళముందు మెదిలింది. నీతి, ధర్మం, న్యాయం అంటూ అరిచేవాళ్లను నమ్మగూడదని పించింది. 'మొరిగే కుక్క కరవదు, కరిచే కుక్క మొర గదు' చిన్నప్పుడు చదివి ఎన్నడో మరిచిన నీతివాక్యం మళ్ళీ వేణుకు గుర్తుకొచ్చింది.

# 20

మద్రాసు ఉడ్‌లాండ్స్ హోటల్లో దిగారు జయలక్ష్మీ-సత్యమూర్తీ. బీడీలూ, చార్మినార్ సిగరెట్లూ వదిలి, గోల్డుఫ్లేక్ టిన్ కొన్నాడు మూర్తి. మనిషిని మార్చడానికి డబ్బుకంటే మించిన శక్తి ఈ లోకంలో మరొకటి లేదు. వాళ్లు సుఖపడటానికి బయలుదేరిన జంట కావడంవల్ల అందుకోసం కావలసిన హంగులన్నీ ఏర్పాటు చేసుకున్నారు.

ఏర్ కండిషన్ గదిలో నివాసం. సుఖాల మత్తులో రాత్రి కరిగినతర్వాత తెల్లవారకుండానే కమ్మటికాఫీ, గది ప్రక్కనే పన్నీటి షవర్ బాత్. మళ్ళీ టిఫిన్, కాఫీ. గదిలో రేడియోలోనుంచి సన్నగా హమ్మింంగ్ సంగీతం. బెల్లుకొట్ట గానే సర్వసపర్యలకూ సిద్ధంగావుండే నౌకర్లు. మూన్ లైట్ డిన్నర్లు. యౌవనానికి పదును పెట్టడానికి ఫ్రాన్సునుంచి దిగుమతైన పౌడర్లూ, సెంట్లూ, నిలువుటద్దంనీడల్లో సంతృప్తి కలిగేదాకా ముస్తాబులూ! టాయిలెట్ అవగానే గదిలోంచి ఫోనుచేసిన క్షణంలో వాకిట్లో సిద్ధమయే టాక్సీ. మార్కెటింగ్, హార్స్ రేసులూ, సినిమాలూ, క్లబ్బులూ - రెండో ఆట సినిమా చూసి మెట్లు దిగుతూంటే మూల నిలువుటద్దంలో పూర్తి లినన్ సూటులో కనిపించిన సత్యమూర్తి ప్రతిబింబాన్ని చూసి అనుకుంది జయలక్ష్మి 'అందగాడే!'

విలాసంగా కులాసాగా సాగిపోతున్న విలాసయాత్ర చాలా ఖరీదైంది. దాని కోసం కావలసిన డబ్బంతా జయ

లక్ష్మీదేనని సత్యమూర్తికీ తెలుసు; జయలక్ష్మికీ తెలుసు. తన డబ్బుతో సుఖపడుతున్న సత్యమూర్తిపై జాలి వేసింది. గదిలో ఈజీచైర్‌లో కూర్చుని, సిల్కు-లాల్చీ ఫ్యాన్ గాలికి రెపరెపలాడుతుంటే, ఫిన్లీగ్లాస్గోపంచ దోబూచు లాడుతుంటే, గోల్డుఫ్లేక్ సిగిరెట్టు కాలుస్తూ, డన్‌లప్ పరుపుపై పడుకుని వళ్లు విరుచుకుంటున్న తనని చూస్తూ ఆవలిస్తున్న సత్యమూర్తిని చూసి జయలక్ష్మి జాలిపడ టానికి కారణం వుంది. ఆత్మాభిమానం కల పురుషు డెవడూ ఆడదాని డబ్బుమీద బ్రతకలేడు. సత్యమూర్తి అంతర్యంలో బాధపడుతున్నాడేమో! ఏమిటో తనకీ అనవసరమైన ఆలోచనలు! ఈ మనస్సు కాస్త మొద్దు బారితేగాని తాను సుఖపడలేదు.

తిరిగితిరిగి వాళ్ళిద్దరూ కాశ్మీర్ చేరారు. కాశ్మీ రాన్ని భూలోకస్వర్గమనీ, సౌందర్య సర్వస్వమనీ అంటారు. అక్కడ సరస్సుల్లో తిరిగే పడవల ఇళ్లుంటాయి. ఓ ఇంటిని అద్దెకు తీసుకున్నారు. మహోన్నత హిమాలయ శిఖ రాలనుండి స్వచ్ఛందంగా క్రిందకు దూకుతున్న సెలయేళ్ల మృదంగనినాదాలు వింటూ, సరస్సులలో పంచరంగులతో ప్రతిబింబిస్తున్న సంధ్యాకాంతుల్ని చూస్తూ, సత్యమూర్తి వళ్లో పడుకుని తన్మయత్వంతో ఆనందంగా అనుభవిస్తున్న జయలక్ష్మికి ఒకనాడు ఆకస్మికంగా హైదరాబాదునుంచి టెలిగ్రాం వచ్చింది.

'మదర్-సీరియస్-స్టార్ట్-ఇమీడియట్లీ.

వేణూ!'

వెంటనే భర్తతో హైద్రాబాదు వచ్చింది జయలక్ష్మి ఇంటిగుమ్మంముందు డాక్టరుతో మాట్లాడుతూ నర్సింమూర్తి కనిపించాడు.

'ఎలా వుందండీ '' అంది జయలక్ష్మి.

'మీ అమ్మపని అయిపోయింది జయా! నువ్వు అసలు వస్తావనుకోలేదు. కాని - వచ్చావు' అన్నాడు.

'అదేమిటండీ? అమ్మకంత జబ్బు చేస్తే రానని ఎందుకనుకున్నారు ?'

'ఆమాట మీ అమ్మే అంది. నీ సంగతి ఆవిడకంటే లోకంలో ఇంకెవరికి తెలుస్తుంది ?''

'అది నా దురదృష్టం!'

'కాదు జయా! కన్నతల్లికి ఆ అభిప్రాయం కలిగించడంకంటే క్రూరమైన జన్మ మరొక టుండదు'. సాభిప్రాయంగా చూశాడు.

'లేదు. లేదు. మీరు పొరపడుతున్నారు. తల్లికంటే - తల్లిసుఖంకంటే ఎవరూ ఏమీ కోరరు. నేను ఆమెసుఖమే కోరుతున్నాను. నేను తెలిసి చేసిన ఘోరం ఏమీ లేదు. అయినా క్షమించమంటాను. ఆమె కళ్ల ముందే తల బ్రద్దలు కొట్టుకుంటాను' అంటూ తల్లి గదిలోకి దూసుకుపోయింది.

కాని అప్పటికే సమయం మించిపోయింది. బాలాంబకు విముక్తి కలిగింది. ఈ లోకాన్ని విడిచి బ్రతుకులో సాధించలేని సుఖాన్ని వెతుక్కుంటూ వెళ్లిపోయింది.

నర్సింమూర్తి, సత్యమూర్తి ఇద్దరూ గదిలోకి వచ్చి మౌనంగా నిలబడ్డారు.

ఆగదిలోనే బాలాంబ ఎన్నో సంవత్సరాలు బ్రతికింది. నిద్రించింది. కష్టసుఖా లనుభవించింది. కన్నీటిని ఆవిరి చేసుకుంది. ఆ పట్టెమంచం నల్ల చెక్కతో ఏరికోరి చేయించుకున్నది. ఆమంచం ఆమెజీవితానికి సంకేతంలా నిలిచిపోయింది. ప్రక్కనే నిలువుటద్దం గల బీరువా నిస్తేజం చూస్తూ నిలబడిపోయింది. ఆ గదిలో ఏ వస్తువులు ఎక్కడ వుండాలో అలాగే సర్దివున్నాయి. బాలాంబ బ్రతికున్నంతకాలం ఇంటిని పరిశుభ్రంగా వుంచుకోవటం గురించి కొన్ని నియమాలను పాటించేది. అవి ఈక్షణంవరకూ సవ్యంగానే జరిగాయి. ఏదో అత్తరుబుడ్డి పగిలినట్టుంది. గులాబిపరిమళం గుబాళిస్తూంది.

నిశ్చింతగా, నిశ్చలంగా చేతులతో గుండెల్ని కప్పుకుంటూ వెల్లికితలా పడుకునివుంది ఆ మృతదేహం. మృత్యువు ఆమె సౌందర్యాన్ని హరించలేకపోయింది. ఆమె శరీరం సుఖనిద్రలో వున్నట్టుంది. తల్లికేసి తదేకంగా చూస్తూ నిలబడింది జయలక్ష్మి. ఆకాశంలో తారలా కనిపించింది బాలాంబ. నిజమే! తన తల్లి అజ్ఞాతంగా, అర్థరహితంగా జీవించవలసిన స్త్రీ గాదు. చేతనాహీనమైన ఆ మాంసకండరాలను వదిలి వెళ్ళలేక సౌందర్యయవ్వన రాజసాలు ఏడుస్తున్నాయ్!

కాని-జయలక్ష్మికి ఏడుపురాలేదు. తనను కని పెంచిన తల్లి మరణించిందనీ, శాశ్వతంగా తనను వదిలి పారిపోయిం

దనీ ఆమెకు తెలుసు. తన సుఖంకోసం తపించిపోయిన ఆ మాతృమూర్తి ఇక లేదనీ, ఇంక రాదనీ తన హృదయం తల్లడిల్లిపోవటం లేదు. కళ్లు చెమ్మగిల్లటం లేదు. తన హృదయం తనను ఎందు కింత మోసం చేస్తున్నట్టు? మన సారా తల్లిమీదపడి విలపించా లనిపిస్తూంది. తల్లికోసం వెర్రిబాధ అనుభవించాలనీ, కన్నీరుకార్చి ఇంతకాలం తన అంతరాళాల్లో పేరుకున్న మాలిన్యాన్ని క్షాళితం చేయాలనీ విశ్వప్రయత్నం చేసింది. కాని, ఆమెమనసే ఆమెను వంచిస్తూంది. ఏదో బరువు దించుకున్నట్టు హృదయం తేలికై గాలిలో ఎగిరిపోతున్నది. పంజరంలోనుంచి బయట పడిపోయిన పక్షిలాగ మనస్సు నింగిలో ఎగిరిపోతున్నది. తన మీద తనకే అసహ్యం వేసింది. జుగుప్స కలిగింది. తను మనిషి కాదు పశువు. తనలో మానవత్వం లేదు. రాక్షసి. పరమనీచురాలు.

'బాధపడకు జయా!'

తలెత్తి చూసింది. ఎదురుగా వేణు. అతని కళ్ళల్లోంచి మంచి ముత్యాల్లా, పుణ్యకుసుమాల్లా నీరు జలజలమని చెక్కిళ్ళమీదనుంచి రాలిపడుతోంది.

మానవహృదయంకంటే సృష్టిలో అర్థంకాని దేముంది? దాని స్వభావాన్ని నిర్ణయించే శక్తి గల అతీత మానవు డెవడు?

ప్రొద్దు గ్రుంకుతూంది. తెల్లవారుతూంది. రోజులు గడిచిపోతున్నాయి. కర్మకాండ ముగిసింది. నర్సింమూర్తి వెళ్ళిపోయాడు. నెలలు దొర్లుతున్నాయి. ఆ ఇంట్లో సత్య

మూర్తీ, జయలక్ష్మి ఇద్దరే మిగిలారు. సత్యమూర్తి ఆఫీసుకు వెళ్ళాక, జయలక్ష్మి ఒక్కర్తే లంకంత ఇంట్లో వుండ లేకపోతూంది. అప్పుడప్పుడు వేణు కనిపించేవాడు. కాని ఎక్కువసేపు కూర్చునేవాడు గాదు.

ఒకనాడు సత్యమూర్తికి అన్నం వడ్డిస్తూ అడిగింది జయలక్ష్మి – 'మూర్తీ! ఆ పాడుఉద్యోగం మానెయ్య రాదూ?' అని.

'ఎందుకు మానటం?' అన్నాడు మూర్తి.

'వాళ్లిచ్చేది ముష్టి వందరూపాయలు. మీరు ఆ ఉద్యోగం చెయ్యటం నాకు నామర్దాగా వుంది' అంది మరి రెండు వేపుడుముక్కలు వేస్తూ.

'నేను బీదవాణ్ణి జయా!' అన్నాడు అన్నాన్ని కలుపుతూ.

'నేను బీదదాన్ని కాదుగా!'

'అయితే?' తలెత్తి మొఖంలోకి చూశాడు మూర్తి. జయలక్ష్మి మొఖం క్షణం నల్లబడింది.

''ఇంతలో వున్న దన్నమాట నీ మనసు! సరే అయితే'' నేతిగిన్నె అలమారులో పెట్టే వంకతో అక్కణ్నుంచి వెళ్లిపోయింది.

ఏమైనా సత్యమూర్తిమటుకు ఉద్యోగం మానలేదు.

# 21

సత్యమూర్తికి తన పుట్టినరోజుపండగ చేసుకోవడం ఎప్పుడూ అలవాటు లేదు. కాని, ఇతరుల పుట్టినరోజు పండగలకు ప్రెజంటేషన్సు ఇవ్వడం అతనికి అలవాటే. తనతో కాస్త సన్నిహితత్వంగల మిత్రుడికిగాని, స్నేహితురాలికిగాని ఫలానారోజు పుట్టిన రోజని తెలుస్తే, అవతలి వ్యక్తికి గుర్తులేకపోయినా ఇతగాడే గుర్తుంచుకుని, ఏదో ఒక బహుమతి కొనుక్కెళ్లి ఇస్తాడు. అలాంటి మిత్రుల్లో జయలక్ష్మినికూడా గుర్తుంచుకున్నాడు. ఇప్పుడు ఆమె అతని భార్య అయింది. అయినా గుర్తుంచుకుని ఆమె పుట్టిన రోజు పండుగకు చాలా హడావుడి చేశాడు. రెండువందలు పెట్టి ఎర్రమందారంవంటి కాశ్మీర్ సిల్కుచీరా, నీలం ట్వింకిల్ నైలాన్ జాకెట్టూ కొని తెచ్చాడు. స్వయంగా బజారుకు వెళ్లి ఎర్రగులాబీలు కొనుక్కొచ్చాడు. బర్త్‌డే ప్రోగ్రామ్ పెద్దదే వేశాడు. ఎన్ని చేసినా సత్యమూర్తి ఆప్యాయత జయలక్ష్మిని సంతోషపెట్టలేక పోయింది. దాని కారణం ఏమిటంటే, సత్యమూర్తి ఈ హడావుడి ఎప్పుడూ చేసేదే. ఎవరి విషయంలోనైనా అతడు ఇంత ఆసక్తి ప్రదర్శిస్తాడు. ఇక్కడ తన ఆధిక్యత ఏమీ లేదు. ఆ సంగతి జయలక్ష్మికి తెలుసు.

'ఇది నామీద అతను అనురాగంకొద్దీ చేసేదిగాదు. ఇది అతని అలవాటు. వ్యాపారంతాలూకు మర్యాద.

మైసూరు సిల్కు-ప్యాలెస్ యజమాని ఖాతాదారులకు చేసే మర్యాదకూ, సత్యమూర్తి మన్ననకూ తేడా కనిపించడం లేదు' అనుకుంది. జయలక్ష్మి పొంగిపోతుందని సత్యమూర్తి అనుకోలేదు. తనతో చదువుకున్న ఇద్దరు స్నేహితు రాండ్రను మాత్రం పిలిచింది. మూర్తి అయిదారుగురు మిత్రుల్ని ఆహ్వానించాడు. జయలక్ష్మి తప్ప అందరూ బిగ్గరగా మాట్లాడుకుంటూ, సందర్భంతో నిమిత్తం లేకుండా నవ్వుతున్నారు. అంతమందిలో వున్నా జయలక్ష్మి మనసు మాత్రం ఏకాంతాన్ని వదిలిపెట్టలేదు. తలనిండా స్నానం చేసింది. మూర్తి తెచ్చిన చీర కట్టుకుంది. వదులుగా వేసు కున్న జడలో రెండు గులాబీలు తురిమింది. తిలకం సన్నగా దోసగింజలాగ దిద్దింది. శరీరం మూన్ లైట్ విద్యుద్దీపాల కాంతిలో మెరుస్తూంది. ఆరోజు జయలక్ష్మి చాలా అందంగా వుంది.

డిన్నర్‌కు కావల్సినవన్నీ మూర్తి వంటమనిషి చేత దగ్గరుండి చేయించాడు. జయలక్ష్మికి వంకాయలు కాయల పాళాన వండిన గుత్తికూర ఇష్టం. ఆరోజు స్వయంగా సన్నటి లేతవంకాయలు ఏరి తెచ్చి ప్రత్యేకంగా పురమాయించి కూర వండించాడు. డిన్నర్‌కు లేవబోతుండగా ఓ చిన్న కారు వచ్చి గేటుముందు ఆగింది. అందరూ అటు చూశారు. ఒక స్త్రీ అందులోంచి దిగి వయ్యారంగా నడుచుకుంటూ వచ్చింది. 'హలో! సుశీలా!' అంటూ మూర్తి ఆమెను ఆహ్వా నించి, 'మా డైరక్టరుగారి భార్య' అంటూ అందరి పరి

చయం చేశాడు. సన్నగా పొడుగ్గా వుంది సుశీల. శరీరం మీద మేలిమి బంగారం మెరుగుంది. పొడుగ్గా వున్నట్టు కనిపిస్తుందిగాని, పెద్దపొడుగుగాదు. వంకీలజుట్టును రెండు పాయలుగా తీసి చుట్టచుట్టింది. నవ్వితే అందం కురుస్తోంది. పల్చటి బుగ్గలు, ముక్కు, గడ్డం కోణం తేలివున్నాయి. నోరు చిత్రంగా వెక్కిరిస్తున్న చంటిపిల్ల మూతిలాగ వుంది. జయలక్ష్మి కేసి రెండుక్షణాలు తదేకంగా చూసి, 'మిమ్మల్ని చూడాలని చాలారోజులనుంచి అనుకుంటున్నాను. ఇవాల్టికి మీరు పిలవకపోయినా రాగలిగాను' అంది.

సుశీల ఎంతో చనువుగా మాట్లాడుతోంది. అది అందరికీ సాధ్యమయేది గాదు. అందరికీ చేతనైన విద్యా గాదు. కొందరిలో ఆసక్తి వుంటుంది. పరిచయమైన పది క్షణాల్లో ఆత్మీయుల్లాగ మారిపోతారు. అదొక చిత్రమైన ఆకర్షణశక్తి. అనిర్వచనీయమైన వ్యక్తిత్వం. సుశీల ఏదో మాటాడుతూంది. నవ్వుతూంది. ఆమెరాకతో వాతావరణమంతా విద్యుత్ ప్రసారం జరిగినట్లయింది. లకిలా నవ్వుతుంది. హాస్యంగా ఒక మాట విసురుతుంది. వ్యంగ్యంగా ఒక బాణం విసురుతుంది.

అనతికాలంలోనే సుశీల ఆ పార్టీలో అతిప్రధానవ్యక్తి అయింది. జయలక్ష్మి, ఆమెఇద్దరు నేస్తాలూ, ఏదో మర్యాదకోసం మధ్యమధ్య సంభాషణలో పాల్గొంటున్నారు గాని అంత ఉత్సాహకరంగా లేదు. జయలక్ష్మి ఒకక్షణం ఆలోచనలలో మునిగిపోయింది.

'మనుష్యు లింత సంతోషంగా ఎట్లా వుండగలుగు

తారు ? ఈ సుశీలకు బాధ లేం లేవా ? భర్త అంత అనుకూలుడా? ... లా నవ్వుతుంది. చిరుగాలిలా కదులుతుంది. చిత్రంగా మాట్లాడుతుంది. నూటికి నూరుపాళ్లా జీవితాన్ని అనుభవిస్తుంది. ఆమెకళ్ళు ఎప్పుడూ చెమ్మగిల్లవా ?' అనుకుంది. ఆమె వున్న కాసేపూ అసూయ లాంటి అనుభూతిని పొందింది.

పార్టీ అయిపోయింది. ఒకరొకరే సెలవుతీసుకుని వెళ్ళిపోతున్నారు. చివరకు సుశీలగూడా సెలవుతీసుకుంటూ, 'మాఇంటి కొకసారి రండి' అని ఆహ్వానించింది. సుశీలను దిగబెట్టివస్తానని సత్యమూర్తి కూడా వెళ్లాడు. జయలక్ష్మికి సుశీలమీద సదభిప్రాయం కలగలేదు. మూర్తికీ, సుశీలకూ ఏమిటి సంబంధం? పై ఆఫీసరుభార్య అయితే మాత్రం అంత చనువు ఎక్కణ్ణుంచి వచ్చింది? మూర్తి ఎన్నడూ ఈ సుశీలగురించి చెప్పలేదు. ఎందుకు తనదగ్గర దాచాడు? అర్థంకాని ప్రశ్నలతో తల దిమ్మెక్కిపోయింది. తన గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని తెల్ల గ్లాస్గోచీర కట్టుకుని మంచంమీద వాలిపోయింది. ఎంత ప్రయత్నించినా నిద్రరా లేదు. మూర్తికోసం ఎదురుచూస్తూ కూర్చుంది. గడియారం పదిగంటలు కొట్టింది. మూర్తిరాలేదు. ఎక్కడికి వెళ్లాడు ? కాలింగ్ బెల్ మ్రోగింది. మూర్తి వచ్చా డనుకుంది. వంటమనిషి తలుపు తీసింది. పైకి వచ్చిన వ్యక్తి సత్యమూర్తి కాదు. అతను నర్సింహమూర్తి. తల్లి పోయినతరువాత వెళ్లిన మనిషి కనిపించటం ఇదే మొదటిసారి. నర్సింహమూర్తిమీద జయలక్ష్మికి ఎంత

గౌరవం వుందో, అంత ఏవగింపూ వుంది. ఎంత అభిమాన ముందో, అంత ద్వేషమూ ఉంది. అతను ఎన్నడూ తనతో చనువుగా మాట్లాడలేదు. అసలెక్కువగా మాట్లాడటం అతని స్వభావం గాదు. అప్పుడప్పుడు ఇంటికి వచ్చేవాడు. ఆ ఒకటి రెండురోజులూ మేడ దిగేవాడు గాదు. ఎలా వచ్చేవాడో అలాగే చల్లగా మాయమైపోయేవాడు. వెళ్ళేటప్పుడుమాత్రం 'వస్తానమ్మా' అని ఒక్కమాట అనేవాడు ఆ ఒక్కమాటలో ధ్వనించిన వాత్సల్యం మధురనాదమై, బుసలుకొడుతున్న తన మనస్సును చల్లబరిచేది.

నర్సింమూర్తి ఎప్పుడు వచ్చినా ఒకే గదిలో వుంటాడు. అతనికోసం ప్రత్యేకంగా ఆగదిలోనే లెవేటరీ, బాత్ రూమ్ కట్టించింది బాలాంబ. తల్లి చనిపోయిం తరువాత ఆ గదికి తాళం వేసింది జయలక్ష్మి. మళ్ళీ ఎన్నడూ తెరవలేదు. నర్సింమూర్తి ఇప్పుడు ఆ గదికేసి వెడుతున్నాడు.

'ఆ గది బాగుండలేదు. నా గదిలో వుండండి' అంది జయలక్ష్మి. 'ఫర్వాలేదమ్మా! తాళంచెవ్వ లిలా ఇయ్యి' అంటూ చెయ్యిజాపాడు. జయలక్ష్మికి ఎదురు చెప్పాలనిపించలేదు. అతను తాళం తీసుకుని గదిలోకి వెళ్ళాడు. గది పెద్దగా బాగుజేయాల్సిందేమీ లేదు. అక్కడక్కడ కొంచెం దుమ్ముమాత్రం వుంది. పక్క మీంద పరిచిన ఇస్త్రీదుప్పటి మడత నలగలేదు. నర్సింమూర్తి గదిలోకి వెళ్ళి తలుపు గడియవేసుకున్నాడు. జయలక్ష్మి లైటు తీసేసి పడుకుంది. అంతలో మళ్ళీ బెల్

మ్రోగింది. లేచి తలుపు తీసింది. సత్యమూర్తి వచ్చాడు. మనిషి తూలుతున్నాడు. కళ్లు ఎర్రబడి జ్యోతుల్లాగ వెలుగుతున్నాయి. పెదిమలు వంకరతిరిగి వణుకుతున్నాయి. జయలక్ష్మికి విషయం అర్థం అయింది. అతను ఇప్పుడేం మాట్లాడినా అర్థంచేసుకునే స్థితిలో లేడు. మూలగా పడుకున్న నౌకరును లేపి వరండాలో పక్క వేయించింది. 'నేను ఆ గదిలోనే పడుకుంటాను' అని మొరాయించాడు సత్యమూర్తి. వీల్లేదంది జయలక్ష్మి. సత్యమూర్తి రెచ్చిపోయాడు. పిచ్చికేకలు పెట్టాడు. అశ్లీలాలు మాట్లాడాడు. ఆమె వప్పుకోలేదు. అతనిమీద అసహ్యం పెరిగింది. సత్యమూర్తి గదిలోకి వెళ్ళడానికి ప్రయత్నించాడు. జయలక్ష్మి అడ్డుగా నిలబడింది. అతను పెద్దపెద్ద కేకలు పెడుతూ, బూతులు తిడుతూ పెనుగులాడాడు. మత్తు అప్పటికే తలకెక్కి, వివేకాన్ని, విచక్షణాజ్ఞానాన్ని నాశనం చేసింది. ఆమె ఎదురుతిరిగింది. సర్వశక్తులూ కేంద్రీకరించి అతన్ని బయటకు తోసింది. సత్యమూర్తి తూలి క్రిందపడ్డాడు. తలకు మంచంకోడు తగిలి నెత్తురు చిమ్మింది. జయలక్ష్మి తలుపు 'ఫెడేల్'మని వేసింది. నర్సింహమూర్తి ఈ అల్లరంతా విన్నాడు. కాని గదిలోంచి బయటికి రాలేదు.

# 22

మర్నాడు ఉదయం తొమ్మిదిగంటలదాకా జయలక్ష్మి తలుపు తియ్యలేదు. వంటమనిషి వచ్చి తలుపు

తట్టింది. వరండాలో వున్న ఖాళీమంచం చూసి 'ఆయనేరీ?' అని అడిగింది జయలక్ష్మి.

'హాస్పిటల్‌కు వెళ్లారమ్మా!' అంది వంటమనిషి. ఎందుకని అడగవలసిన పనిలేదు. ఎందుకో తనకు తెలుసు. నెత్తురుమరకలు దుప్పటికి అక్కడక్కడ అంటాయి. గాయం బాగా బలంగా తగిలిందా? తను తొందరపడ్డదేమో ననిపించింది. కాని, అతన్ని ఆ సమయంలో ఒక్కక్షణంకూడా భరించలేదు. మూర్తి తరచు చెప్పే సూక్తులలో ఒకటి మధువునుగురించి, 'ధనమూ, మధువూ, మదవతీ ఈమూడూ మనిషినుంచి సుఖాన్ని పిండే శక్తులు' అనేవాడు. పెళ్లయిన కొత్తలో ఓసారి ఓ బుడ్డి ఇంటికి తెచ్చాడు. అప్పుడు మధువునుగురించి ఎంతో దీర్ఘంగా, గంభీరంగా, సిన్సియర్‌గా ఉపన్యాసం చేశాడు. 'ఏం మనిషి' అనిపించింది.

'మధువంటే అమృతం. నీ బాధలూ, నీ బరువులూ నీకు దూరంచేసి, నరకద్వారాలను మూసి, స్వర్గద్వారాలను తెరిపించే అమరశక్తి మధువు. జరను జయించే యవ్వనం మధువు. విషాదాన్ని భస్మంచేసే ఆనందస్వరూపం మధువు. మండుటెండను వెన్నెలగా మార్చేదీ, మురికికూపాన్ని బృందావనంగా చేసేదీ ఈ మధువే. సౌందర్యశిఖరాల కెక్కించేదీ, ఆనందసాగరాల నోలలాడించేదీ, కాలాన్ని బంధించేదీ, జీవితరహస్యాలను ఛేదించేదీ ఈ అమృతరసం. అది సేవించి ఇద్దరం రెక్కలు గట్టుకొని, మబ్బుల్ని దాటి, చుక్కల్ని దాటి, మరో విచిత్రలోకాల కెగిరిపోదాం' అనేవాడు. జీవితాన్నిగురించి సత్యమూర్తి

  

గున్న అభిప్రాయం ఒక్కటే! సుఖపడటానికే బ్రతకాలి. సుఖం లేకపోతే చావాలి. ధర్మం, నీతి, సంఘం, వివాహం, అనుబంధాలూ అన్నీ భ్రమలు. మనిషిని బంధించే గొలుసులు. బాధించే పిచ్చికుక్కలు.

కొత్తలో ఈ ఉపన్యాసాలు జయలక్ష్మికి సరదాగానే వుండేవి. విన్నకొద్దీ వినా లనిపించేవి. ఆలోచించేకొద్దీ ఆలోచించా లనిపించేది. కాని కొంతకాలానికి వెగటు పుట్టింది. పరమనీచంగా, వికృతంగా, జుగుప్సాకరంగా అనిపించసాగాయి. వివాహబంధం కృత్రిమమైతేనేం? ఎంత ఉదాత్తత, నైతికప్రతిపత్తి అందులో వుంది! క్షణం సుఖంకోసం ఏకంకావలసిన స్త్రీపురుషుల్ని శాశ్వతంగా ఏకంచేసి, భవిష్యజ్జీవితాలు ఒకదాని నొకటి పెనవేసుకోగా, సుఖాలనూ, ఆనందాలనూ, ఆశయాలనూ, గౌరవాలనూ, అవమానాలనూ ఏకంచేసి పంచి, రెండు శరీరాలలోనూ ఒకే ఆత్మజ్యోతిని వెలిగింపజేసే మహావ్యవస్థ ఈ వైవాహిక బంధం. ఈ బంధమే లేకపోతే ఈ ప్రపంచం ఎలా వుండేది? ఈ మమకారాలూ, ఈ పుత్రోత్సవాలూ, వియ్యాలూ, విందులూ, వేడుకలూ, బంధుత్వాలూ ఏమయ్యేవి? సత్యమూర్తి ఆలోచనలు ఎంత భయంకర పరిణామాలకు దారితీయగలవో జయలక్ష్మికి తెలుసు. కార్యాచరణకు బీజం ఆలోచన. వృక్షస్వరూపాన్ని నిర్ణయించేది బీజమే. సత్యమూర్తి ఆలోచనలే తమ జీవితాలను నిర్ణయిస్తే? భయంతో జయలక్ష్మి వళ్లు జలదరించేది. సత్యమూర్తితో

వాదించడం. అతని మనసులో పరివర్తన సాధించడం ఎంత అసంభవమో ఆమె తెలుసుకుంది.

ఆలోచనలోనే జయలక్ష్మి మొఖం కడుక్కొని, కాఫీ తాగివచ్చి తన గదిలోకి వెళ్ళి ఈజీ చైర్‌లో కూలబడింది. బారులుతీర్చిన పక్షులు కిచకిచలాడుతూ దిగంతాలకు ఎగిరి పోతున్నాయి. ఇంకా దూరంగా, ఎత్తుగా ఓ గ్రద్ద నిలకడగా ఎగురుతూంది. రెక్కలు ఆడించకుండా గాలిలో ఎగురుతున్నట్టుగా వుంది. రెక్కలు ఆడించకుండా అది ఎలా ఎగరంగలుగుతూంది? తను సుఖశాంతులు లేకుండా జీవించడంలా! అలాగేనేమో! కిటికీలోంచి అలాగే నీలాకాశంలోకి చూస్తూ కూర్చుంది.

'వెళ్తున్నానమ్మా!'

అనేకసార్లు విన్న అదే వాత్సల్యపూరితమైన గొంతు వినిపించగానే ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది.

'మీరా!'

నర్సింమూర్తి రెండడుగులు వేసి మళ్లీ వెనక్కి తిరిగాడు. 'చూడు తల్లీ! నీవంట్లో ఎలా వుంటోంది?'

నర్సింమూర్తిని గురించీ, అతని సౌకర్యాల గురించీ పని మనిషికిగాని, వంటమనిషికిగాని తాను ఏ ఆదేశాలూ ఇవ్వలేదు. ఇవ్వవలసిన అవసరమూ లేదు.

'ఆరోగ్యంగానే వుందండీ! రండి. కూర్చోండి.'

'రాత్రి జరిగిందంతా చూశానమ్మా!' కూర్చుంటూ అన్నాడు.

నర్సింమూర్తి చూశాడని ఆమెకూ తెలుసు.

'చూడు తల్లీ! మీ దాంపత్యం బాగుంటుం దను కొన్నాను. కాని, ఇంత ద్వేషంతో, నిర్లక్ష్యంతో ఎలా బ్రతుకుతున్నారా అనిపిస్తూంది.'

'పోన్లెండి. ఆ విషయం గురించి ఇప్పుడు మాట్లాడటం అంత అవసరంగా దనుకుంటాను', మొఖం చిట్లించింది.

'లాభ మున్నా లేకపోయినా నీ విషయం పూర్తిగా తెలుసుకోవాల్సిన అవసరం నా కున్నది. నీకు శుభం కలిగే పని నేను చేయగలిగితే—'

జయలక్ష్మి తలెత్తి నర్సింమూర్తి మొఖంలోకి చూసింది. పళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకినట్లయింది.

'క్షమించండి. మీ అభిమానానికి కృతజ్ఞురాలిని. కాని దిక్కుమాలిన ఈ లోకంలో నా మేలుకోరేవా ళ్లెవరో నా వినాశం కోరే వా రెవరో నాకు అంతు చిక్కడం లేదు. ఎవరికి వారే నా హితవుకోరుతున్నట్టు మాట్లాడు తారు. ఎవరికి వారే నాకు సహాయం చేస్తున్నట్టు నటిస్తారు. కాని, అందరూ నన్ను హింసిస్తున్న వారే. నా గురించి దుష్ప్రచారం చేసేవాళ్ళే. ప్రపంచమంతా ఏకమై, పగపట్టి నన్ను సాధిస్తున్నది.' జయలక్ష్మి కళ్ళనుంచి నీరు జల జలా రాలింది.

'చూడమ్మా! నువ్వేదో వళ్ళు తెలియని బాధతో మాట్లాడుతున్నావు. నీ బాధ ఎంత భయంకరమైనదో నేను తప్ప లోకంలో ఎవరూ తెలుసుకోలేరమ్మా. ఒక్కటడుగు తాను చెప్పమ్మా!'

'అక్కర్లేదండీ! మీ రేదీ అడగొద్దు. నే నేమీ చెప్ప

లేను. ఈ జీవితంలో ఎంత అలిసిపోవాలో అంత అలిసి పోయాను. ప్రపంచానికి నన్ను కట్టిన ఏదో అజ్ఞాతబంధం తెగిపోయింది, తాడు తెగినగాలిపటం లాగ ఎగురుతున్నాను. గాలి రేగినంతకాలం ఎగిరి ఎక్కడో రాలిపోతాను. మీరేం చేసినా ఈ పగిలిన భాండాన్ని అతికించలేరు!'

'తల్లీ! నీ కంటే నే నెక్కువ బాధపడుతున్నాను. నా బాధ నీ కర్థం గాదమ్మా! నీ కాశ్చర్యంగా వుంటుంది. కాని, ఒకానొక జీవిత రహస్యంవల్ల నువ్వే ఈ నాడు నాకు మిగిలిన సర్వస్వమూ అయావమ్మా!'

నర్సింమూర్తిగారూ! నన్ను హింసించకండి. అవమానాలతో, లజ్జతో ఇప్పటికే క్రుంగి కృశించిపోయాను.'

'నే చెప్పే—'

'దయుంచండి, మీరేమీ చెప్పనవసరం లేదు. మీరు చెప్పేది ఏదైనా కానీండి. కాని–నాకు వినాలని ఉత్సాహం లేదు. నా మనస్సు బాగుండలేదు. నన్ను వంటరిగా వుండనియ్యండి.'

'అలా కాదమ్మా! నేను కన్ను మూసేలోగా నే నీ విషయం నీతో చెప్పకుండా వుండటానికి వీల్లేదు. మరోసారి వస్తాను. ఇప్పుడు మాట్లాడి ప్రయోజనం లేదు.'

నర్సింమూర్తి లేచి వెళ్ళిపోయాడు. జయలక్ష్మి మొఖాన్ని అరచేతుల్లో దాచుకుంది. రంపంతో కోస్తున్నట్టు, తడిగుడ్డను పిండినట్టు దుర్భరవిషాదంతో ఆ స్త్రీ హృదయం క్షోభించింది. వెడుతూ కళ్ళు తుడుచుకుంటున్న నర్సింమూర్తిని చూసి మనసు వికలమైపోయింది. 'తండ్రీ!

నువ్వు చెప్పదలుచుకుం దేమిటో నాకు తెలుసు. కాని, నా జీవితం అలా వుంది. తల్లిని ప్రేమించలేక పోయాను. పతిని ప్రేమించలేక పోతున్నాను. కన్నతండ్రిని ప్రేమించ లేను. ప్రేమించే శక్తి ఈ నికృష్ట హృదయానికి లేదు. ప్రేమించ లేని జీవితం కంటే వికృత మేముంది సృష్టిలో ?' అంటూ విలపించింది. ఆ కన్నీటికి లోకంలో గౌరవం లేదు. దయా దాక్షిణ్యాలనూ, సానుభూతినీ సాధించలేని మాలిన్య సంకలితమైన భావాలు. తన మనస్సు విచిత్రంగా మారిపోతున్నది. రోజు రోజూ అది విశృంఖలమై, విషాద నీరదాలను చిలకరిస్తున్నది. తాను ఏడవకుండా జీవించలేనిస్థితి వచ్చింది. ఊపిరి లేక ప్రాణి నశించినట్టు కన్నీరు రాకపోతే తాను రాలిపోతుంది.

నర్సింమూర్తి వెళ్ళిన వేపు శూన్యంగా చూస్తున్న జయలక్ష్మికి సత్యమూర్తి కనిపించాడు. తలమీద తెల్లటి కట్టు కనిపిస్తూంది. సిగరెట్టు పొగ వదుల్తూ, కుంటు కుంటూ వచ్చాడు.

'రాత్రి జరిగిందానికి చాలా విచారిస్తున్నాను జయా! క్షమించు' అన్నాడు.

జయలక్ష్మి మాట్లాడలేదు. అది అతను హృదయపూర్వకంగా చెప్పిన క్షమాపణ గాదు. అంతటి ఉదాత్తత అతని హృదయానికి లేదు. కేవలం లాంఛనప్రాయంగా నకిలీ సరుకు లమ్మే వర్తకుడు పట్టుబడినప్పుడు చెప్పే క్షమార్పణ వాక్యాల్లా కలుషితంగా అతని నోట్లోంచి వెలువడ్డాయ్!

'నిన్ను క్షమించే హక్కు నాకు లేదు మూర్తీ! నిన్నెప్పుడు వివాహం చేసుకుంటానికి అంగీకరించానో, అప్పుడే నా సర్వశక్తులూ నీరసించాయి. నిన్ను క్షమించే శక్తి భగవంతుడికే వుంది' అని అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది. నర్సింమూర్తి ఖాళీచేసి వెడ్తూ గది తాళాలు వేయలేదు. ఆ గదిలో తాను అడుగుపెట్టి చాలా కాలమైంది. ఆ గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకు పడుకుంది. ఆ గదిలోని ప్రతి వస్తువూ తల్లినే గుర్తు చేస్తూంది. ఆ నల్ల చెక్క పందిరి మంచం, బూజుపట్టిన బీర్వా, మసకగా కనిపిస్తున్న బీర్వాలో నిలువుటద్దం, బాలాంబ వాడే ట్రంకులూ అన్నీ తల్లినే గుర్తు చేస్తున్నాయి. గబుక్కున లేచి బీర్వా తెరిచింది జయలక్ష్మి. పది పదిహేను చీరలు క్రమం తప్పి పడున్నాయి. చీరల అడుగున నగలపెట్టె కనిపించింది. ఆ పెట్టెలో తల్లి తాలూకు నగలున్నాయేమో! తా నెన్నడూ చూడలేదు. నగల మీద, చీరలమీద అందరు స్త్రీలకూ వుండే మమకారం తనకు లేకపోయింది. నగలపెట్టె తెరిచింది. అందులో చిన్న ఆల్బం వుంది. పేజీలు తిరగేసింది. మొదట బాలాంబ చిన్నతనంలో దిగిన ఫోటో. బుట్టజాకెట్టు తొడుక్కుని జూకాలు పెట్టుకుంది. చిన్నతనంలో తన తల్లి తనలాగే వుండేది గాబోలు! రెండో ఫోటోలో బాలాంబ ప్రక్కన ఒక పురుషుడు వున్నాడు. అతన్ని పోల్చుకోగలిగింది. అతను నర్సింమూర్తి! పాతికేళ్ళ వయసులో వున్నప్పటి ఫోటో! ఇద్దరూ కలిసి దిగినవి ఇంకా అయిదారు ఫోటోలు దొర్లాయి. ఆ తర్వాత ఫోటోలో ఓ పసిపాప వాళ్ళిద్దరి మధ్యా వుంది.

ఆల్బం అంతా తిరగేసింది. తక్కిన అన్ని ఫోటోల్లోనూ ఆ మూడు బొమ్మలే. ఆ ముగ్గురి జీవితాలకూ తక్కిన ప్రపంచంతో సంబంధం లేనట్టుంది. ఆల్బం మూసింది. నగల పెట్టెలో నల్ల ఫోటో పేపరుతో చుట్టబడిన మరో పార్సిలు కనిపించింది. అది ఉత్తరాల కట్ట. నర్సింమూర్తి బాలాంబకు వ్రాసినవి. అన్ని ఉత్తరాలూ చదివే ఓపిక లేక నాలుగెదు తిరగేసింది. అందులో ఒకటి.

'బాలా!

మనం పవిత్రంగా, అన్యోన్యంగా ఒకరికోసం మరొకరం బ్రతుకుతున్నప్పుడు పెళ్ళెందుకు అంటూ వ్రాశావు. కాని, పెళ్ళి లోకానికి కావాలి. ప్రపంచంలో గౌరవంగా బ్రతకడానికి కావాలి.........'

రెండోది—

'బాలా!

మన పాపకు జయలక్ష్మి అని పేరుపెట్టు. అది నాకు నచ్చిన పేరు. నా కోసం పోలీసులు తిరుగుతున్నారు. నేనేమీ తప్పు చెయ్యలేదని నీకూ తెలుసు. కాని, వెంగళ్రావుతో స్నేహంగా వుండటంవల్ల వాళ్ళు నన్ను అనుమానిస్తున్నారు. అందుకు నేను కొన్నాళ్లు రంగూన్ వెళ్ళాల్సి వచ్చింది. నాలుగు నెలల్లో తిరిగి వస్తాను. కలప వ్యాపారంలో మొన్న డెబ్భయివేలు మిగిలింది. ఆర్నెల్ల వ్యాపారానికి అది పెద్ద మొత్తమే! హైదరాబాదులో ఇల్లు కొనుక్కోవాలంటే నా కభ్యంతరం లేదు......'

మూడోది—

'బాలా!

వెంకట్రావుగారికీ నీకూ సంబంధం చెప్పుకుంటు న్నారా? చెప్పుకోనీ...నీ మనస్సు నాకు తెల్సినప్పుడు నువ్వు బాధపడట మెందుకు? అతను నిన్ను తోబుట్టువు కంటే ఎక్కువగా చూసుకుంటున్నాడని నాకు తెలుసు. ఆ విషయానికై నువ్వు మనసు పాడుచేసుకోకు. ఇప్పుడే రెక్కలు కట్టుకుని నీ ముందు వాలాలని వుంది. కాని మానవ మాత్రుణ్ణి-ఏం చెయ్యను?'

ఉత్తరాలన్నీ ఇలాగే వున్నాయి. అన్నీ చదువలేదు. చదవా లనిపించనూ లేదు. అంతలో పనిమనిషి ఉత్తరం తెచ్చి ఇచ్చింది. చించి చూసింది. అది బుల్లి రెడ్డి వ్రాసింది.

'జయలక్ష్మిగారూ!

నన్ను మరిచిపోయి వుండ రనుకుంటా. నన్ను ఉరి తీయడానికి తీసుకు వెడుతున్న సమయంలో తెగించి, తప్పి చుకు బయటపడ్డాను. త్వరలో మిమ్మల్ని కలుసుకోవాలని వుంది. మిమ్మల్ని చూడాలనే తప్పించుకున్నాను. ప్రస్తుతం నేను ఎక్కడ వుందీ చెప్పలేను

హంతకుడు—బుల్లి రెడ్డి.'

# 23

తనకున్న ఐశ్వర్యం మీదగాక స్త్రీకి సంఘంలో ప్రతిపత్తి భర్తమీదనే పూర్తిగా ఆధారపడి వుంటుంది. భర్తచేత తిరస్కరింపబడిన స్త్రీని లోకం వంచిస్తుంది. అవమాని

స్తుంది. హింసిస్తుంది. ఈ విషయం జయలక్ష్మికి తెలిసినట్లు లోకంలో మరో స్త్రీకి తెలియదేమో! సత్యమూర్తి సమ్మ దగ్గవాడు గాదనీ, మోసగాడనీ జయలక్ష్మి పెళ్ళి జరిగిన కొద్దిరోజుల్లోనే గ్రహించింది. కాని, అతను తన భర్త! విడదీయరాని బంధం తమ జీవితాలను ఏకం చేసింది. ఆ అనుబంధంపై సత్యమూర్తికి గౌరవం కాని, మక్కువ కాని వున్నట్లు కనిపించడం లేదు. ఆ విషయం అతడు ఎన్నడూ చెప్పలేదు. ఉద్రిక్తంగా కాని, ఆగ్రహావేశాలతో గాని మాట్లాడటం సత్యమూర్తి నైజం కాదు. కాని, అతని మంచి తనమే జయలక్ష్మిని బాధ పెడుతూంది. తను ఏం చెప్పినా ఎదురుచెప్పడు. అంతులేని వినయవిధేయతలు ప్రకటిస్తాడు. అదంతా నటనేనని ఆమెకు తెలుసు. భర్తగా తనని ఆజ్ఞా పించవచ్చునే! ఈ ఇంటియజమానిగా నాసర్వస్వాన్నీ పాలిం చవచ్చునే! ఒకే ఇంట్లో వుంటున్నా మానసికంగా సత్య మూర్తిని దగ్గరకు తెచ్చుకోలేక పోయింది జయలక్ష్మి.

అనుకోకుండా ఒకనాటి మధ్యాహ్నం శేషాద్రి జయ లక్ష్మి ఇంటికి వచ్చాడు. బి.డి.ఒ. సెలెక్షన్‌కు ఇంటర్వ్యూకు పిలిచారట! శేషాద్రిని చూడగానే ప్రాణం లేచివచ్చిన ట్లనిపించింది జయలక్ష్మికి. సాదరంగా ఆహ్వానించింది. ఎన్నో సంగతులు మాట్లాడుకున్నారు. చచ్చిపోయిన ఆనంద మూర్తిని గురించీ, చావబోతున్న బుల్లిరెడ్డినిగురించీ, బ్రతి కున్న భీమారావు ప్రభృతులను గురించీ ఎన్నో కబుర్లు దొర్లాయి. ఇంక వెళ్తానంటూ లేచాడు శేషాద్రి.

'అదేమిటి శేషాద్రీ! ఎవరో పరాయి వాళ్ళింటికి

వచ్చినట్టు చెప్పుల్లో కాళ్ళుపెట్టుకు కూర్చున్నావ్?' అంది జయలక్ష్మి బాధగా.

'పనుంది జయలక్ష్మీ! వెళ్ళాలి.' చిన్నగా నవ్వాడు.

'సత్యమూర్తి ఆఫీసునుంచి వచ్చే వేళైంది. చూసి వెడుదువుగాని వుండు' అంది జయలక్ష్మి.

'అతనంటే నా కసూయ.'

'ఎందుకు శేషాద్రీ?' అంది నవ్వుతూ జయలక్ష్మి.

'నీలాంటి దేవతను పొందగలిగాడు గనుక.'

'అయితే?'

'నీ కౌగిట్లో స్వర్గసుఖాలను చవిచూస్తున్నాడు గనుక!'

'బావుంది!'

'నీ అమృతహస్తాల్లో అతను మరణిస్తాడు. నీ కళ్ళ నుంచి అమృతం అతని నుదుటిమీద రాలి, అతని ఆత్మకు స్వర్గద్వారాలు తెరుస్తుంది.'

జయలక్ష్మి తీవిగా నవ్వింది. గుండెల్లో క్షణకాలం యవ్వనం పొంగి, బరువుగా ఊపిరి విడిచింది. బుగ్గలు ఎర్రబడ్డాయి. పెదవులు వణికాయి. కళ్ళు చెమ్మగిల్లాయి.

'మా ఆయన అలా అనుకోవడం లేదు శేషాద్రీ!'

'ఎందుకని?'

'అది మనుష్యుల స్వభావం.'

'అవును! దేవతల మంచితనాన్ని గుర్తించాలంటే, విశాల హృదయం వుండాలి!'

'శేషాద్రీ! ఒక సత్యం చెపుతున్నాను విను. నేను

నీకు భార్య కానంతవరకే నామీద నీకలా కవిత్వం చెప్పా లనిపిస్తుంది. నీకేగనక భార్యనైతే బోరనిపిస్తుంది. చిరాకు వేస్తుంది.'

'వెయ్యదు. నే నలాంటివాణ్ణి గాదు.'

'నువ్వో మనిషివేగా?'

'అయితే నువ్వు చెప్పే దేమిటి?'

'పరాయివాడి భార్య అందం పదింతల ఆకర్షణ కలి గిస్తుంది అంటున్నా!'

సత్యమూర్తి ఆఫీసునుంచి వస్తూ ఈ మాటలు విన్నాడు. భర్తకు శేషాద్రిని పరిచయం చేసింది జయలక్ష్మి. ముక్తసరిగా, మర్యాదగా మాట్లాడి తన గదిలోకి వెళ్ళి పోయాడు సత్యమూర్తి.

'జయలక్ష్మీ! మీ ఆయనకు నీ మీద కోపం వచ్చిం దేమో!'

'ఎందుకు?'

'తన భార్య ఇంకొక పురుషుడితో స్నేహంగా వుండటం ఏ భర్తా సహించడు.'

'అదా! కాని, నా కా అదృష్టం లేదు శేషాద్రీ!'

'అంటే?'

'ఏమిటో ఆ తత్వం నా కర్థం కావడం లేదు. నేను పూర్తిగా తనకే కావా లనే భర్త లభించాలని కోరు కున్నాను. కాని—'

'ఊఁ, కాని—'

'తనకు నా మీద ఏమీ అధికారం లేనట్టు తప్పుకు

తప్పుకు తిరుగుతాడు. నే నెలా తిరిగినా, ఎవరితో మాట్లాడినా తన కేమీ సంబంధం లేనట్టు ప్రవర్తిస్తాడు. మొన్న ఆయన లేకుండా పక్కింటివాళ్ళతో రెండో ఆట సినిమాకు వెళ్లాను. వచ్చాక కనీసం 'ఎక్కడికి వెళ్లా'వనన్నా అడగ లేదు.'

'తమాషాగా వుంది జయలక్ష్మీ!'

'చూసేవాళ్లకు తమాషాగానే వుంటుంది శేషాద్రీ!' అంది బాధగా.

'అబ్బే! నా అభిప్రాయం అది గాదు జయలక్ష్మీ! అది అతని మంచితనం అవొచ్చు. దాన్ని నువ్వు అపార్థం చేసుకుంటున్నావేమో!'

'ఏమో మరి! కాని స్త్రీకి కొన్ని సహజలక్షణాలు వున్నాయి. తనకంటే అధికుడైన భర్త అధికారానికి లొంగి జీవించినప్పుడే స్త్రీజీవితానికి సుఖశాంతు లుంటాయి. బహుశా ఇది ఆడదానిలో బలహీనతేమో!'

'ఇంక వెళ్తాను జయలక్ష్మీ!'

జయలక్ష్మి వంటరితనాన్ని భరించ లేక పోతూంది. తృణమో కీటకమో తోడులేకుండా మానవుడు వంటరిగా జీవితపథం పయనించలేడు. దానికి కారణం మానవస్వభావంలో వుంది. ఒక వ్యక్తి బాధ మరొకరితో పంచుకొంటే, సగమవుతుంది. ఆనందాన్ని పంచుకుంటే రెట్టింపు అవుతుంది. అందుకే మానవుడు కష్టాన్నయినా సుఖాన్నయినా వంటరిగా భరించలేడు.

'వెళ్ళకు శేషాద్రీ! ఇవ్వాళ నా [illegible]

రీతంగా బాధపడుతూంది. దిగులుగా బెంగగా వుంది. మా అమ్మ గుర్తుకొస్తూంది. బ్రతికినన్నాళ్ళూ ఆమె విలువ అర్థం కాలేదు. ఈనాడీ లోకంలో నాకు ఆత్మీయు లెవరూ లేరనిపిస్తూంది.' జయలక్ష్మి కళ్ళనుంచి జలజల కన్నీరు రాలింది.

శేషాద్రి జాలితో, బాధతో, అనురాగంతో నిరుత్తరు డయ్యాడు. జయలక్ష్మి నోటివెంట వినే అమంగళకరమైన మాటలు వినలేక పోయాడు. ఆ హృదయం ఎందుకు బాధ పడుతున్నదో, ఆమె జీవితాన్ని శోకభరితం చేసిన జీవిత రహస్యం ఏమిటో అతనికి అర్థం కాలేదు. ఈ లోకంలో జయలక్ష్మి కంటే బాధ పడుతున్నవారు చాలా మంది వున్నారు. ఈ విశాలప్రపంచంలో హీనంగా, దీనంగా, జుగుప్సాకరంగా బ్రతుకుతున్నవారు ఎంతమందో వున్నారు. జయలక్ష్మికి సమస్య లుండవచ్చు. కాని, అంతగా క్రుంగి, నీరసించి నిస్సారమై పోవడానికి బలమైన కారణం మాత్రం కనిపించడం లేదు. ఎందుకో విపరీతంగా నలిగిపోతున్న దా జవ్వని మనస్సు. కోర్కెలతో రేగుతూ, సుఖాలపై ఊగుతూ స్వప్నలోకాల్లో విహరించవలసిన మనస్సు దుఃఖంతో క్రుంగుతూ, అవమానాగ్నిలో కాలుతూ పీడకలలు కంటున్నది.

కొందరి జీవితా లంతేనేమో!

గాలి లేకుండా పక్షులు ఎగరలేనట్టు!

నీరు లేకుండా చేపలు బ్రతకలేనట్టు!

విషాదం లేకుండా ఈ రకం మనుష్యులు జీవించలేరేమో! తనే జయలక్ష్మిని పెళ్ళిచేసుకుని వుంటే! క్షణికంగా

మెరిసిన ఈఊహ శేషాద్రిని ఆలోచనలలో ఉక్కిరి బిక్కిరి చేసింది. అంతలో సత్యమూర్తి బట్టలు మార్చుకుని క్రిందికి దిగాడు.

ముఖంలో అదే నిర్లిప్తత! పెదవులపై అదే చిరు నవ్వు!!

ఆ వైఖరి మహాయోగులకూ, పరమకిరాతులకూ మాత్రమే సాధ్యమవుతుంది.

'జయా! నేనొక స్నేహితుడింటికి భోజనానికి వెళ్తున్నా, నా కోసం కనిపెట్టుకు కూర్చోకండి.'

'అదేమిటి మూర్తీ! శేషాద్రి వచ్చాడు. నువ్వూ ఇక్కడే వుంటే, ముగ్గురం కులాసాగా ఇక్కడేభోంచేద్దాం!'

'అలా కాదు జయా! మీరు భోంచెయ్యండి. వాళ్లు నా కోసం ఎదురు చూస్తుంటారు. బాగుండదు.' అంటూ శేషాద్రి దగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు సత్యమూర్తి.

అవమానంతో నీరైంది జయలక్ష్మి శరీరంలోరక్తం.

'చూశావా శేషాద్రీ! ఇలాంటి జంతువు నెక్కడన్నా చూశావా? ఇలాంటి భర్త లభించడం నా పూర్వపుణ్య విశేషం గాదూ! ఈ రాత్రి నువ్వు ఈ ఇంట్లో పడుకున్నా అతనికి చీమగుట్టినట్టయినా వుండదు.'

ఆ మాట లందికాని, అందులో ధ్వనించిన అర్థం తెలుసుకుని, వెంటనే మాట మార్చింది. 'నువ్వు ఆఫీసర్ వి అవుతా వన్నమాట!' శేషాద్రి ఆమాట వినిపించుకోకుండా, 'జయా! ఆయన ఉద్దేశ్యం ఏమిటి?' అన్నాడు.

'అంటే?'

'మ న్నిలా వదిలిపోవటం?'

'చెప్పానుగా! ఆయన కిటువంటి అభ్యంతరాలు వుండ వని!'

'ఆయన కభ్యంతరం లేనంత మాత్రాన అందరికీ లేకుండా వుండొద్దూ!'

జయలక్ష్మిముఖం లజ్జతో ఎర్రబడింది. ఆపూట శేషాద్రి అక్కడే భోంచేశాడు. భోజనాలయాక గడియారం పదిగంటలు కొడుతున్నప్పుడు సత్యమూర్తి పంపిన ఒక చీటీ జయలక్ష్మికి చేరింది.

'డార్లింగ్ !

ఈ రాత్రికి ఇక్కడే పడుకోవాల్సివచ్చింది. రేపుద యం నీ దర్శనం చేసుకుంటాను. నేను వచ్చేదాకా మిత్రుడు శేషాద్రిని వుండమను.

ఇట్లు,

నీ మూర్తి.

ఉత్తరం చదివి శేషాద్రి కిచ్చి, 'చూశావా! మా ఆయన మంచితనం! భర్త భార్యకిచ్చే గౌరవాల్లో ఇంత కంటే ఉదాత్తమైంది ఏముంటుంది శేషాద్రీ!' అంది.

ఉత్తరం చదువుతూంటే, శేషాద్రివళ్లు జలదరించింది. జీవితంలో ఇంత చిత్రమైన ఘట్టాలుంటాయనేది అతనిఊహ కందని విషయం.

ఆ రాత్రి శేషాద్రి అక్కడే పడుకున్నాడు. మేడ మీద గదిలో అతనికి పక్క వేయించింది. తాను క్రింద

వరండాలో పడుకుంది. చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాక ఎవరి పక్కలమీదకు వాళ్లు వెళ్ళి నిద్రపోయారు.

తప్పు చేసే ధైర్యం శేషాద్రికి లేదు.

తప్పు చెయ్యాలనే కాంక్ష జయలక్ష్మికి లేదు.

ఈ యథార్థాన్ని దైవంతప్ప విశ్వసించే మనిషి లేడీ ప్రపంచంలో.

తెల్లవారింది. ఏడుగంటలైనా సత్యమూర్తి రాలేదు. ఆ ఇంట్లో ఇంకా వుండటానికి శేషాద్రికి ధైర్యం చాలలేదు. 'సత్యమూర్తి వచ్చాక వెడుదువుగాని శేషాద్రీ!' అంది జయలక్ష్మి, ప్రయాణమవుతున్న శేషాద్రిని చూసి.

'వద్దు జయా! అతనికి ముఖం చూపించే ధైర్యం నాకు లేదు.'

'ఎందుకని? నాకు తెలియని తప్పు నువ్వేం చేశావ్?'

'ఇక్కడ రాత్రి నిద్రపోవటమే నేను చేసిన తప్పు.'

జయలక్ష్మి నవ్వుతూ, 'నువ్వు ఇంకా పసివాడివి శేషాద్రీ! మనలాటివాళ్ళం అవకాశం వున్నా తప్పు చెయ్యలేం. అది చెయ్యగలిగితే ఇంత బాధ పడనవసరం లేదు. అవినీతిగా బ్రతకలేము. నీతిగా అంతకంటే వుండలేము' అంది.

శేషాద్రి వినిపించుకోలేదు. వెళ్ళిపోయాడు.

సత్యమూర్తి రాకుండానే వెళ్లిపోయాడు శేషాద్రి.

# 24

**ఉస్మానియా** యూనివర్సిటీలో ఉద్యోగం రావడంతో వేణూ వరంగల్ వదిలి హైదరాబాద్ వచ్చేశాడు. అతను చాలాసార్లు భార్యతోనూ, ఒంటరిగానూ రావటం, పోవటం జరుగుతూంది. అతను వస్తున్నందుకు ఆనందం గాని, రానందుకు విచారంగాని జయలక్ష్మి అనుభవించడం లేదు. వస్తే మర్యాదగానే ఆహ్వానించేది. అతిసాధారణ విషయాలను గురించి మాత్రమే సంభాషణ దొర్లుతూండేది.

ఆనాడు జయలక్ష్మి ఒంటరిగా వున్నప్పుడు వేణూతో జరిగిన సంభాషణ తిరిగితిరిగి సత్యమూర్తిదగ్గర కొచ్చి ఆగింది.

'సత్యమూర్తి నరనరాల్లో స్వార్థంమాత్రమే ప్రవహిస్తూందని నాకెప్పుడో తెలుసు!' అన్నాడు వేణు.

'అతన్నెరిగున్నవాళ్ళంతా అతను చాలా మంచి వాడనే అంటారు' అంది జయలక్ష్మి.

'అది నిజమే! ఆసంగతి నాకూ తెలుసు. మంచివాడి ననిపించుకోవాలని అతను చాలా శ్రద్ధగా ప్రవర్తిసాడు. ఒక పద్ధతిప్రకారం పరిచయం చేసుకోవడం, పెంచుకోవటం, స్నేహం చెయ్యటం జరుగుతుంది. అందులో అతనికి తెలిసిన మెలకువలు మరెవ్వరికీ తెలియవు. తనకు ఇబ్బంది కలగనంతకాలం ఎదుటివారికి చిన్నచిన్న సౌకర్యాలు కలిగిస్తాడు. నీ పుట్టినరోజు నువ్వు మరిచిపోయినా అతను మరిచి

పోడు. ఓ రూపాయి పారేసి ఆనాడు ఓ ప్రెజంట్ కొని నీ కిస్తాడు. నీ జన్మదినోత్సవంమీద నీకు లేని శ్రద్ధ అతనికుండటం చూసి నువ్వు ఆశ్చర్యపడతావు. అతనికి దాస్యం చేస్తావు. నీ యోగక్షేమాలకోసం తను అహర్నిశలూ అలమటిస్తున్నట్టు కనిపిస్తాడు. నువ్వు కనిపిస్తే, ప్రపంచంలో నువ్వు తప్ప చూడదగ్గ వ్యక్తి మరొకరు లేనట్టు ఆహ్వానిస్తాడు. నీ సుఖంకోసం లోకంలో ఏపని చెయ్యమన్నా సిద్ధంగావున్నట్టు కనిపిస్తాడు.'

'అది గొప్ప లక్షణం కాదంటావా?'

'సత్యమూర్తిని నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును. స్వలాభం లేనిదే అతనేపనీ చేయడు. అతను ఎవరినీ ప్రేమించడు. అతనికి ఎవరిమీదా సానుభూతి వుండదు. కాని, మంచి నటుడు' పెళ్లికి సత్యమూర్తి కొన్న గడియారంకేసి చూస్తూ అల్పంగా నవ్వింది జయలక్ష్మి.

'అయితే ఒకటి. అతను బ్రతకనేర్చినవాడు. ఏ పరిస్థితులలోనైనా అతను సుఖంగా బ్రతకగలడు.'

'ఉద్యోగం మానిపించి అతనిచేత ఏదన్నా బిజినెస్ పెట్టించాలని వుంది వేణూ!'

'తప్పకుండా షైన్ అవుతాడు. కొండకీ వెంట్రుక్కీ ముడిపెట్టి జయించే నేర్పు అతనిలో వుంది. అందుకనే నిన్ను పెళ్ళిచేసుకోగలిగాడు' అన్నాడు వేణు కసిగా.

జయలక్ష్మి మొఖం క్షణం పాలిపోయింది.

'వేణూ! అతనంటే నీకెందు కంత ద్వేషం?'

'అతనిమీద నాకు ద్వేషం లేదు.'

'పోనీ, అసూయ!'

'నిజం చెప్పాలంటే అతన్ని చూసి నువ్వే అసూయ పడుతున్నావు.'

'నేనా?'

'ఔను. నువ్వే!'

'ఎందుకని?'

'అతనికి బ్రతకడం తెలుసు; నీకు తెలియదు. ఉన్నంతలో అతను సుఖపడగలడు; నువ్వు ఎంతున్నా సుఖపడలేవు. అతను నీనుంచి సౌఖ్యాన్ని పిండుకోగలడు; నువ్వా పని చేయలేవు. నీకు బ్రతకడం చేతగాదు; సుఖించడం చేతగాదు. నీకు తెలిసిందల్లా విషాదాన్ని సృష్టించుకోవడం; సుఖపడేవాళ్ళని చూసి బాధపడటం!'

'నే నంత పాపిష్ఠిదాన్నీ, అత నంత సజ్జనుడూ అంటావా?'

'అలా అనటం లేదు. అందరికీ కోర్కెలుంటాయి. ఎవరికీ అన్ని కోర్కెలూ ఫలించవు. మనిషన్నాక ఆశాభంగాలూ, వ్యథలూ వుండనేవుంటాయి. రాజీపడి బ్రతకగలగాలి. అతన్ని చూసి నేర్చుకోమంటున్నాను.'

'అంటే?'

'అతను సుశీలతో సుఖపడుతున్నాడు.'

'ఎవ రా సుశీల?'

'ఒక పెద్దఉద్యోగస్థుడి భార్య. వాళ్ళింటికి రోజూ వెడుతున్నాడు. వుంటున్నాడు. నీకు తెలియదా ఈ సంగతసలు?'

'కొంత తెలుసు. ఏదో జరుగుతూందని తెలుసు. కాని-ఎవరో పూర్తిగా తెలియదు. ఆ సుశీల నీకు తెలుసా?'

'నాతో చదువుకుంది. పెద్దసంబంధం చేసుకుంది. ఆమధ్య ఒకసారి నాకు రైల్వేస్టేషన్‌లో కనబడింది. అప్పటికి ముగ్గురో-నలుగురో పిల్లలు.'

'భర్త బాగుంటాడా?'

'సత్యమూర్తికంటే బాగుంటాడు?'

'మరీ పని ఎందుకు చేస్తూంది?'

'ఆమె ఎందు కిలా చేస్తూందో తర్వాత ఆలోచిద్దాం. నీభర్త ఇలా ఎందుకుచేస్తున్నాడో ఊహించావా?'

'అందులో ఊహించడానికి ఏముంది? అది నచ్చి వుంటుంది.'

'నచ్చడమంటే?'

'బాగుంది. అది ఎవరికి వారికే తెలియాల్సినసంగతి!'

'నేను చెప్తాను విను జయా! అతను అక్కడికి వెళ్ళడానికి కారణం నువ్వే!'

'నేనా? అదేమిటి?'

'ఏభర్తయినా ఏం కోరతాడో తెలుసా! తాను స్త్రీనుంచి సుఖాన్ని పొందాలనేగాదు, తనవల్ల స్త్రీ సుఖపడాలనికూడా కోరతాడు.'

'అయితే?'

'నీవల్ల అతను సుఖపడుతున్నాడు. కాని, అతనివల్ల నువ్వు సుఖపడటం లేదు. ఆ సంగతి ఆతనికి తెలుసు.'

'అతనివల్ల నేను సుఖపడటం లేదని ఎవరు చెప్పారు?'

'అతన్ని పెళ్ళిచేసుకుని చాలా పొరపాటు చేశానని నీ వనుకుంటున్నావు? నీ ఐశ్వర్యానికీ, అందానికీ, యవ్వనానికీ అతను తగడని నువ్వు బాధపడుతున్నావు.'

'ఆమాట నేనెప్పుడూ అనలేదు.'

'మాట అనకపోవచ్చు. మూర్తి నీకంటే తెలివైనవాడు. నీమనస్సు ఎలా పరిగెత్తుతుందో అతను గ్రహించాడు.

'అలా నీతో చెప్పాడా?'

'ఔను. చెప్పాడు!'

'అదే నిజమైతే నన్నేం చేస్తాడు?'

'ఏమీ చెయ్యడు. నిన్ను శిక్షించడంవల్ల అతనికి వచ్చేదేమీ లేదు. తనకి కష్టం కలిగించేపని ఏదీ అతను చెయ్యడు. అంతేగాదు. నీ సుఖానికి అతను అడ్డంగూడా రాడు.'

'అంటే?'

'నువ్వు సుఖపడే మార్గ మేదన్నా ఈ లోకంలో వుంటే అత నామార్గాన్ని మూసివెయ్యడు.'

# 25

వేణు వెళ్ళినప్పటినుంచీ ఆతను చెప్పిన విషయాలను గురించే ఆలోచించడం మొదలుపెట్టింది జయలక్ష్మి అతని మాట లామె హృదయాంతరాళాల్లోకి దూసుకుపోయి, ఆమెను కదిలించాయి. అతనిముందు చాలా నిర్లిప్తంగా

వుండాలని పెద్దయత్నం చేసింది. కొంతమటుకు గెలిచింది. అతను వెళ్ళగానే ఆమె నిజస్వరూపం బయటికొచ్చింది. కళ్లు మూసుకుని తలమీద దిండు వేసుకుని పడుకుంది. వేణు చెప్పిన ప్రతిమాటా నిజమనిపిస్తూంది.

నిజమే! మూర్తి స్వార్థపరుడు. అతను కోరేది ఒక్కటే! ఈలోకంలో సుఖం! అంతకుమించి మమకారాల మీదా, అనుబంధాలమీదా అతనికి నమ్మకం లేదు. అటు వంటిమూర్ఖుణ్ని తనెలా పెళ్ళిచేసుకుంది? తాను పొరపాటు పడిందా? స్వార్థం ఎవరిలో లేదు? స్వసుఖాన్ని ఎవరు ఆశించరు? స్త్రీ పురుషుణ్ని ప్రేమించడం ఎందుకు? కేవలం అతన్ని సుఖపెట్టడానికా? అతనివల్ల తాను సుఖపడటానికి గాదా? ఔను! ఏ లోపంలేని పురుషుడు ఎలా లభిస్తాడు? తను పరిపూర్ణంగా, మాలిన్యరహితంగా వున్నదిగనుకనా? ఎక్కడో అక్కడ రాజీపడాలి. సర్దుబాట్లు జీవితానికి సహజమేగాదు; ప్రాణావసరంగూడాను. అతనిలో కొన్నిలోట్లు వుంటేనేం? తాను సుఖపడటానికి అవి ఏమి అడ్డమొచ్చాయి? తనకి ఆనందం కలిగించే యత్నంలో అతనేమీ లోటు చెయ్యలేదే? తనే చైతన్యహీనంగా ప్రవర్తించింది. వేణు అన్నది నిజమే! తన సుఖానికి అతను అడ్డంరాడు. ఐనా– కేవలం స్వార్థపరులకి అది సాధ్యంగాదు. అతను స్వార్థపరుడేగాడు. ఇంకా ఏదో...ఆమె కళ్లల్లోంచి నీరు చెక్కిళ్ళపైకి పొంగి బూరుగుదూదిలో ఇంకింది.

కన్నీటిని సృష్టించేంత విషాదం తన జీవితంలో ఏ అంతరాల్లో దాగివుందో ఆమెకు అంతుచిక్కడం లేదు.

సాధారణంగా ఎవరిలోనూ కనిపించని కొన్ని గుణాలు మూర్తిలో వున్నాయి. కొండలువిరిగి మీదపడుతున్నా, అతని ముఖకవళికల్లో మార్పులు రావు. కోపం, అసూయ, ద్వేషం, దుఃఖం ఈ ఉద్వేగాలను అతడు జయించాడని పిస్తూంది. అతని మనసులో ఏముందో బ్రహ్మదేముడికి గూడా తెలియదు. అతని మొఖాన ఉమిసినా అదే చిరు నవ్వుతో వెళ్లిపోయేశక్తి అతనికుంది. ప్రతిపని చేసేటప్పుడూ 'ఈ పని చేస్తే ముందు లాభం వుందా?' అని ప్రశ్నించుకుంటాడేమో!

అతని ప్రవర్తనను గురించిగాని, సుశీలనుగురించిగాని ఎన్నడూ ప్రశ్నించలేదు. సత్యమూర్తిగూడ తనకు తాను ఎన్నడూ ఏమీ చెప్పలేదు. ఒకనాడు వుండబట్టలేక, రాత్రి భోజనాలయాక జయలక్ష్మి అడిగింది:

'మూర్తీ! ఇవాళ ఇంకా బయలుదేరలేదేం?'

'ఎక్కడికి?'

'దానిదగ్గరికే!'

'ఇవాళ అతను కాంప్‌కు వెళ్ళలేదు. ఇంట్లోనే వున్నాడు.'

జయలక్ష్మికి వళ్లంతా పెట్రోలు పోస్తే మండినట్లుంది. 'ఇవాళ సినిమాటిక్కెట్లు దొరకవు. అందుకని వెళ్లలేదు' అన్నట్లు చెప్తున్నాడు. ఆమెకళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

'మూర్తీ! నిన్నుచూస్తే నాకు అసహ్యం వేస్తున్నది!' వళ్లు తెలియని ఆవేశంలో తను ఏమంటున్నదో అర్థంకాలేదు.

'నాకు తెలుసు' అదే ప్రశాంత వదనంతో అన్నాడు మూర్తి.

'మూర్తీ! ఇది నీకు న్యాయమా! నీకు నే నేం లోటు చేశాను? ఏం అపకారం చేశాను? న న్నెందుకు అన్యాయం చేస్తావ్? ఈ సంగతి బయటపడితే దాని సంసారం ఏమవు తుందో ఆలోచించావా?'

'ఆలోచిస్తూ బాధపడేవాళ్లు వేరు, బ్రతకటం చేత గాని వాళ్లు. అయినా, జయా! ఇందులో నువ్వు బాధ పడ వలసిం దేమీ లేదు. నీకు మాత్రం నే నేం అన్యాయం చేశాను? నీ సుఖాల కేం తక్కువ చేశాను?'

'ఏం తక్కువ చేశావో నీకు తెలియదా మూర్తీ? మనం భార్యాభర్తలం. అగ్నిసాక్షిగా వివాహం చేసు కున్నాం. ఒకరి కౌగిట్లో ఒకరం స్వర్గనరకాలు అనుభవించి, ఒకరి కళ్ల ముందు ఒకళ్లం రాలిపోవలసిన వాళ్లం.'

మూర్తి సాదాగా నవ్వుతూ అన్నాడు.

'జయా! నాకు వివాహ వ్యవస్థమీద నమ్మకం లేదు. ఇది మానవస్వభావానికీ, ప్రకృతికీ విరుద్ధం. ఈ వివాహం, ఈ సాంఘిక బంధాలూ మానవుణ్ణి బానిసగా చేస్తున్నాయి. యంత్రంగా మారుస్తున్నాయి.'

'అంటే నువ్వు సుశీలతో తిరగటం తప్పు లేదని నిరూ పిస్తున్నా వన్నమాట!'

'నేను సుశీలతో తిరగటమే గాదు, నువ్వు శేషా ద్రితో స్నేహం చెయ్యడం గూడా తప్పుగా తోచదు నాకు.'

జయలక్ష్మి ముఖంమీద కొరడాతో చరిచినట్లయింది.

'మూర్తీ! ఇంత దౌర్భాగ్యుడివా నువ్వు! ఇంత నీచంగా మాట్లాడటానికి నీకు సిగ్గు వెయ్యడం లేదూ?అందుకనేనా శేషాద్రిని ఆ నాడు ఇక్కడ నాతో వంటరిగా నిద్రించే ఏర్పాటు చేశావు! నీలాగ బ్రతకడం కంటే రైలు క్రింద తలపెట్టి చావడం మేలు. బురదలో పొర్లాడే కుమ్మరి పురుగుకి నీకంటే ఇంగితజ్ఞానం వుంటుంది' అంది కసిగా జయలక్ష్మి.

మూర్తి మరొక సిగరెట్టు ముట్టిస్తూ – 'జయా! పరిస్థితుల ప్రాబల్యంవల్ల నీకు కొన్ని భ్రమలు గాఢంగా ఏర్పడ్డాయి. లభ్యంకానిది లేనిదే బ్రతకలేమనుకోవటం మానవ స్వభావం. నీకు సంఘంలో గౌరవం కావాలి. సలక్షణంగా, ఉత్తమ కుటుంబీకుడుగా వుండే భర్త కావాలి. నీ తల్లిపైన, తద్వారా నీపైన సంఘం వేసిన బురద గుర్తు నువ్వు చెరిపివేసుకోవాలనుకుంటున్నావ్!'

'మూర్తీ! అవన్నీ అనవసరం. ఈ ఒక్క మాటకు సమాధానం చెప్పు. నువ్వు సుశీలను మరిచిపోలేవా?మనిద్దరం ఆదర్శప్రాయమైన దాంపత్య జీవితం గడపలేమా?'

'నేను సుశీలను మరిచిపోవడానికీ, మనిద్దరం సుఖంగా దంపతులుగా వుండటానికీ ఏమీ సంబంధం లేదు. అయినా ఎందుకు అనవసరంగా రభసచేస్తావ్? నీలాంటి వాళ్లు వ్యర్థమైన సంఘర్షణలు అనవసరంగా కొని తెచ్చుకుని, జీవితాలను నరకం చేసుకుంటూ, ఎదుటి జీవితాలను నరకం చేస్తారు.

మనం సుఖంగా వున్నాం. సుఖంగానే వుంటాం. క్షణకాలం పువ్వులా వికసించి రాలిపోయే దీ జీవితం. త్రుటికాలం తీయని కలలా విరిసి వింతగా కరిగిపోతుం దీ బ్రతుకు. గాలి పటాన్ని భూమికి బంధించే దారంలాగ ప్రాణాన్ని ప్రపంచానికి బంధించేది సౌఖ్యం. అది అంతమైతే లోకంతోనే బంధం తెగిపోతుంది. తాడు తెగిన గాలిపటంలాగ జీవితం ఎక్కడికో ఎగిరి, ఎక్కడో రాలిపోతుంది.'

జయలక్ష్మి కళ్ళనుంచి నీళ్లు చెక్కిళ్లను మలినం చేసి ధారగా నేల రాలుతున్నాయి.

'ఎందు కేడుస్తున్నావ్ జయా! నీమీద నాకు ద్వేషం లేదు. కాని నువ్వే నన్ను ద్వేషిస్తున్నావు. అసహ్యించు కుంటున్నావ్!'

'లేదు మూర్తీ! ఏదో ఉద్రేకంలో వున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వుతప్ప నా కెవ్వరున్నా రీలోకంలో? నిన్ను ద్వేషించటమంటే నన్ను నేను ద్వేషించటంగాదా?'

'మరెందు కంత బాధపడతావ్! నేను సుశీలతో స్నేహంగా వున్నంతమాత్రాన నీకు వచ్చిన బాధేమిటి?'

'అది బాధే మూర్తీ! కాని – అంతకంటే బాధించే మాటొకటి నన్నన్నావ్! అది నా గుండెల్ని రంపంలా కోస్తున్నది.'

'ఏమిటది?'

'శేషాద్రితో స్నేహం చెయ్యటం నీ కభ్యంతరం లేదన్నావ్! ఎందుకన్నావ్ అంతమాట! నా కతనితో సంబంధ ముందనుకుంటున్నావా?'

మూర్తి కులాసాగా నవ్వాడు. ఆస్థితిలో ఆ నవ్వు అపశ్రుతిలాగ వినిపించింది.

'పడుకో జయా! నాకూ నిద్రవస్తూంది. నీ అనుమానాలన్నీ ఇంకోకసారి తీరుస్తాను.' అంటూ మూర్తి రగ్గు పైదాకా లాక్కుని అటుతిరిగి పడుకున్నాడు.

ఎంత నిర్లిప్తత! ఎంత ఉదాసీనత! జీవితమన్నా, జీవితపువిలువలన్నా ఎంత నిర్లక్ష్యం!

మూర్తి నిశ్చింతగా నిద్రపోతున్నాడు. అర్ధరాత్రి దాటింది. ఆ కుర్చీలో అలాగే కూర్చుని దిగంతాల కేసి చూస్తూ మృత్యువునుగురించి ఆలోచిస్తూంది జయలక్ష్మి.

జీవితం కేవలం కలేనా? ఈ బంధాలూ, ఈ నైతిక విలువలూ అర్థవిహీనమైనవేనా? తాను చేజేతులా జీవిత మకరందాన్ని అనుభవించలేక పారబోస్తుందా? వెన్నెలలో సత్యమూర్తి మనోజ్ఞమూర్తిలాగ కనిపిస్తున్నాడు. అతనే! తనపతి! జీవితమాధుర్యాన్ని తన కదించడానికి పరమేశ్వరుడు ప్రసాదించిన వరం! క్షణంలో నరాలు బిగిసినై. రక్తం వేడెక్కి వరదలై పొంగుతోంది. సముద్రపు కెరటాల్లాగ కోర్కెల ఉధృతానికి తాళలేక హృదయం ఎగిరిపడుతోంది. ఏదో సృష్టిశక్తి ఆమెను కదిలించింది. ఆమె చైతన్యస్రవంతిలా, ముద్దకట్టిన కోర్కెలా అతని మంచంమీద వాలింది, అతని నుదుటిపై చెయ్యివేసి లాలనగా ముంగురులు సవరించింది. సిగ్గుతో ఎర్రబడిన పెద

వులు అతని చెక్కిళ్ళను ఆర్ద్రించేసినాయి. అతను కదిలాడు లేచాడు.

'ఇంకా పడుకోలేదా జయా! ఏమిటో కలవచ్చింది నీ చెయ్యి తగిలితే సుశీల అనుకున్నాను.'

సుశీల! ఆమెశరీరం అరక్షణంలో చల్లబడింది. కోర్కె ఆత్మహత్య చేసుకుంది. నరాలు సడలిపోయాయి. దుష్టమంత్రంలోని బీజాక్షరాలలాగ ఆ మూడు అక్షరాలూ సు...శీ...ల! ఆమె హృదయం ముడుచుకుపోయింది. ముఖం పాలిపోయింది. మహోల్లాసంగా ప్రియసమాగమం కోసం దిగంతాలకు ఎగిరిపోయే చకోరానికి క్రూరశరం హృదయంలో తాకినట్టు జయలక్ష్మి శరీరం పతనమై పోయింది

సుశీల అని ఎట్లా అనుకున్నాడు తన్ను? ఎంత తెగిస్తే మాత్రం అది తన ఇంటికి రాగలదా? సుశీల సంగతి జయలక్ష్మికి తెలియదు. మూర్తికి మాత్రమే తెలుసు. ఆమె ఎన్నోసార్లు మూర్తితో అంది – 'నరకానికి రమ్మన్నా, నీ కోసం వస్తాను మూర్తీ! ఒకసారి పరీక్షించి చూడు–నీకోసం నా సర్వస్వాన్నీ త్యాగం చెయ్యగలనో లేదో! ఆ చేసే త్యాగాన్ని సంతృప్తితో భరించగలనో లేదో చూడు! సంతోషంతో స్వీకరించగలనో లేదో పరీక్షించు.' మూర్తికి తెలుసు, సుశీల ఎంతకైనా తగిందని. తలుచుకుంటే తనకోసం ఎక్కడికి రావడానికైనా, ఏ పని చెయ్యడానికైనా సాహసిస్తుందనీ అతనికి తెలుసు. ముగ్గురు పిల్లల్ని కన్న స్త్రీ, ఆమెలో ఇంకా స్త్రీత్వం అంత ఉధృతంగా పొంగటం అతనికి ఆనందాన్ని మాత్రమే గాదు, ఆశ్చర్యాన్ని కూడా

కలిగించింది. పున్నమ చంద్రుణ్ణి చూసిన సముద్రంలా తనని చూడగానే ఆమె శరీరమంతా కోర్కెల సంద్రమై పొంగుతూంది. జయలక్ష్మిలో లేనిదీ, సుశీలలో వున్నదీ అదే! అదే ఆ రెండు ప్రాణాల్నీ బంధించిన సృష్టిశక్తి!

# 26

ఎవరీ సుశీల? తన జీవితంలో ప్రవేశించి సమస్తం ఆక్రమించుకు కూర్చుంది. ఎంత సాహసం? ఎంత తెగింపు!! ఏమిటా మొండిధైర్యం! సుశీల వ్రాసిన ఉత్తరాలు దాచటానికి మూర్తి ఎన్నడూ ప్రయత్నించలేదు. ఆ ఉత్తరాలు ఎంత లజ్జాకరంగా వున్నాయి! ఎంత విశృంఖలత్వం!!ఏమిటా భాష? అంత సిగ్గులేని పదజాలంతో, భర్త వుండగా పరాయి పురుషుడికి ఉత్తరాలు వ్రాసే ఆ సుశీల ఎంత గుండెనిబ్బరం గలది? ఆ ఉత్తరాలన్నీ కట్టకట్టి భర్తకిస్తే ఏమవుతుంది? వాళ్ళసంసారం నాశనం గాదా? ఆమెను భర్త తన్ని తరిమివేయడా? అప్పుడెక్కడ తలదాచుకుంటుంది? జీవితం ఏమవుతుంది? ఏమన్నా కావచ్చు. ఆ భయం ఆమెకుండాలి.ఆమె క్షేమం నేనెందుకు ఆలోచించాలి? ఆమెభర్తను కలుసుకోవాలి. జరుగుతున్న నాటకమంతా చెప్పి, బుద్ధి చెప్పించాలి. భార్యను అదుపులో పెట్టుకుని, తన సంసారం బాగు చేసుకొని, నా సంసారం రక్షించమనాలి. ఇందులో తప్పు లేదు. ఈ పరిస్థితులలో వున్న ఏఆడదైనా అలానేచేస్తుంది.

నేను దేవతను గాదు. ఉప్పూకారం తింటున్న మామూలు మనిషి నే!

సుశీల సత్యమూర్తికి వ్రాసిన ఉత్తరాలన్నీ కట్టకట్టి సుశీలభర్తఆఫీసుకు వెళ్ళింది జయలక్ష్మి. అతను డిప్యూటీ కలెక్టరుచేసి, కలెక్టరుచేసి, ఇంకా పెద్దహోదాలో హైద్రాబాదు బదిలీఅయివచ్చాడు. నాగసేనరావ్ అని అతనిపేరు ప్రముఖంగా కవిపిస్తూంది ద్వారందగ్గర. లోపలికి చీటీ పంపింది జయలక్ష్మి. వెంటనే అతనిగదిలోకి ప్రవేశం లభించింది. అతన్ని చూడాలని జయలక్ష్మి చాలా రోజులనుంచీ అనుకుంటూంది. కట్టుకున్న భార్యతో వంచితుడైన దురదృష్టవంతుడు! కాని, అతని ముఖంలో విషాదచ్ఛాయలేమీ కనబడటం లేదు. పురుషత్వం పూసుకున్న శరీరం కండలు తిరిగి మెరుస్తూంది.

'కూర్చోండి.'

కంఠస్వరంలో గీరవుంది. కళ్ళు ఎర్రగా నెత్తుటిచారలతో, నిష్కారణంగా నిప్పులు కక్కుతున్నట్టు వున్నాయి. నున్నగా శుభ్రంగా వున్న గడ్డం చిత్రమైన నీలిమరంగు చిమ్ముతోంది. ఆరడుగుల దృఢమైన శరీరం. లేతగోధుమరంగు ట్వీడుసూటులో వున్నాడు. తత్తరపాటుతో అతనికేసి చూసింది. తన భర్తతో అతన్ని పోల్చుకుంటూంది. కాని, ఏ విషయంలోనూ పోలికలేదు. ఇతని అందం, ఠీవి, హోదా సత్యమూర్తికి లేవు. ఇటువంటి భర్త వుండగా సుశీల ఏం బావుకుందామని సత్యమూర్తితో తిరుగుతున్నది?

'మీరెవరో తెలుసుకోవచ్చా?'

జయలక్ష్మి ఆలోచనలు తెగాయి.

'మీకు సత్యమూర్తి తెలుసనుకుంటాను. ఆయన నాభర్త!'

అతనిముఖం క్షణం పాలిపోయింది. కాని వెంటనే మామూలుస్థితిలోకి వచ్చాడు.

'ఆయన తెలుసా మీకు?' అతని ముఖకవళికలు చూస్తూ చాలా జాగ్రత్తగా అడిగింది.

'తెలుసు...!'

'ఏమనుకుంటున్నారు ఆయనగురించి?'

'మంచివాడే! నిదానస్థుడు అనుకుంటున్నా.'

'అదిగాదండీ నే నడిగింది! క్షమించండి! మీతో చాలా బాధ కలిగించే సంగతులు మాట్లాడవలసివస్తూంది. ఇది సుఖంగాదని తెలుసు. మీ మనసు నొచ్చుకుంటుందనీ తెలుసు. కాని తప్పదు.' జయలక్ష్మి ఆగింది.

'చెప్పండి. ఫర్వాలేదు.'

గది నాలుగుపక్కలా కలయచూసి, సంచిలోనుంచి ఉత్తరాల కట్ట తీసి టేబుల్ మీద పెట్టింది.

'రావుగారూ! ఇదేమిటో తెలుసా? చూడండి!'

'తెలుసు. చూడనవసరం లేదు.'

'ఏమిటి? 'మీకు తెలిసే, మీ అంగీకారంతోనే ఇదంతా జరుగుతున్నదా?'

'నాకు తెలుసు. కాని నా అంగీకారంతో జరగటం లేదు' అంత గంభీరపురుషుడూ సిగ్గుపడుతున్నాడు.

'కనీసం మీ కభ్యంతరం లేదనుకుంటా!' అంది జయ

లక్ష్మి, కొంచెం కసిగా. ఆమాట అతనికి బాణంలాగ తగి లింది. ఒకసారి జయలక్ష్మిముఖంలోకి చూసి తల దించు కున్నాడు.

'కాదు. నాకు పూర్తి అభ్యంతరం వుంది. ఇలా జరుగుతున్నందుకు నేను నరకం అనుభవిస్తున్నాను. ఇది జర క్కుండావుండటానికి నేను చేయగలిగిందంతా చేస్తున్నాను. కాని ఆమె మొండికేసింది. తెగించింది.'

'ఇంక మీరేమీ చేయలేరా?'

'దానికి రెండేమార్గాలున్నాయి. ఒకటి దాన్ని వదిలివెయ్యటం-రెండు ఇద్దర్నీ చంపివెయ్యడం.' అతనికళ్లు మరింత ఎర్రబడ్డాయి.

జయలక్ష్మి వణికింది. తనకీ ఇలాంటి ఊహాలే ఎన్నో రకాలుగా అనేకసార్లు వచ్చాయి. కాని, అందుకు కావలసిన ధైర్యం తనకు లేదు. అందుకనే అవి ఊహాలుగానే వుండి పోయాయి.

'అంతకన్నా మంచిగా నయానా భయానా చెప్పి చూస్తే మంచిదేమో!'

'చెప్పానమ్మా! మొదటిసారి వాళ్ళిద్దరినీ ఒకచోట చూసినప్పుడు ఎంతకు తెగించానో తెలుసా! నాతో కాపరం చేసిన ఈ పదేళ్ళలోనూ సుశీలకు ఇటువంటి ఆలోచన లున్నాయనిగాని, ఇంతకు దిగజారుతుందనిగాని ఎన్నడూ కలలోనూడా అనుకోలేదు. నావల్లగాని, సంసారంలోగాని అది ఎప్పుడూ ఏలోటూ అనుభవించలేదుగూడా. పదేళ్లూ పదినిమిషాల్లాగా గడిచిపోయాయి. అది నాకు స్వర్గద్వారాలు

తెరిచింది. పెళ్ళయిన పదిరోజుల్లో ఎంత అన్యోన్యంగా వున్నామో, ఈ పదేళ్ళుగూడా అంతే అన్యోన్యంగా వున్నాం. మాకోర్కెలు రోజురోజూ తీవ్రం అయాయేగాని పల్చబడలేదు. పురుషుణ్ణి అంతకంటే సుఖపెట్టేస్త్రీ సృష్టిలో వుంటుందనుకోను. నాఇల్లు అలా ఆనందధామంగా వుండేది. కాని...ఒక్కసారి...ఒక్కసారిగాఅదినరకమైపోయింది... అతని గంభీరత్వం చెదిరిపోయి దీనత్వం అలుముకుంది. కళ్ళ వెంట కన్నీళ్ళు జలజలా రాలాయి. అవి తుడుచుకుంటూ-

'నిజమండీ! నా జీవితం నరకమైపోయింది. ఒకరోజు ఆఫీసులో పనిచేస్తుండగా అది గుర్తుకొచ్చింది. నావళ్ళంతా విద్యుత్తుప్రవహించినట్టయింది. ఏమిటో దాన్ని చూడాలని పించింది. తక్షణం కారువేసుకుని శరవేగంతో ఇంటికెళ్లాను. నన్నుచూసి దాసీది వెర్రెత్తినట్టు పరిగెత్తింది. నాకు అర్థం కాలేదు. మేడమీాదకు వెళ్ళాను. కిటికీతలుపులు తెరిచే వున్నాయి. ఏంచెప్పను? ఏ దృశ్యం అతిభయంకరమై నా ప్రాణవాయువులను బైటకు తోడగలదో, ఆ దృశ్యం చూశాను. అతన్ని అది ముద్దుపెట్టుకుంటోంది. మురిపిస్తోంది. ముంగురులు సవరిస్తోంది. నా అలికిడి విని అతను భయపడి 'ఎవరో వచ్చినట్టున్నారు!' అంటూ లేచాడు. అది అతన్ని లేవనీయకుండా 'ఎవరొచ్చినా ఫర్వాలేదు' అంది.

'మీాఆయన వస్తే?'

'ఏం వస్తే?'

'బ్రతకనిస్తాడామనని?'

'చంపనీ!'

'నేను ఆకాశం మింగేలా కేక పెట్టాను. పక్కగదిలో బీరువాలో వున్న పిస్తోలు తీసుకువచ్చి తలుపు తియ్యమన్నాను. తీసింది. పిస్తోలు గురిపెట్టాను. అప్పటికే అతను దొడ్డితలుపు తీసుకుని పారిపోయాడు. దాన్ని కాల్చివేద్దామనుకున్నాను.

'కాల్చండి!' అంది.

'కాల్చా లనుకున్నాను. దాని పాపాన్ని ఆ రోజుతో అంతం చేయా లనుకున్నాను. కాని, చేతులు రాలేదు. కాల్చలేకపోయాను. పిస్తోలు జారి క్రిందపడింది. నాకు ప్రపంచమంతా అంధకారమైపోయింది.' నాగసేనరావు ఏడుస్తున్నాడు. జయలక్ష్మి ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అతనే మళ్లీ మొదలెట్టాడు.

'సుశీల నాదగ్గరకు వచ్చింది. ఎంత లాలనగా అందనీ-''నాకు తెలుసు. నా చిట్టిగాడు నన్ను చంపగలడా?'' అని, నాకోపం కరిగిపోయింది. దుఃఖం పొంగింది. ఏడ్చాను. ఆమె గుండెలకు తల పగలకొట్టుకుని ''ఎందుకు సుశీ! నన్నెందుకింత నాశనం చేస్తావ్? మన జీవితాల్లో చిచ్చు ఎందుకు పెడ్తావ్? నేను నీకేంలోటు చేశాను? ఎందు కిలా దిగజారిపోయావ్?'' అని బ్రతిమిలాడాను. ప్రాధేయపడ్డాను.'' నాగసేనరావు కళ్ళనుంచి రాలుతున్న నీటిచుక్కలు టేబుల్ మీదున్న బ్లాటింగ్ పేపర్లో ఇంకిపోతున్నాయి.

'ఆవిడ ఏమంది?'

'నవ్వుతుంది. నా తల నవరిస్తుంది. నన్ను దగ్గరకు తీసుకుంటుంది. చంటిపిల్లణ్ణి లాలించినట్టు లాలిస్తుంది.

"ఏడవబోకు నాపిచ్చి! నీకళ్లు చెమ్మగిల్లితే నేను బ్రతగ్గలనా? నేను నీదాన్నేగా! ఇదిగో! నీముందున్నాను. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో. నలిపి నాశనంచెయ్యి" అంటుంది. ఆ తర్వాత నెలరోజులు సత్యమూర్తి మాఇంటికి రాలేదు. ఆనెలా సుశీల అన్నం సరిగా తినేది గాదు. భయంకరంగా మారిపోయింది. నేను ఎంతగానో బ్రతిమిలాడాను. "నామీద కోపమెందుకు సుశీ?"అని ప్రాధేయపడ్డాను. "నీమీదకోపం గాదు. నేను లేకుండా నువ్వు బ్రతకగలవా? బ్రతకలేవు. అలాగే అతను లేకుండా నేను బ్రతకలేను." అంటూ నా వళ్లో తలపెట్టుకుని భోరున ఏడ్చింది. ఆరోజల్లా అన్నం తిన లేదు. బ్రతిమిలాడాను. ఏడుస్తూ లాలిస్తూ అడిగింది-"అతన్ని తీసుకురావా?" అని. "లేకపోతే పిస్తోలుతో కాల్చిచంప" మంది. నేను పిచ్చివాణ్ణయిపోయాను. ఒకరోజు నల్లమందూ, నూనే కలిపి మింగింది. అది ఇంక బ్రతకదని తేలిపోయింది. జాలివేసింది. నాశరీరమే భయంకరవ్యాధితో పరమవికృతంగా, జుగుప్సాకరంగా తయారైందనుకోండి. అయినా ఆ శరీరాన్ని నాశనంచేయాలనిపించదు. తగలబెట్టాలనిపించదు. ఆశరీరంమీద అంతటి మమత వుంటుంది. ఆ మమకారంలో అంతటి వైపరీత్యముంది. సుశీలపై నాకు పెరిగిన మమ కారం అంతటికంటే తీవ్రమైంది. అంతకంటే గాఢమైంది. ఆమె మరణిస్తుందని భయంవేసింది. శరీరంలో ఏదో నలత ప్రారంభమైంది. బుగ్గలు లోతుకుపోయాయి. కళ్లు గుంటలు పడ్డాయి. ఇలా వుండగా ఓనాడు సత్యమూర్తి మళ్ళీ ఇంట్లో కనిపించాడు. కాని-ఈసారి నేను అశక్తున్నయాను. అతన్ని

చంపాలనిగూడా అనిపించలేదు. అది మంచంమీద తీసుకుంటూంది. అతను రోజూ వచ్చిపోతున్నాడు. ఒక నెల గడిచింది. ఆమెలో కొత్తనెత్తురు పుట్టింది. మనిషి మళ్ళా చిగురించింది. కాని ఆమె నాకళ్ళముందు అతనితో మాట్లాడటం, ఇద్దరూ పగలబడి నవ్వుకోవడం నేను సహించలేకపోయాను. అది నాకసాధ్యమైంది. ఒకనాడు నేను అక్కడుండగానే వాళ్ళు మంచంమీద పడిపోయారు. ఇది నరకమనిపించింది. కాని దాన్ని చంపలేను. నేను చావలేను. ఆరోజు దాన్ని ప్రాధేయపడి చెప్పాను. ''నాకళ్ళముందు మాత్రం నన్ను చిత్రహింసపెట్టకు. నేను లేనప్పుడు మాత్రమే అతన్నిపిలు!'' అని. ఇలా గడుస్తూంది జీవితం. కాని నాకు తెలుసు, ఎంతో కాలం ఇలా గడవదని. ఇది కేవలం రహస్యంగా వుండదు. ఇప్పటికే ఆఫీసులో గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఈ భయంకరనాటకాన్ని ఏలాగో అలాగ సమాప్తం చెయ్యాలి. కాని-ఎలాగా అనేదే ఆలోచిస్తున్నా!'

అంటూ నిట్టూర్చాడు నాగసేనరావు. ఆరయింది.

'ఇంక వెళ్లోస్తానండి' అంది జయలక్ష్మి లేచి.

'వుండండి! నా కారులో మీయింటిదగ్గర దిగబెడతాను' అని నాగసేనరావు జయక్ష్మిని కారులో ఎక్కించుకుని బయలుదేరాడు.

కారు జయలక్ష్మి ఇంటిముందు ఆగింది. 'ఓరోజు తీరికచేసుకుని రండి. మీరు నాకంటే అభాగ్యులు. మీ మనశ్శాంతికై నే నేదన్నా చేయగలిగితే సంతోషిస్తాను.' అంటూ సెలవుతీసుకుని నాగసేనరావు వెళ్లిపోయాడు. జయ

లక్ష్మి ఇంట్లో కొస్తుంటే సత్యమూర్తి బయటికెడుతూ ఎదు రయ్యాడు.

'అది నాగసేనరావుకా రనుకుంటాను!' అన్నాడు.

అతని కేసి చురచుర చూసి, జవాబు చెప్పకుండా, ఇంట్లోకి దూసుకుపోయింది జయలక్ష్మి.

# 27

ఒకనాడు మధ్యాహ్నం నాగసేనరావు కారు వచ్చి జయ లక్ష్మి ఇంటిముందు ఆగింది. కారు దిగుతున్న అతని వాలకం చూసి ఆశ్చర్యపోయింది జయలక్ష్మి. మనిషి చాలా ఉద్రేకంగా వున్నాడు. ఏదో జరిగివుంటుం దనిపించింది.

'రండి!' అంటూ ఆహ్వానించింది.

'దాంతో తెగతెంపులు చేసుకున్నా నండీ!' అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

'ఏమైంది? నిదానంగా చెప్పండి!'

'నే నెంతో ప్రయత్నించాను, దానికి అన్యాయం చెయ్యకూడదని. నేను వదిలేస్తే దాని గతి ఏమౌతుందో నాకు తెలుసు. ఎన్నోవిధాల చెప్పాను, కాళ్ళు పట్టుకుని మొరపెట్టాను. చివరికి నేను దాన్ని కోరింది ఒకటి. నాపరువు నిలబెట్టమన్నాను. దాని సుఖానికీ, అవినీతికీ నేను అడ్డం వెళ్ళలేదు. నేను అనామకుణ్ని గాదు. గవర్నమెంటులో, పబ్లిక్‌లో పేరున్న ఆఫీసర్ని. నాచేతికింద వందలమంది

ఉద్యోగు లున్నారు. నాభార్య ఇలా ఎందుకూపనికిరాని గుమాస్తాతో తిరుగుతూందంటే నాకేం కావాలి? ఏ ముఖంతో ఉద్యోగం చెయ్యను? ఎంతో ఆలోచించి చెప్పాను. నా పేరు ప్రతిష్ఠలకూ, కుటుంబగౌరవానికీ భంగం కలగకుండా నీ ఇష్టం వచ్చినట్టు బ్రతకమన్నాను. కాని... కాని...అది నన్ను సర్వనాశనం చెయ్యాలని సమకట్టింది. బ్రతికుండగానే నన్ను సమాధిచేయాలని చూస్తోంది. నిన్న నేను ఆఫీసునుంచి ఇంటికొస్తూంటే, ఇద్దరూ బహిరంగంగా ఒకరి చేతు లొకరు పట్టుకుని హుసేన్ సాగర్ రోడ్డుమీద నడుస్తూ వెళ్తున్నారు. నా ముఖం ఇంక ప్రపంచానికి ఎలా చూపించాలి? అతను వచ్చి తలుపు తట్టగానే నాదగ్గర్నుంచి లేచి అతని దగ్గరకు వెళ్ళిపోయేది. దాని హృదయంలో అమృతంతోపాటు విషం కూడా ప్రవహిస్తూంది. అది చల్లగా చూస్తే పండువెన్నెల కురుస్తున్నట్టుండేది. నవ్వినా మాట్లాడినా దేవతలా కనుపించేది. అలాంటి దేవతలో అంతర్గతంగా ఇటువంటి భయంకరమైన రాక్షసి దాగివుంది. నేను చూస్తుండగా అతనితో కులికితే నేను బాధపడతానని దానికి తెలుసు. కాని నేను బాధపడటంలో దానికి ఆనందం వుంది. నా గౌరవం, పరువు, కీర్తి మంటగలిసిపోయాయి. నలుగురుపిల్లల్ని కన్నది. నేను చర్యతీసుకుంటే దాని బ్రతుకేమవుతుందో దానికి తెలుసు. పిల్లలకోసమన్నా మారుతుందనుకున్నాను. మారలేదు. నాప్రాణం విసిగిపోయింది. చెప్పేశాను. నాయింట్లో తనకి స్థానం లేదని. తనకీ నాకూ బంధాలు తెగిపోయాయని...'

'ఏమంది? ఏడ్చిందా? క్షమించమని మీ కాళ్ళపై బడిందా?'

'లేదు. నవ్వింది. ఎంత నిర్లక్ష్యంగా నవ్విందని! క్షమించేవాణ్ణి, అది నన్నేమాత్రం అడిగినా, నన్ను వదిలి వెళ్ళలేనని ఒక్క కన్నీటిచుక్క విడిచినా దాని పాపాలన్నింటినీ క్షమించి, దేవతనులా నెత్తినవుంచుకుని పూజించేవాణ్ణి. కాని, నిర్లక్ష్యంగా, సంతోషంగా "వెళ్ళిపోతానులే!" అంది.'

'వెళ్ళిపోయిందా?'

'లేదు. "సాయంత్రం నువ్వు ఇంటికి వచ్చేసరికి వుండనులే! ఏదో కోపంలో అంటున్నావు వెళ్ళమని. అలాగే వెళ్తాను. కాని నా బాధ ఒక్కటే! నన్ను వదలి నీవు వుండగలవా?" అని అంది. పిల్లల్ని తీసుకువెళ్ళడానికి వీల్లేదు" అన్నాను. "ఏమన్నా సుఖపడగలనేమో చూడ్డానికి వెడుతున్నాగాని మాతృధర్మం నెరవేర్చడానికి కాదుగా!" అంది. జయలక్ష్మి! ఇంత నిర్దాక్షిణ్యంగా భగవంతుడు నన్నెందుకు పరీక్షిస్తున్నాడంటావ్!' అతను దీనంగా అడిగాడు. అతన్ని చూస్తే జయలక్ష్మికి జాలేసింది.

'రావుగారూ! భగవంతుడు చేసే ఏపని అర్థమైంది గనక! ఇది మనకి అర్థం కాలేదనుకోవడానికి! కాని, మీ ఆవిడ సత్యమూర్తిలో ఏముందని భ్రమిసి ఇలా మిడతలాగ ఎగిరిపోతూందో అంతుచిక్కడం లేదు. ఈ విషయం అలా వుంచితే సుశీల ఎలాంటి మనిషంటారు?'

'పరమనీచురాలు జయలక్ష్మి! పెంటపోగులో వున్న

దాన్ని తెచ్చి సింహాసనంమీద కూర్చోబెట్టాను. మా ఆఫీసులో వందరూపాయల జీతానికి పనిజేసేది. ఆ సంపాదనతో తల్లినీ, తమ్ముణ్ణీ పోషిస్తూ దుర్భరదారిద్ర్యాన్ని అనుభవించేది. సరైన తిండిగాని, బట్టగాని వుండేది గాదు. దాన్ని చూసి జాలిపడి ఆదరించాను. వివాహం కాకుండానే నాతో సుఖం పంచుకుంది. తనంత తా నెన్నడూ పెళ్లికి తొందర చేయలేదు. ఆ స్థితిలో నేను వదిలిపోయినా ఏమీ చేయగలిగేది గాదు. కాని ద్రోహం చేసే శక్తి నా నైజంలో లేదు. పెళ్లి చేసుకున్నాను. దానికి కోరిన నగలూ, బట్టలూ, వినోదాలూ—అన్నీ, అడక్కుండానే, అందించాను. దానితో పాటు వాళ్ల కుటుంబ భారమంతా నెత్తిన వేసుకున్నాను. తల్లి మరణించేదాకా నాదగ్గరే వుంది. దాని తమ్ముడికి చదువు చెప్పించి, పెళ్లిచేసి, ఉద్యోగ మిప్పించాను. ఇంత చేసినా దానికి రవ్వంత కృతజ్ఞతగాని, అభిమానంగాని లేవు.'

'అయితే మీరు మళ్ళీ పెళ్లి చేసుకుంటారా?'

'మళ్లీ బురదలో దిగమంటారా జయలక్ష్మీ! ఒకసారి చేసిన తప్పుకే నరకం అనుభవిస్తున్నాను. స్త్రీ కావాలంటే వివాహమే చేసుకోవాలా? ఈ రోజుల్లో యవ్వనంకంటే, స్త్రీసౌందర్యంకంటే బజారులో చవగ్గా దొరికేదేముంది? అయినా నాలాంటి వెర్రివాళ్లు వీధిలో పావలాకు దొరికేదానికోసం వ్యర్థత్యాగాలు చేసి జీవితం వృథా చేసుకుంటారు.'

'మరి పిల్లల్ని ఎవరు సాకుతారు?'

'అదే ఆలోచిస్తున్నాను. వాళ్లకి వాళ్లమ్మ దగ్గర

ఎక్కువగా అలవాటు లేదనుకోండి. దాయిదగ్గరే బాగా చనువు. వస్తాను. ఆకలిగా వుంది.'

'ఇక్కడ భోంచేయండి పోనీ!'

'వద్దులెండి!'

'ఏం. చేయకూడదా?'

'కూడదని గాదు. మీ ఆదరణ నన్ను ముగ్ధుణ్ని చేస్తూంది. మీ చేతి భోజనం తినే రోజు వస్తే - అంతకంటే ఈస్థితిలో నేను కోరుకునేది లేదు.'

'అలా అయితే ఆరోజుకోసం ఉపోషాలు చేస్తారా?'

'ఆరోజు ఎప్పుడొస్తుందో, పోనీ, మీరు చెప్పండి!'

జయలక్ష్మి ఆకాశంలోకి చూపెట్టింది. నాగసేనరావు పెదిమలపై విషాదం చిందింది.

జయలక్ష్మి దగ్గర సెలవు తీసుకుని నాగసేనరావు తాజ్‌మహాల్ హోటల్‌కు వెళ్లి కారు ఆపాడు. ఎవరెవరో పరిచయస్థులు కనిపిస్తున్నారు. నమస్కారాలు, ప్రతినమస్కారాలు, పలకరింపులు, పరామర్శలూ—సాయంత్రం ఏడయింది. విద్యుద్దీపాలు లోకంలో విషాదానికీ, తమకూ సంబంధంలేనట్టు వాటి దోవ నవి కాంతులు చిమ్ముతూనే వున్నాయి. వుమెన్స్ కాలేజీలోనుంచి గుంపులుగుంపులుగా సీతాకోకచిలుకల్లా రంగురంగుల రమణులు సౌందర్యాన్నీ, యవ్వనాన్నీ వీధులవెంట జిమ్ముకుంటూ, రోడ్డుపక్కల వినోదార్థులై నిలుచున్న యువకలోకాన్ని సర్కస్ కంపెనీలుగా మారుస్తున్నారు. నాగసేనరావుకి లోకం సాదాగానే, సాఫీగానే సాగుతున్నట్టు కనిపించింది. కాగితంపూల సినిమా

కోసం, వేలసంఖ్యలో కాళ్లు క్యూలో నిలబడ్డాయి. రెండం తస్తుల సిటీబస్సు దయ్యంలా రొప్పుకుంటూ వస్తోంది.

అలవాటు ప్రకారం కారు ఇంటికి పరిగెత్తుతూంది. ఇల్లు గుర్తుకొచ్చింది. సత్యమూర్తి గుర్తుకొచ్చాడు. అతన్ని చంపా లనిపించటం లేదు. జాలివేస్తూంది. అప్సరసలాంటి యవ్వనాన్ని వదిలిపెట్టి వచ్చాడు. ఇంటికి వెళ్లడానికి భయం వేసింది. వెనక్కి తిప్పాడు. కారు త్రాచుపాములా జారిపోతూ మెహిందీవైపు దారితీసింది.

# 28

మెహిందీ! మెహిందీ! మెహిందీ!!.

హైదరాబాదు మహానగరంలో సౌఖ్యాన్ని చిల్లరగానూ, టోకుగానూ, ఎంతకావాలంటే అంత, ఎలా కావాలంటే అలా, ఎప్పుడు కావాలంటే అప్పుడు కొనుక్కోవాలంటే మెహిందీని మించిన మార్కెట్ ఆంధ్రదేశంలో లేదు. అన్ని మతాలలోకీ మహమ్మదీయ మతం ప్రత్యేకత నిలుపుకొనడానికి కారణం-సుఖపడటం కూడా మానవుడి ధర్మాలలో ఒకటిగా అది శాసించడంవల్ల నే. నవాబ్ దర్జా అన్న పేరు వాళ్లకే సార్థకమైంది; మధువూ, మదవతీ ఈ రెండూ జీవితవిధానంలో ముఖ్యసాధనాలుగా, సుఖాన్ని ఘోంగించే ఊటలుగా, భూలోకాన్ని స్వర్గంచేసే దివ్యశక్తులుగా భావించి ఆరాధించే నవాబుబిడ్డ లెందరో

యౌవనసామ్రాజ్యాన్ని పాలించి ఆ సంస్కృతికై వదిలి పోయిన సుఖాలదిబ్బ ఈ మెహిందీ!

మెహిందీలో అమ్మబడే యౌవనం పావలానుంచి పాతిక వేలదాకా, పదేళ్లనుంచి పండువయసుదాకా ఆనేక రకాలు! ఒకసారి కాలుజారి బురదలోపడి దాన్ని కడుక్కో లేక అలానే జీవిస్తున్నవాళ్లూ, పొట్టగడవటానికి తేలిక మార్గమని భ్రమించినవాళ్ళూ, తలిదండ్రులప్రోద్బలానికి దాసులైనవాళ్ళూ, సాధారణసంసారజీవితంలో లభించే సౌఖ్యంతో సంతృప్తి చెందలేనివాళ్లూ, ఇవన్నీకాక కేవలం కులాసాకోసం, సరదాకోసం వెంపర్లాడేవాళ్ళూ, ఎన్నో రకాల విచిత్రవ్యక్తులు శరీరాన్ని పంకిలం చేయడానికి సిద్ధంగా నిలబడివుంటారా సుఖాల దిబ్బపై!

నాగసేనరావు ముప్ఫై అయిదేళ్ళ జీవితంలో పరాయిస్త్రీని గురించి ఆలోచించాల్సిన అవసరంగాని, కాలు జారాల్సిన అవకాశంగాని ఎన్నడూ రాలేదు. ఈ ఇరవైయ్యోశతాబ్దంలో అలాంటి ప్రవరు లున్నారంటే ఆశ్చర్యం కలగవచ్చు. కాని, ఇది కేవలం నిజం! అతని అందానికీ, హోదాకూ, డబ్బుకూ కాలుజారే అవకాశా లకూ ఏమాత్రం లోటు లేదు. అతనికోసం తపస్సు చేసిన వ్యక్తులుగూడా లేకపోలేదు. కాని, కేవలం ధర్మ చింతనవల్లకాక ఒకవిధమైన మానసికబలహీనత, లజ్జ అతణ్ని ప్రవరుణ్ని చేసినై, ఈనాడు అతను మెహిందీకి

బయలుదేరటం ఆశ్చర్యమే! కాని, హృదయంలో రేగు తున్న ప్రళయానికి తట్టుకోలేక అక్కడ విశ్రాంతి తీసు కుందామని బయలుదేరాడు. కారు పక్కగా ఆపి, తాళం వేసి, వంటరిగా నడుస్తున్నాడా దిబ్బమీద. ఒక మహా సామ్రాజ్యాన్ని పాలిస్తున్న సామ్రాట్టు ఎంత సగర్వంగా మాట్లాడగలడో అంత హుందాగా ఆ రమణులు మాట్లా డుతూ నవ్వుకుంటున్నారు. తాము చేసేది నీచమైన పని అనే ధ్యానం వాళ్లకున్నట్టు లేదు. ఓవ్యక్తి గళ్లలుంగీతో, జేబుక్రాఫుతో నాగసేనరావుని పలకరించాడు.

'క్యా సాబ్! స్టార్ వుందీ-చాలా హై క్లాస్!'

'ఎక్కడ?'

'అదిగో! ఎర్రమేడ లేదా-అక్కడా వుందీ. రండీ సాబ్!'

అతనివెంట నడిచాడు నాగసేనరావు. అదొక పెద్ద మేడ. దానికి కిటికీలు తక్కువేమో! సన్నటి సందుగుండా లోపల ఇరుకుగా వున్న చిన్నగదిలోకి తీసుకువెళ్లాడు. ఆ ఇంటికి కరెంటు లేనట్టుంది. ఒక పెట్రొమాక్సులైటు వెలుగు తూంది. నలుగురు స్త్రీలు కూచుని ఏదో తాగుతూ, తింటూ ఉన్నారు. మాంసం, మసాలా కలిసి కడుపును దేవుతున్న వాసన వేస్తున్నాయి. ఆగదికి కిటికీలు లేవు. ఏదో జుగుప్సా కరమైన వాసన. మతి పోతోంది. ఆస్త్రీలు నలుగురూ దయ్యాల్లాగా నవ్వుతున్నారు. అదంతా ఒక ప్రేతభూమి లాగ అనిపించింది. గదిలో ఒక పాత పట్టెమంచం, దాని

మీాద దుమ్ము రేగుతున్న పరుపు, మకిలికి నల్లబడిన తల గడాలు, ఓ విరిగిన కుర్చీ, మూలగా ఓ మట్టికూజా, దాని మీాద బోర్లించిన గాజుగ్లాసూ, గోడలమీాద పచ్చిశృంగా రాన్ని ఒలకబోస్తూ బొమ్మలు.

'ఖైటీయే సాబ్!' అన్నాడా వ్యక్తి.

ఆ మనిషిని నిలువునా నరికి ముక్కలు చేద్దా మన్నంత కసి రేగింది నాగసేనరావులో. ఛీ ఛీ! ఏం మను ష్యులు? ఏం దేశం? మగజన్మ ఎత్తిన వీరుడు. పురాణ భూమిలో పుట్టిన పతివ్రతలు! ఆ మహర్షుల రక్తం ఇంకా భారతహృదయంలో స్రవిస్తూంది!

నాగసేనరావు నుంచుండిపోయాడు. ఆ నలుగురు స్త్రీలూ పచ్చిగా మాట్లాడుతూ దగ్గరకొచ్చారు. అందులో ఒకర్తె ఒకగ్లాసు తెచ్చి నాగసేనరావు కందించింది.

'తాగు...కై పెక్కుతుంది బాగా!' అంది ఇంకో కర్తె!

గ్లాసు విసిరికొట్టి, గిరుక్కున వెనక్కి తిరిగి గది లోంచి బయటపడ్డాడు.

'ముందు గదిలో మరో తారాజువ్వ వుంది భాయీా!' అంటున్నాడా వ్యక్తి. వాళ్ళు నలుగురూ నోటికొచ్చినట్టు తిడుతున్నారు. తను కలెక్టరునన్న సంగతి వాళ్ళకు అర్థం గాదు. వస్తుంటే ముందు గదిలోనుంచి ఒక ఆడమనిషి బయటికొచ్చి అతని చెయ్యి పుచ్చుకుని లాగింది. నవ్వీ,

గబుక్కున కౌగలించుకుని అతని పెదిమలమీద ముద్దుపెట్టు కుంది. ఆమెను ఒక్కసారి విదిలించాడు. ఆమె తల గోడకు కొట్టుకుంది. నాగసేనరావు మొఖాన తుపుక్కున ఉమిసింది ఆ స్త్రీ.

'ఏమిటిది?' అని గర్జించాడు.

'మేరే రాజా! ఏ మొహబ్బత్ కీ షర్బత్ హై!' అంది. అధరామృతమనేమో ఆమెభావం. మొఖం తుడుచుకుని చరచరా నడిచి కారుదగ్గరకు చేరుకుని వెనక్కు చూడకుండా కారు నడుపుకుంటూ వెళ్ళి ఇల్లుచేరాడు.

రాత్రి రెండుగంట లయింది, దయ్యాలు తిరిగే సమయం! వీథివీథంతా నిశ్శబ్దంగా వున్నది. ఎక్కడో కుక్క ఏడుస్తున్నది. గూర్ఖావాడు సలాం పెట్టాడు. దాయి తలుపు తీసింది.

'అమ్మ వుందా?' అన్నాడు.

ఉండదని తనకు తెలుసు. అమెమాటకు తిరుగు లేదు. కఠినత్వానికి లోటు లేదు.

'వెళ్ళిపోయారు బాబూ!' అంది వణుకుతూ దాయి.

'పిల్లలు?'

'నిద్రపోతున్నారు. భోంచేస్తారా బాబూ?'

'ఆకలి లేదు' అంటూ తన గదిలోకి వెళ్ళాడు. బట్టలు విప్పలేదు. బూట్లు విప్పలేదు. అలానే మంచం

మీాద కూలబడిపోయాడు. నిద్రకోసం అటూ ఇటూ పొర్లాడు. ఎంతసేపటికీ కళ్లు మూతలు పడలేదు. లేచి సిగ రెట్టు ముట్టించాడు. ఎందుకో తెలియకుండా క్రిందకు దిగాడు. నలుగురు పిల్లలూ నిద్రలో మునిగిపోయారు. పసితనంలో వుండే గొప్పతనం అదే మరి! ఈ జీవితంతాలూకు నీడలు వాళ్ళని ఇంకా మలినం చేయలేదు. శైశవంలో వున్న మాధుర్యంలో అమరత్వ ముంది. అనిపించినప్పుడల్లా నవ్వి, అనుకున్నప్పుడల్లా మనసారా ఏడవగలిగే గుణం పిల్లల్ని దేవతల్ని చేస్తుంది. శైశవం దాటిపోతుంది. జీవితంలో అడుగుపెట్తాం. అనుకున్నప్పుడు నవ్వే శక్తినీ, ఏడ్చే శక్తినీ కోల్పోయి, నటించడం ప్రారంభిస్తాం. దాయి క్రింద కొంగు పరుచుకుని పడుకుని వుంది. ఆమె పదిసంవత్సరాలైంది ఈ ఇంట్లో ప్రవేశించి. సుశీల సుఖపడాలని ఆమెను కుదిర్చాడు. కాని ఈ పదేళ్లల్లో ఆమెనుగురించి తా నెన్నడూ ఆలోచించలేదు. ఎప్పుడోగాని ఆమెతో మాట్లాడ లేదు. అదైనా సాధారణ విషయాలు. ఎంతో నమ్మదగ్గ మనిషి. ఆమె ఎక్కడ పుట్టిందో, ఏం చదువుకుందో, బంధువు లెవరో తెలుసుకోడానికి తా నెన్నడూ ప్రయత్నించలేదు. ఒక మిత్రుడు పరిచయం చేసి, తన ఇంట్లో పనికిపెట్టాడు. బ్రాహ్మణులపిల్లనీ, చాలా నిదానం, గ్రహింపూ, తెలివీ, మంచితనం గల మనిషనీ తెలుసు. నలుగురు బిడ్డలకూ రక్తం పంచి కని పెంచిన తల్లి వాళ్ళను వదిలిపోయింది. ఇంక దాయి మిగిలింది. దురదృష్టదేవత

నీడ సోకి, దుఃఖానికి నిలయమైపోయిన ఆ గృహంలో ఇక ముందు ఆమె నిర్వహించబోయే పాత్ర అల్పమైంది గాదు. ఆమెకేసే తదేకంగా చూస్తూ నిలబడ్డాడు. వయస్సు ముప్పై సంవత్సరా లుంటుంది. తన ఇంట్లో నివసించిన ఈ పది సంవత్సరాలలో ఆమెలో ఏలోటూ కనిపించలేదు. ఎన్నడూ ఇంటిని వదలి బయటకు పోయినట్లు జాడగూడా లేదు. ఉప్పూ కారం తింటూ కోర్కెలను జయించలే మంటారు. ఈమె ఎట్లా జయించింది? ఆమె నిద్రపోతోంది. కాని, కళ్లు చెమ్మగా వున్నాయి. నీటితెర కళ్లల్లోంచి పొంగుతూంది. ఈ అనంతకోటి ప్రాణులలో ఎవరి హృదయంలో ఏ మహాగ్ని మండుతున్నదో, పతనమైన ఏ ఆశలు మూల్గుతున్నవో, నీర సించిన ఏ కోర్కెలు ఏడుస్తున్నవో ఎవరు చెప్పగలరు? ఎవరు శోధించగలరు?

నాగసేనరావు కళ్లు కడసారి బిడ్డను చూస్తున్నాయి. ఆ మూడేళ్ళ పాప ముమ్మూర్తులా తల్లి పోలిక. దగ్గరకెళ్ళి ముద్దుపెట్టుకున్నాడు. కొంచెంగా కదిలి చివరకు లేచింది. గుండెలకు హత్తుకున్నాడు. తన హృదయం మాతృవాత్స ల్యంతో స్పందిస్తూంది. అలికిడికి దాయి లేచింది.

'మీరా బాబూ!''

''పాప లేచింది పద్మా! తీసుకో!'' అంటూ పాపని ఆమెకందించి మేడమీదకు వెళ్లిపోయాడు నాగసేనరావు.

# 29

సత్యమూర్తి ఇంతకు తెగిస్తాడని జయలక్ష్మి ఎన్నడూ అనుకోలేదు. ఇంటినీ, భర్తనూ, బిడ్డలనూ వదిలివచ్చిన సుశీలను సరాసరి తన ఇంటికే తీసుకువచ్చాడు. అతను తీసుకు రావడంమాట అటుంచి, అసలు ఆమె ఎలా వచ్చింది? ఆమెను క్రిందిగదిలో కూర్చోపెట్టి పైకి వచ్చాడు సత్యమూర్తి. భర్తతో మనసు విప్పి మాట్లాడి ఆర్నెల్లు దాటింది. కాని సత్యమూర్తి మాట్లాడే ధోరణిలోగాని, పలకరింపులోగాని పెళ్ళినాటికీ ఈనాటికీ రవ్వంతా తేడా లేదు.

'జయా! పడుకున్నా వేం...వంట్లో బాగా లేదా?'

'బాగానే వుంది.'

'ప్రొద్దు క్రుంకకుండా ముసుగుపెట్టుకు పడుకుంటే వంట్లో బాగుండలే దనుకున్నాను!'

'అనవసరమైన పరామర్శ లెందుకు? నేనేమైతే నీ కెందుకు? నువ్వు చెప్పదలుచుకున్న దేమిటో చెప్పు! డబ్బు కావాలంటే అవిగో తాళంచెవులు! తీసుకెళ్లు.'

సత్యమూర్తి నవ్వాడు. అదే నవ్వు! అదే చూపు.

'జయా! చాలా కోపంగా వున్నట్టున్నావ్! కాని... నీ కింకా ఆగ్రహం కలిగించాల్సి వస్తూంది.'

'ఏమిటి?'

'సుశీల మొగుణ్ని వదిలి వచ్చేసింది!'

'తెలుసు.'

'ఇక్కడికి తీసుకొచ్చాను. కొన్నాళ్లు మనింట్లోనే వుంటుంది.' జయలక్ష్మికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు.

'ఏం మాట్లాడవ్?'

'ఏం మాట్లాడాలి?'

'నీ కిష్టమేనా?'

'నేను ఇష్టపడతాననే తీసుకొచ్చావా?'

సత్యమూర్తి జవాబు చెప్పకుండా క్రిందికిదిగి వెళ్ళిపోయాడు. వంటమనిషి రత్తమ్మను పిలిచి మరొకరికి భోజనం వండుతూండాలని ఆజ్ఞ జారీచేశాడు. పనిమనిషితో డ్రాయింగ్ రూం ఖాళీచేయించి సుశీలకు వసతి ఏర్పాటు చేశాడు. రత్తమ్మ తీరిక చేసుకుని పైకి వెళ్లి, జరుగుతున్న కథంతా జయలక్ష్మికి చెప్పింది. ఆమె అంతా విన్నది. కాని మాట్లాడలేదు. ఏవో ఆలోచనలు మసకమసకగా మనస్సు చుట్టూ పొరలు సృష్టిస్తున్నాయి. తనజీవితం తనకే వింతగా కనిపిస్తోంది.

ఒక గంట పోయాక సత్యమూర్తి సరాసరి సుశీలను తీసుకుని పైకి వచ్చాడు. సుశీల గదివెలుపల నుంచుంది. సత్యమూర్తి లోపలికి వచ్చి, 'జయా! సుశీల నిన్ను చూడటానికి వచ్చింది. బైటనుంచుంది. నువ్వు లోపలకు రమ్మంటే గాని రాదు' అన్నాడు.

జయలక్ష్మి ఉద్రేకంతో ఊగిపోతూ అంది—'నేను

రమ్మంటేనే ఈ ఇంటి కొచ్చిందా ఆ దెయ్యం? నన్నడిగే నా జీవితం నాశనంచేసిందా రాక్షసి?'

సుశీల ఈమాటలు వింటూ గదిలోకి వచ్చి జయలక్ష్మికి నమస్కరించింది. జయలక్ష్మి ఛీత్కారం చేసింది.

'జయల      మీకు చేయరాని ద్రోహం చేశానని నా అంతరాత్మకు తెలుసు. ఇదే తప్పయితే నేను తప్పకుండా అందుకు తగిన శిక్షను అనుభవిస్తాను. ఈ ఇంట్లో నేనుండటం మీరు సహించగలరని నేను అనుకో లేదు. రేపే వెళ్లిపోతాను' అంటూ నమస్కరించి వెళ్లిపోయింది సుశీల. సత్యమూ ర్తి క్షణం నిలబడి సుశీలను అనుసరించాడు.

జయలక్ష్మిని ఇన్నాళ్లుగా వేధించిన సమస్య ఒక్కసారి పరిష్కారమైపోయిన ట్లనిపించింది. ఇన్నాళ్ళూ ఆశ తనను వదిలిపెట్టలేదు. నైరాశ్యాంధకారం చుట్టుముట్టినా ఏ అంతరాళంలోనో ఒక్క ఆశాకిరణం తళుక్కుమనేది. ఇప్పు డా ఆశా లేదు. సత్యమూర్తిమీద మిగిలిన ఆశ ఇంక తనకి లేదు. తన జీవితంలో ఒక      యం ముగిసింది. ఒక్కసారి లేచింది. లైటు వెలిగించింది. బీరువాలోని నిలువుటద్దంలో చూసింది. తన హృదయకలశంలోని మధువంతా అలాగే వుంది. తలంతా రేగింది. ఆ రేగటంలో గూడా ఓ క్రమం వుంది. సృష్టిలో దురదృష్టానికి గూడా ఏదో మహార్థ ముండివుంటుంది. చీర నలిగింది. జాకెట్ తడిసింది. మహోద్రేకం చల్లారి చెమటలు పోశాయి.

లోంచి బయటికిచూసింది. పుచ్చపువ్వులా విరిసింది వెన్నెల. ఎంత చిత్రమైనదీ జీవితం! ఆశ్చర్యాల సంపుటిలా వుంది. ఒక లాటరీలాగ వుంది. రెండుసత్యాల మధ్య ఒక మధుర మైన అసత్యంలాంటి దీ జీవితం. కాని ఆ సత్యం స్వప్నంలా నిజమనిపిస్తుంది. జీవనజ్యోతి ఆరిపోతే కల విరిగిపోతుంది. ఈ బాధలూ, వ్యథలూ, ద్వేషాలూ, రోషాలూ, సౌఖ్యా న్వేషణా...కన్నీరూ, మమతలూ, మాలిన్యాలూ అన్నీ అదృశ్యమైపోతాయి. కాని జయలక్ష్మి కింకా జీవితంమీద భ్రాంతి పోలేదు. దూరదూరంగా ఏవో ఆశలు పిక్కటిల్లుతు న్నాయి. బ్రతకమంటున్నాయి. అది ప్రాణిలక్షణం. ఆ లక్షణంవల్ల నే సృష్టి ఇంతకాలంనిలిచింది. లేకపోతేఎన్నడో అంతమైన అదృశ్యమై పోయేది.

అద్దంలో తనమూర్తి మనోజ్ఞంగా వెలుగుతూంది. ఎందుకు విసర్జించాలీ జీవితాన్ని? నే చేసిన అపరాధ మేముంది? 'పరమేశ్వరా! నాకు దోవ చూపించు' అంటూ మంచంమీద వాలిపోయింది. నిద్రకాని నిద్ర-తీవ్రమై మత్తు కలిగించిన దుఃఖం ఆమె నావహించి,ఆమెఅచేతన అయింది. ఒకరాత్రివేళ 'నేను చావను-నేను ఆత్మహత్య చేసుకోను. నేనేం చేశాను? భగవంతుడుగూడా దుర్మార్గుడే! నేను చావను' అంటూ పిచ్చిగా నవ్వుతూ కేకలు పెడ్తున్న జయ లక్ష్మిని సత్యమూర్తి పలకరించి ముఖాన నీళ్లు జల్లి ఉప చారం చేశాడు. తెలివి వచ్చింతరువాత జయలక్ష్మి సత్య మూర్తిని చూసి మొఖం అవతలకు తిప్పింది, సత్యమూర్తి

మాట్లాడకుండా క్రిందికి వెళ్ళిపోయి వంటమనిషి రత్తమ్మను పంపించాడు. ఆ రాత్రి రత్తమ్మ అక్కడే పడుకుంది.

మర్నాడుదయం సత్యమూర్తి కనిపించినపుడు జయలక్ష్మి చెప్పింది.

'మూర్తీ! నీమీద కోపగించుకునే శక్తికూడా నాకు లేదు. నీ మార్గం వేరు, నా మార్గం వేరు. మన మనస్సులు కలవలేదు. అది నాతప్పే కావచ్చు. ఎవరిదైనా, విధి ఇలా వుంది. స్నేహంగా వుందామని బంధం కలుపుకున్నాం. స్నేహంగానే విడిపోదాం. నువ్వు నాకు ఒక సాయం చెయ్యాలి. ఇది కడసారి నిన్ను అడిగే కోరిక.'

'ఏమిటి చెప్పు జయా! నీ వేమడిగినా చేస్తాను.'

'నాకు తెలుసు! నీ జీవితాన్ని నిర్ణయించే విషయం తప్ప ఇంకేమడిగినా చేస్తావు!'

'అలా కాదు... చెప్పు, నీకేం కావాలో?'

'దయుంచి నా కళ్ళముందునుంచి వెళ్లిపో! మళ్లీ బ్రతికుండగా నాకు కనిపించబోకు. ఇంతకంటే నేను కోరతగింది ఏమీ లేదు. నువ్వు నాకు చేయాల్సిన సాయమూ లేదు!'

# 30

సత్యమూర్తీ, సుశీలా బర్కత్‌పూరాలో ఓ ఇల్లు అద్దెకు తీసుకుని వెళ్లిపోయారు. సుశీల వెళ్లిపోయాక నాగసేన

రావు ఎలావున్నాడో చూడాలనిపించి జయలక్ష్మి మొర్నాడు ఉదయం బయలుదేరి వెళ్ళింది. నాగసేనరావు రెండు నెలలు ఆఫీసుకు శెలవు పెట్టాడు.

'ఇంక ఉద్యోగం చెయ్యనేమో జయలక్ష్మి!' అన్నాడు. పిల్లలందరికీ దాయి పద్మ నీళ్ళుపోసి బడికి పోవటానికి ముస్తాబు చేస్తూంది. నాగసేనరావు మొఖం కొంచెం వాడిందిగాని, చూడటానికి మామూలుగానే వున్నాడు. నున్నటి గడ్డం అదేసిలిమతో మెరుస్తూంది. కొందరు ఎంత కష్టాల్లో గూడా సాధారణ దిన చర్యలను నిర్లక్ష్యం చెయ్యరు.

'పిల్లలు ఆవిడకోసం బెంగపెట్టుకున్నారా?' అంది జయలక్ష్మి.

'సరే! ఆమాత్ర ముంటే ఇంక లేనిదేముంది? అది ఎన్నడూ వాళ్ళని తల్లిగా ఆదరించలేదు. కాని-అదిగూడా ఇప్పుడు ఉపకారమే అయింది లెండి. వాళ్ళు దానికోసం దిగులుపడటం జరగదు.'

'మరి మీరు?'

'నేనా?...నిజమే! అది బాగా అలవాటైపోయింది. దాన్ని వదిలివుండటం ఎంత దుర్భరమో ఇప్పుడు అనుభవిస్తున్నాను' అన్నాడు తను విచారంగా.

'మళ్ళీ ఆవిడ వచ్చి క్షమించమంటే ఇంట్లోకి రానిస్తారా?'

'అది రాదు.'

'వసే'...?'

'నాకన్నా దాని స్వభావం ఎరిగున్నవాళ్ళు ఎవరూ లేరు. అది రాదు.'

'మళ్ళీ పెళ్ళి చేసుకోగూడదూ ?'

'ఎందుకు ?'

'మీ కేమంత వయసు ముదిరిందని ?'

'పోనీ...ఎవర్ని ?'

'మీకు నచ్చిన వ్యక్తిని. మీరు కావాలంటే కోకొల్లలు.'

'కొల్లలనేమాట నిజమే! కాని వాళ్ళు నాకు నచ్చరు. నాకు నచ్చిన వ్యక్తి అంగీకరిస్తుం దనే ఆశ లేదు.'

'ఎవరు మీకు అంతగా నచ్చిన వ్యక్తి!'

'మీకు తెలుసు!' అతను జయకళ్ళల్లోకి చూశాడు.

జయలక్ష్మి అర్థంకానట్టు నటించి – సంభాషణ మార్చింది.

'రావుగారూ ! నే నేమైపోతానో అనే దిగులు నన్ను ప్రతిక్షణం తినేస్తూందండీ !' అంది దిగులుగా.

'ఏమౌతుందని మీ భయం?'

'ఏమన్నా కావచ్చు. కాని ఏదో భయంకర పరిణామమే జరుగుతుం దనిపిస్తూంది. నా కోసారి పిచ్చెక్కిన ట్టుంటుంది. నిజానికి మతిపోతే బాగుండు ననిపిస్తూంది. ఓ సారి ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తూంది. మరోసారి సన్యా

సినినై క్రిష్టియన్ మిషనరీలలో చేరిపోదా మనిపిస్తూంది. ఈ మనుష్యులనూ ఈ దుఃఖాల్నీ ఈ బాధల్నీ ఈ బంధాల్నీ వదిలి-ఎక్కడికో దూరంగా ఎగిరిపోవా లని పిస్తుంది. మీరు చెప్పండి. నే నిలా జీవించగల నంటారా''

'నా బ్రతుకే నాకు అర్థంగావడం లేదు, నేను మీ కేం చెప్పగలను జయలక్ష్మీ!'

ఇంచుమించు రోజూ వాళ్ళిద్దరూ కలుసుకుంటూనే వున్నారు. ఒక నెలరోజుల్లో వాళ్ళిద్దరూ ఎంతో ఆత్మీయు లయ్యారు. మరొక పరిస్థితిలో అయితే వారిద్దరూ అంత దగ్గరగా రావడానికి సంవత్సరాలుపట్టేవి. ఒకనాడు నల్లగా, పొడుగ్గా వున్న వ్యక్తిని తీసుకుని నాగసేనరావు ఇంటి కొచ్చింది జయలక్ష్మి.

అతన్ని క్రింద గదిలో కూర్చోబెట్టి తా నొక్కతే పైకి వెళ్లింది. నాగసేనరావు ఇంగ్లీషు డిటెక్టివ్ నవల చదువుతున్నాడు.

'రండి! మీకోసమే ఎదురుచూస్తున్నాను !'

'ఇవాళ అనుకోకుండా ఒక సంఘటన జరిగింది రావుగారూ!'

'ఏమిటది?'

'నన్ను ప్రాణంతో సమానంగా ప్రేమించిన వ్యక్తి ఈలోకంలో ఒక్కడే వున్నాడు. చూడటానికి ఎంత వికృ తంగా వుంటాడో-అంత మంచి హృదయ ముంది అతనిలో. అతను నాకోసం సర్వం ధారపోశాడు. చివరకు ప్రాణాలు

కూడా. అత నిప్పుడు నా సహాయం కోరి వచ్చాడు. కాని మీ సహకారం లేకుండా అతనికి నేను సాయం చెయ్యలేను.'

'ఎవ రతను ? ఏం కావాలి ? జరిగిందంతా చెప్పు జయా !'

''నేను ఇదివరకు చింతలపూడిబ్లాకులో ఉద్యోగం చేశాను. అప్పుడు కొందరు దుర్మార్గులు నా వెంటబడి, విఫలురై, నామీద పగబట్టి సాధించడం మొదలుపెట్టారు. వాళ్లకు ముకుందరావు అనే రాక్షసుడు నాయకుడు. అతడు నన్ను అవమానిస్తుంటే, ఈ బుల్లిరెడ్డి వచ్చి రక్షించాడు. అప్పుడు జరిగిన కొట్లాటలో 'ఆనందమూర్తి' అనే అతను బుల్లిరెడ్డి దెబ్బలకు మరణించాడు. బుల్లిరెడ్డిమీద కేసు నడిచింది. చివరకు ఉరిశిక్ష వేశారు. అది హైకోర్టులో ఖాయమైంది. ఇదంతా మీరు పేపర్లో చదివేవుంటారు. ఇప్పుడు తను జైల్లోంచి తప్పించుకుని పారిపోయి వచ్చాడు' ఆగింది జయలక్ష్మి.

'అవును. ఈ కేసుగురించిన వివరాలు పేపర్లలో చదివాను. అదిసరే! ఇప్పుడతన్ని ఏం చెయ్యాలంటావు?'

'నా ఇంటిమీద పోలీసుల కన్ను ఎప్పుడూ వుంటుంది. మీరంటే ఎవరూ అనుమానించరు. మీ ఇంటి దగ్గరకు రావడానికిగూడా వాళ్లకి గుండెలుండవు. మీరు దయుంచి కొన్నాళ్లపాటు అతన్నిక్కడ వుండనీయండి. ఆ తర్వాత నేను తీసుకు వెడతాను.'

'ఎక్కడికి తీసుకువెడతావ్?'

'ఎక్కడికైనా. ఈ ప్రపంచానికి దూరంగా ఏ కొండల్లోకో, లోయల్లోకో పోతాం. నా ప్రాణానికి ప్రాణం అడ్డంవేసిన ఆ వ్యక్తికోసం ఏమైనా చెయ్యాలనిపిస్తోంది. రావుగారూ! బ్రతికున్నవాళ్ళనే పీక్కుతింటున్న ఈ మనుష్యులకంటే ఆ అడవిమృగాలే నయంగదూ! ఏమిటో మళ్ళీ బ్రతకాలనిపిస్తోంది. ఈ జన్మ వృథాకాదనీ, దీనికీ ఒక ప్రయోజనం వుందనీ అనిపిస్తోంది.'

నాగసేనరావు అంగీకరించాడు. బుల్లిరెడ్డి నాగసేనరావుకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించాడు. క్షవరం చేయించుకుని, స్నానం చేసి, నాగసేనరావు ఇచ్చిన బట్టలు కట్టుకున్నాడు. బుల్లిరెడ్డి ఎక్కువ మాట్లాడేవాడు కాదు. గదిలోంచి బయటికివచ్చేవాడుగాదు. కిటికీదగ్గర కూర్చుని, ఆకాశంలోకి దూరంగా, శూన్యంగా చూస్తూ కూర్చునేవాడు. జయలక్ష్మి వచ్చినప్పుడు మాత్రం ఆమెతో కులాసాగా కబుర్లు చెప్పేవాడు. అలాగే రోజులు దొర్లుతున్నాయి. జయలక్ష్మి ఆలోచనలన్నీ ఇప్పుడు బుల్లిరెడ్డిచుట్టూ తిరుగుతున్నాయి. అతనిలో అంత త్యాగముండటం ఆశ్చర్యమనిపించేది. 'నా దురవస్థకు నువ్వే కారణం' అని అతనెన్నడూ జయలక్ష్మిని నిందించలేదు.

'నీలాంటి వాళ్ళకోసం చావడంకూడా సుఖమేలే! అయినా నన్ను బ్రతికించుకోవాలని నీ కెందుకీ ఆదుర్దా? పోలీసువాళ్ళ కన్నుగప్పడం ఎవరి తరం? ఎప్పుడో పట్టు

కుంటారు. రాజమండ్రీ తీసుకుపోయి ఉరి తీసారు. ప్రాణం పోయేటప్పుడు ఎలా వుంటుందంటావ్?' అన్నాడు ఒకసారి.

జయల రోదిస్తూ అతని గుండెలకు తల బ్రద్దలు కొట్టుకుంటుంది. అతని శరీరం ఉక్కుతో నిర్మించబడినట్టు ఖంగున మ్రోగుతుంది.

'రెడ్డీ! అటువంటి అమంగళపుమాట లనకు. నువ్వు చావడానికి వీల్లేదు. నేను చావనివ్వను' అంది.

'బ్రతికి ఏం చేద్దాం? ఎక్కడుందాం?'

'ఎక్కడికన్నా పోదాం. మనుష్యులు లేని-చోటికి. నాకోసం ఇంతత్యాగంచేసిన నీకోసం నేనుఏమన్నా చేస్తాను రెడ్డీ! నా జీవితాన్ని నీకోసం ధారపోస్తాను. నేను నీదాన్ని. నన్ను పరిగ్రహించు రెడ్డీ! పరిస్థితులే-భగవంతుడే మనకి ఇలా వివాహం చేశాడు. నా దగ్గర డబ్బుకు లోటు లేదు. ఎక్కడికో పోయి మనం సుఖంగా బ్రతుకుదాం. అంతా మునిగింతర్వాతగాని నిన్ను తెలుసుకోలేక పోయాను. ముందే తెలుసుంటే...''

బుల్లిరెడ్డి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె పెదిమలు చిట్లి నెత్తురు చిమ్మింది. దృఢమైన అతని బాహువుల్లో ఆమెశరీరం ప్రళయానికి లొంగిన అడవితీగెలా వణికింది.

'అప్పుడే కాదు రెడ్డీ! మనం ముందు ఇక్కణ్ణుంచి వెళ్లిపోవాలి.పంచభూతాలు సాక్షులుగా పెళ్లి చేసుకుందాం. మన మనస్సులు సాక్షిగా! ఇంకా కావలసినంతవయస్సుంది. నా సమస్తం నీ కర్పిస్తాను. నీ కష్టసుఖాల్లో భాగం పంచుకుంటాను. నీ సుఖంకోసం నా జీవితాన్ని నీపాదాలముందు

వుంచుతాను. మన పవిత్ర ప్రేమానురాగాలకు అడవిజంతువులు సాధువులై, అమరులు పుష్పవర్షం కురిపిస్తారు. కాకులు దూరని కారడవిలో, చీమలు దూరని చిట్టడవిలో స్వర్గాన్ని నిర్మించుకుందాం. బ్రతికినంతకాలం నవ్వుల్లో, పువ్వుల్లో సుఖాల్లో, వెన్నెల్లో, కౌగిలివెచ్చదనంలో ఇద్దరం ఒకరై బ్రతుకుదాం. స్వర్గానికి నిచ్చెనలు వేద్దాం. అంతా మన మంచికే జరిగింది రెడ్డి!...నేను అతిగా వాగుతున్నానా? కొంపదీసి నా మతి భ్రమించడం లేదుగదా ? లేదు. లేదు. నేను నిజంగాభోయే కల కంటున్నాను. ఇన్నాళ్లకు నాకు నిజమైన ఆనందం లభించబోతూంది. అవునా! రెడ్డీ!...'

# 31

జయలక్ష్మి స్మృతిపథంలోనుంచి సత్యమూర్తి స్వరూపం పూర్తిగా అదృశ్యమైపోయింది. భవిష్యత్తునుగురించి క్రొంగొత్త కోర్కెలతో, ఆశలతో ఆమెశరీరం కాంతిని పుంజుకుని, మళ్లీ వికసించింది. సత్యమూర్తిని చూడాలనిగాని, చూస్తాననిగాని ఆమె ఎన్నడూ అనుకోలేదు. కాని ఒకనాడు సత్యమూర్తి సరాసరి ఆమెగదిలోకి వచ్చాడు. జయలక్ష్మి ఉలిక్కిపడింది.

'జయా! సుశీల చచ్చిపోయింది!'

జయలక్ష్మి నివ్వెరపోయి సత్యమూర్తికేసి చూసింది. అతనికి ఏడ్చే శక్తి వుందని ఆమెకు తెలియదు. మొదటిసారిగా అతని కళ్లల్లో నీరు చూసింది.

'జయా! ఆమెమీద నీకు కోపం ఇంకా పోలేదా?'

'ఏం జబ్బు చేసింది?'

'పొరపాటున కరెంటు ముట్టుకుంది. షాక్ తగిలి, పోయింది.'

'పాపం'

'కాని, చచ్చి సుఖపడింది. ఈ ఆర్నెల్లూ దుర్భర దారిద్ర్యం అనుభవించింది. నాకోసం ఎంత త్యాగంచేసిందో తల్చుకుంటే గుండె తరుక్కుపోతుంది.'

జయలక్ష్మి తల వంచుకు కూర్చుంది. మాట్లాడలేదు. మళ్ళీ ఎందుకు వచ్చినట్లీసత్యమూర్తి? తన జీవితంలోనుంచి పూర్తిగా చెరిపివేద్దామనుకున్న వ్యక్తి మళ్ళీ జీవితంలో ప్రవేశించడానికి యత్నం చేస్తున్నాడు.

'ఎందుకొచ్చినట్టు?' కఠినంగా ప్రశ్నించింది జయలక్ష్మి.

'డబ్బు కావాలి. రెండు వందలు. ఆమెకు కర్మకాండ జరిపించడానికి.'

జయలక్ష్మి మారుమాట్లాడకుండా బీరువాలోనుంచి రెండువందలు తీసి.సత్యమూర్తి కిచ్చింది.

'చాలా కృతజ్ఞుణ్ణి జయా! మళ్ళీ కనిపిస్తాను!'

'వద్దు మూర్తీ! నీ కేనాడో చెప్పాను. మన ఋణం తీరిపోయిందని. మళ్ళీ ఆ ప్రసక్తి తేకు.'

'ఆలోచించుకునే చెప్తున్నావా జయా!'

'బాగా ఆలోచించే చెప్తున్నా!'

సత్యమూర్తి వెళ్ళిపోయాడు. కాసేపటికి నాగసేన

రావు వచ్చాడు. సుశీల మరణించిన సంగతి అతనికి తెలిసినట్టు లేదు.

'విచిత్రం జరిగింది జయా! రాత్రి సుశీల మా ఇంటికొచ్చింది. నేను నిద్రపట్టక ఊరంతా తిరిగి, పదకొండు గంటలకు ఇంటికి చేరుకున్నాను. కారు గేరేజిలో వదిలి వస్తుంటే గుమ్మందగ్గర నిలబడివుంది సుశీల. "ఎవరు?" అని అరిచాను.

' "నన్నప్పుడే మరిచిపోతా రనుకోలేదు!" అంది.

' "నువ్వా? నువ్విప్పుడు ఎందు కిక్కడి కొచ్చావ్?"

' "లోపలికి పదండి చెప్తాను." అంది అడుగు వేస్తూ. ఆక్షణాన నా కేమిటో పిచ్చి ఆవేశం వచ్చింది.

' "నువ్వు ఇంక నా ఇంట్లో అడుగు పెట్టడానికి వీల్లేదు" అన్నాను.

' "ఒకసారి నామాట వినండి! నన్ను మన్నించండి. పోనీ, పిల్లల్ని ఒక్కసారి చూసివెళ్లనివ్వండి. మీా కిష్టం లేకపోతే మళ్ళీ ఎన్నడూ మీాకు ముఖం చూపించను. శపథం చేస్తున్నాను." సుశీల అందమైన చెక్కిళ్లు కన్నీళ్ళతో మలినం అవుతున్నాయి. నామనస్సు కొంచెం జంకింది. తల్లీబిడ్డల బంధం తెంచుకుందామన్నా తెగదని నాకు తెలుసు. ఒప్పుకున్నాను. లోపలి కొచ్చింది. పిల్లల్ని లేపింది. వాళ్లు బావురుమంటూ ఆమెను కౌగలించుకున్నారు. నేను మేడమీాదికి వెళ్లిపోయాను. రెండుగంటలు పోయాక ఆమె పైకి వచ్చింది.

'"మీకభ్యంతరం లేకపోతే...మీరు క్షమిస్తే - మీదగ్గరే వుంటాను" అంది మెల్లిగా.

'నావళ్లు మండిపోయింది. తిట్టాను. "అది అసంభవ" మని ఖచ్చితంగా చెప్పాను.

'"మీ ఇంట్లో దాసీలా వుండనివ్వండి పోనీ. మీరు డబ్బుపెట్టి కొనుక్కునే స్త్రీల్లా నన్నూ వుండనివ్వండి. భార్యకిచ్చే గౌరవం నాకు ఇవ్వమనడం లేదు" అంది. కాని నాకు తెలుసు. పే రేది పెట్టినా జరిగేది ఒక్కటే. నా మనస్సు నా కెదురుతిరిగింది. చివరకు ఆమెను పంపివేశాను. మళ్లీ అడుగుపెట్టవద్దని చెప్పాను. కాని ఇప్పుడు అనిపిస్తోంది జయా! ఆమెను క్షమించివుంటే బాగుండేదని' నిట్టూర్చి జయలక్ష్మిముఖంలోకి చూశాడు.

'సుశీల ఆత్మహత్య చేసుకుంది రావుగారూ! ఇప్పుడామె మీ క్షమాభిక్ష స్వీకరించే స్థితిలో లేదు.'

'ఏమిటి నువ్వనేది? ఎప్పుడు...ఎవరు చెప్పారు?'

'ఇప్పుడే మూర్తి వచ్చి చెప్పాడు. కర్మకాండకు కావాలని డబ్బుకూడా తీసుకెళ్ళాడు.'

ఆకాశం విరిగినట్లై, భూమి బ్రద్దలైనట్లై నెత్తురు కక్కుకుంటూ, వెర్రిగా బయటికి పరిగెత్తాడు నాగసేనరావు!

* * *

ఇంక అలస్యం చేయకుండా తమ ప్రయాణానికి సన్నాహం చేయడం అవసర మనుకుంది జయలక్ష్మి. వేణును పిలిపించి చేయదలుచుకున్నదంతా చెప్పి-

వేణూ! నేను నిశ్చయించుకున్నాను — మళ్ళా నా

ముఖం ఈ ప్రపంచానికీ, ఈ మనుష్యులకూ చూపించకూడ దని. వెళ్లేముందుగా నా ఆస్తి అంతా సత్యమూర్తికి వ్రాసి పోతున్నాను. ఇవిగో పత్రాలు - అతని కందించు. అతన్ని మళ్ళీ చూడా లనిపించడం లేదు. ఇదిగో!...ఈ ఉత్తరం కూడా సత్యమూర్తి కియ్యి!'

జయలక్ష్మి ఆ ఉత్తరంలో ఇలా వ్రాసింది:

'సత్యమూర్తీ!

కొందరు మనుష్యులు కేవలం సుఖపడటానికే ఈ లోకంలో పుడతారు. అలాంటి జీవితం నీది. మరికొందరు కేవలం బాధపడటానికే పుడ్తారు. నేను అందుకే పుట్టాను. ఈ సిరిసంపదలు నన్ను సుఖపెట్టలేదు. ఇకముందు సుఖ పెడతా యనే ఆశకూడా లేదు. నా జీవితరహస్యం ఇందు లోనే వుందేమో! ప్రపంచంలో మనిషికి సుఖమిచ్చే యవ్వనం, సౌందర్యం, సిరిసంపదలూ, మధుపానీయాలూ, జననీ, జన్మభూమీ ఏదీ నాకు సుఖాన్ని ఇవ్వలేకపోయాయి. ఇలాంటివి అనుభవించడానికి కావల్సిన మనోకౌశలం నాలో లేదు. నేను అలా పుట్టాను. ఇటువంటివి నీకోసమే! వాటితో నీలాంటివాళ్ళే సుఖపడగలరు. అందుకే నీకే నా సమస్తం అర్పించి వెళ్తున్నాను. నీది కాని-

జయ.'

జయ అనుమతి లేకుండానే ఆ ఉత్తరాన్ని చదివాడు వేణు. జయకూడా అభ్యంతరపరచలేదు.

'జయా! నువ్వు సత్యమూర్తిని ప్రేమించలేదా?' అన్నాడు.

'లేదు.'

'మరి పెళ్ళెందుకు చేసుకున్నావ్?'

'నువ్వు చేసుకోకుండా విసర్జించావు గనుక!'

వేణు గతుక్కుమన్నాడు.

'పోనీ! ప్రేమించినవాణ్ణే మరొకర్ని చేసుకోక పోయావా?'

'నేను కావాలనుకున్నవాళ్ళు నాకు దొరకలేదు.'

'మరి బుల్లిరెడ్డిని పెళ్ళిచేసుకుంటా నంటున్నావ్? అతన్ని ప్రేమించావా?'

వేణు ఇంత తీవ్రంగా ప్రశ్నలు వెయ్యడం జయలక్ష్మిని బాధించింది.

'వేణూ! నీవల్ల నేను నాశనమయ్యాను. నువ్వు నన్ను దగ్గరకు తీశావు. ఎన్నో ఆశలు నీమీద పెట్టుకున్నాను. పెళ్ళిచేసుకుని నీకు భార్యగా, నీ నీడలో, ప్రశాంతంగా, తక్కిన ప్రపంచంతో సంబంధం లేకుండా బ్రతకాలనుకున్నాను. కాని అందరిలాగే నీ స్వార్థం నువ్వు చూసుకున్నావ్!'

'కాదు జయా! సత్యమూర్తి మీగురించి చాలా భయంకరమైన విషయాలు చెప్పాడు. నేను సాహసించలేక పోయాను.'

'అవి నిజమని నువ్వు నమ్మావ్?'

'మొదట నమ్మాను. ఆ తర్వాత సత్యమూర్తి చెప్పాడు – తాను చెప్పిన దంతా కట్టుకథని. చాలా బాధ

పడ్డాను. కాని, అప్పటికే చెయ్యిదాటిపోయింది. నువ్వు పరాయిదానివయ్యావు.'

'అలాంటి సత్యమూర్తితో నేను జీవితాంతం బ్రతకడం సాధ్యమంటావా చెప్పు?'

'కాని, బుల్లిరెడ్డి అంతకంటే...?'

'నువ్వలా అనుకుంటున్నావ్ కాని అతడు నాకోసం ఎంతత్యాగం చేశాడో ఊహించుకో! అందులో పదోవంతు త్యాగం నువ్వు చెయ్యలేకపోయావ్! నూరోవంతు సత్య మూర్తి చెయ్యలేడు.'

వేణు సిగ్గుపడ్డాడు. ఆ రాత్రికే ప్రయాణం. ముందు కలకత్తా వెళ్ళాలని ఉద్దేశ్యం. వేణు వెళ్లి ఫస్టుక్లాస్ సీట్లు రిజర్వుచేయించుకొచ్చాడు. బుల్లిరెడ్డిపేరు మాధవరావుగా మారింది. వేషం మారింది. ఎక్కువ సామాను తీసుకో లేదు. ఎక్కువ డబ్బుకూడా తీసుకోలేదు. రాత్రి తొమ్మిది గంటలకు బయలుదేరుతుంది ఎక్స్‌ప్రెస్. ఏడుగంటలకు ఆకాశంనిండా మబ్బులు కమ్మి జోరున వాన ప్రారంభమైంది ఈదురుగాలి కొడుతోంది. టాక్సీ తెప్పించుకున్నారు వేణు ఒక్కడే రైలు ఎక్కించాలి వాళ్ళని. ఇల్లు వదిలి వచ్చే ముందు అన్నిగదులూ ఒక్కసారి కలయతిరిగింది జయలక్ష్మి. ఆ ఇంటికీ, తనకూ ఋణం తీరిపోయింది. తాను మళ్ళీ ఆ ఇంట్లో అడుగుపెట్టదు. రక్తాశ్రువులు ఆమెచెక్కిళ్లపై కారు తున్నాయి. జీవితంలో ఏ విషయమూ తనకు అర్థంకావడం లేదు. ఇంటికి తాళంవేసి తాళంచేతులు వేణు కిచ్చింది. రైలుస్టేషనుకు వెడుతున్నంతసేపూ ఆమెకు భయంగానే

వుంది. పోలీసులకి అతను పట్టుబడా లేమోనని. నాంపల్లి స్టేషనులో రైలు బయలుదేరింది. వేణు శెలవు పుచ్చుకున్నాడు. నాలుగు బెర్తు లున్న కంపార్టుమెంటది. దాంట్లో ఇంకెవరూ లేరు. బుల్లిరెడ్డీ, జయలక్ష్మి ఇద్దరే! మరో ప్రపంచానికి ద్వారాలు తెరవాలని వెడుతున్న యాత్రికులు. రైలు పెట్టె తలుపు వేస్తుంటే జయలక్ష్మికి తల్లి గుర్తుకొచ్చింది. ఆమెఆత్మ అనంతవిశ్వంలో ఏమూల విశ్రాంతి తీసుకుంటున్నదో! 'అమ్మా! నేను జీవితంలో పొందింది ఏమిటో. పోగొట్టుకున్నది ఏమిటో నాకే తెలియడం లేదమ్మా!' అనుకుంటూ. వెనక్కి పరుగెత్తుతున్న హైద్రాబాదు దీపాలను చూస్తూ అచేతనయై నిలిచిపోయింది జయలక్ష్మి.

# 32

ఇరవై ఏడు వసంతాల చవిచూచిన జీవితం తనది. ఏ అనుభూతులు మానవత్వానికి లక్షణాలో అవే తనకి వికృతంగా తోస్తున్నాయి. జీవితాన్ని గురించి ఆలోచించి ఆలోచించి తను విసిగిపోయింది. ఈమనుషులూ, ప్రేమలూ, సుఖాలూ, పెళ్ళిళ్ళూ, ఏడుపులూ, రోగాలూ, కష్టాలూ, ద్వేషాలూ, చావులూ అన్నీ ప్రళయగర్జన చేస్తున్నట్టనిపించింది. ఇంత అల్పమైన జీవితం కోసం ఇన్నాళ్ళూ తనెందుకు బాధపడిందో ఆశ్చర్యమనిపించింది. క్షణకాలం మాత్రం పరిమళాలు విరజిమ్మే పుష్పంలా త్రుటికాలం వెన్నెలలు విరిసి మరుక్షణం పాలిపోయి రాలిపోతుం దీ జీవితం! ఎంతకాలం

సాగిం దీ మహాయాత్ర! సృష్టి అసలు ఎప్పుడు ప్రారంభ మైంది? ఎప్పుడు అంతమవుతుంది? ఏ మహాగంభీరసముద్రంలో లీనం కావాలని వదిలిపోతున్న దీ కాలవాహిని? కాలం ఆగ లేదు. క్షణం విశ్రాంతి లేకుండా పరిగెత్తుతున్నది. తనూ ఆగ లేదు. తనకూ త్రుటికాలం నిలకడ లేకపోయింది. తనకు బ్రతకటం చేతకాలేదు. చేతనైనవాళ్లెవరూ అనవరతం గతాన్ని గురించి బాధలతోనూ, భవిష్యత్తును గురించి బరువులతోనూ వ్యథపడుతూ వర్తమానాన్ని ఆవిరి చేసుకోరు.

బుల్లిరెడ్డి నిద్రపోతున్నాడు. కొందరు నిద్రపోతున్నప్పుడు అదంగా వుంటారు. కాని చాలామంది వికృతంగా వుంటారు. నిద్రపోతున్న బుల్లిరెడ్డి మరీ భయంకరంగా వున్నాడు. ఏమిటి భగవంతుడి చిద్విలాసం! ఎంత వైవిధ్యం సృష్టిలో! సౌందర్యంపక్కనే వికృతత్వం, యౌవనం కౌగిలిలో జరత్వం, వెలుగు నంటి నీడ, సుఖాన్ని ఆవరించే దుఃఖం! బుల్లిరెడ్డి విషయంలో తనని గురించి లోకం ఎంత అసహ్యంగా చెప్పుకుంటూందో? ఇంత లేతవయసులో తను జీవితపు చరమదశ గూడా అనుభవిస్తూంది. జీవితాన్ని గురించి తా నింతకాలమూ ఎంతో ఆశించింది. సుఖంకోసం పరిగెత్తింది. శాంతికోసం ఆరాటపడింది. అందుకే తనకి అశాంతి మిగిలింది. తాను వెన్నాడిన కొద్దీ సుఖశాంతులు తనకు దూరంగా పోయాయి.

జయలక్ష్మికి నిద్రరావడం లేదు. రైలు నడుస్తూంటే ఆ కదలిక ఉయ్యాలలా ఊపుతోంది. సగంనిద్ర తూలు కొస్తూంది. కాని నిద్రపోవా లనిపించడం లేదు. ఏవో

ఆశలూ, ఆలోచనలూ, స్మృతులూ ఆమె మనోఫలకం మీద మసలిపోతున్నాయి. వేణుతో స్నేహం, మాతృదేవి తన కంటించిన మాలిన్యం, తల్లిని పగబట్టిన తన మనస్సూ, నాలిముచ్చు ముకుందరావూ, బుల్లిరెడ్డిని పోలీసులు సంకెళ్లు వేసి తీసుకుపోవడం, తల్లి మరణించడం, వేణు పెళ్ళాం పిల్లలతో తనని వెక్కిరించడం, సత్యమూర్తి చిందించిన విషం, నాగసేనరావు కోరికల దురదృష్టం, మాతృత్వాన్ని భరించలేక స్త్రీగా బ్రతికి నశించిన సుశీలా, బుల్లిరెడ్డి ప్రవేశం, క్రొత్త ఆశ, విసుగు, చికాకు, ఏవగింపు...మనస్సంతా రైల్వేప్లాట్‌ఫారంలాగ వుంది.

రైలు సాగిపోతూంది. దోవలో టికెట్‌కలెక్టరు వచ్చి టికెట్ చెక్ చేసిపోవడం జరిగింది. తెల్లవారింది. రైలు విజయవాడ ప్లాట్‌ఫారంపై ఆగింది. పెట్టె తలుపులు తెరవడానికి గూడా జయలక్ష్మికి ధైర్యం చాలటంలేదు. బుల్లిరెడ్డి తలుపుతీసి క్రిందికి దిగాడు. ఏదో భయం ఆమెను ఆవహించింది. అతన్ని లోపలికి పిలిచి, తలుపువేసి, 'వెళ్లబోకు రెడ్డీ! నీముఖం బయటి ప్రపంచానికి చూపించబోకు' అంటూ అతన్ని దగరకు తీసుకుంది. బుల్లిరెడ్డి వెన్నలా కరిగిపోయాడు.

'పిచ్చిదానా! ఎప్పటికైనా నన్ను పోలీసులు పట్టుకు ఉరితీస్తారు. నామీద మమకారం ఎందుకు పెంచుకుంటావ్! తర్వాత ఏడ్చినా, తలపగలగొట్టుకున్నా ప్రయోజనం లేదు. మృత్యువు దూరంగా వున్నప్పుడు మనం భయపడినట్లు

మృత్యుదేవికౌగిట్లో వున్నప్పుడు బాధపడమేమో!'
అన్నాడు బుల్లిరెడ్డి.

కళ్ళు మూసుకుంది జయలక్ష్మి. ఏమిటో ఆందోళన. ఏదో కీడు జరుగుతుం దనిపిస్తుంది. ఒక్కసారి ఉప్పెనలా లేస్తుంది. బుల్లిరెడ్డిని చూస్తుంది. మళ్లీ మెల్లగా కళ్లు మూస్తుంది. రైలు త్వరగా కలకత్తా చేరితే బాగుండు నని పించింది.

రాజమండ్రిస్టేషనులో ఎవరో తలుపుతట్టారు. ఆమె వణుకుతూనే తలుపు తీసింది. ఎదురుగా పోలీసులు! సబ్ ఇనస్పెక్టరూ, కానిస్టేబుల్సూ లోపలకు వస్తూనే బుల్లిరెడ్డికి సంకెళ్లు వేశారు. బుల్లిరెడ్డి నోట మాట లేదు. చూపుల్లో భావం లేదు. మనిషిలో కదలిక లేదు. జయలక్ష్మి నివ్వెర పోయింది. ఆమెకన్నీళ్లు ఇంకిపోయాయి. ఏడవా లని పించింది. తల బద్దలుకొట్టుకోవా లనిపించింది. కాని కన్నీరు రాలటం లేదు. ఏమైంది? తన హృదయంలో ఇన్నాళ్ళూ అనంతంగా పొంగుతూ నిక్షిప్తమైవున్న దుఃఖం ఏమైనట్టు? తన నెందుకు మోసం చేస్తున్న దీ కన్నీరు? బుల్లిరెడ్డిని కారులో ఎక్కించుకుని వెళ్ళిపోయారు పోలీసులు. ఆమె స్టేషనులోనే దిగబడిపోయింది. తన సూటుకేసు ఒక చెట్టు క్రింద వేసుకుని కూర్చుంది. కూలివాడు వచ్చాడు. 'అమ్మా బండివస్తూంది' అన్నాడు. బండి వచ్చింది. అందులో ఒక మూల కూలబడింది. ఆ బండి ఎక్కడికి వెళ్తున్నదో ఆమెకు తెలియదు. తెలుసుకోవాల్సిన అవసరంగూడా లేదు.

---